# చతుర

డిసెంబరు 2007
వెల రూ. 10/-



నవులూరి
వెంకటేశ్వరరావు
వైవిధ్య నవల
**అవశేషం**

# విపుల ఆహ్వానము

## అనువాద కథలకు

సుతిమెత్తని సంవేదనలు

అనురాగభరిత ఆత్మ నివేదనలు

ఉత్కంఠభరిత కథన వేగాలు

ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

### ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన
అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే**
**విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

*రచనలు పంపవలసిన చిరునామా*

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల [illegible] అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల [illegible] వ్యాధులకు రసాయన, నాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిఋతుక్రమము సక్రమముగా లేకపోవుట, ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు శుష్కించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు, జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్ ❖ రక్త మొలలు, ఆర్శ మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, తీల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చర్మీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధు మేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగరు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రీన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు, పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్లునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన.
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్ట్సు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 60/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M

సంపుటి - 30
సంచిక - II
డిసెంబరు 2007
359వ సంచిక

# చతుర



విశాఖ నేపథ్యంగా
ఓ సగటుజీవి
తన జీవనగమనాన్ని
విలక్షణంగా,
వినూత్నంగా
ఎలా నడిపించాడో
తెలియచెప్పే
నవులూరి వెంకటేశ్వరరావు
నవల
**'అవశేషం'**
10 వ పేజీలో
బొమ్మలు: వాసు

ముఖచిత్రం : స్నేహ ఉల్లాల్

టా2క్ బండ్ కథలు



# అర్జెంట్

**సెల్**ఫోన్ రింగయింది.

ఆ రింగ్‌టోన్ వినగానే అందాకా సరదాగా నవ్వుతున్న అతనిముఖంలో ఒకలాంటి విసుగు! అయినా వీలైనంత సంతోషాన్ని గొంతులో నింపుకుని 'హాయ్ ప్రసూ.. హౌ ఆర్యూ?' అన్నాడు.

ఆ తర్వాత '...అబ్బే ఇంకెక్కడ? ఇంకా ఆఫీసులోనే తగలడ్డా! ఇంకా కనీసం రెండు గంటలైనా పడుతుంది బయటపడేసరికి. మా బాసాసురుడు ఉదయం నుంచీ పెండింగ్‌వర్క్ మీద క్లాసుమీదక్లాసు పీకుతునే ఉన్నాడు' అంటూ ట్యాంక్‌బండ్ మీది సోఫాలో రిలాక్స్‌డ్‌గా వెనక్కు వాలాడు రాజశేఖర్. అతని ఒళ్లోపడుకున్న సంధ్య నిశ్శబ్దంగా నవ్వుతూ అతన్నే చూస్తోంది.

'సరే నీ సంగతేంటి డియర్?' సంధ్య బుగ్గమీద వేలితో సున్నాలు చుడుతూ అడిగాడు రాజశేఖర్.

తర్వాత అతనే- 'మైగాడ్.. తలనొప్పా? సారిడనో.. అనాసినో వేసుకోకపోయావ్? ఓ బిళ్లవేసుకుని వేడిగా ఓ కప్పు కాఫీతాగితే రిలీఫ్ వస్తుంది..'

'.... ....'

'వెంటనే రమ్మంటే ఎలా? వాడు నాపీక పిసుకుతాడు..'

అతనామాట అనగానే సంధ్యలేచి రాక్షసిలా నోరుతెరిచి, రాజశేఖర్ పీక పిసకబోయింది.

అతను ఆమె బుగ్గమీద చిటికేస్తూ- 'ఫర్వాలేదులే.. ఒక్క పావుగంట అమృతాంజనం పట్టించి విశ్రాంతి తీసుకో తగ్గిపోతుంది..'

ఫోన్ డిస్కనెక్టయింది.

'హమ్మయ్య.. సిగ్నల్స్ ఫెయిలై రక్షించాయి' అంటూ నవ్వుతూ సంధ్య ముంగురులు సవరించాడు రాజశేఖర్.

'ఔరా నువ్వు రాజశేఖరుడివి కాదు.. మహా నటశేఖరుడివి' కిలకిలా నవ్వింది సంధ్య.

'తప్పదమ్మా... కొన్నిపరిస్థితుల్లో నటించక తప్పదు. అయినా ఈ సంధ్యా సుందరి కోసం ఇలాంటి నటనలింకెన్ని చేయాలో..'



మళ్లీ ఫోన్ రింగయింది.

'ఏమిటి? నన్నిలా తడవతడవకీ డిస్టర్బ్ చేస్తే నేను పదింటికి కూడా బయటపడలేను డార్లింగ్!... ఏమిటీ కళ్లు తిరుగుతున్నాయా? బీపీ డౌనయిందేమో? ఓ పన్చెయ్! ఓ గ్లాసుడు నీళ్లలో ఓ చెంచా ఉప్పేసుకుని తాగు. పదినిముషాలకల్లా అంతా నార్మల్ అవుతుంది' అంటూ ఫోన్ కట్‌చేశాడు రాజశేఖర్.

'ఆమెకంత బాగాలేనప్పుడు వెళ్లకూడదా రాజూ?' అంది సంధ్య. అపరాధభావం ఆమె కళ్లలో మెదుల్తోంది.

'ఆవిడకి మున్నూటరవై అయిదు రోజులూ... ఏదో ఒకసమస్య ఉంటూనే ఉంటుందిలే.. అదిసరే

గ్రాఫిక్ : సముద్రాల

సంజూ ఆ శ్రీశ్రీగారి విగ్రహాన్ని చూస్తుంటే నీకేమనిపిస్తుంది? '

'నీకేమనిపిస్తుంది? '

'శ్రీశ్రీగారిని.. ఆయన బొమ్మచుట్టూ గిరికీలు కొడుతూ కింద ఆడుతున్న ఆ పిల్లల్ని చూస్తుంటే ఆయన రాసిన- వానకురిస్తే.. మబ్బుమెరిస్తే.. ఆకసమున హరివిల్లు విరిస్తే గీతం మనసులో మెదులుతుంది. మనసంటే గుర్తొచ్చింది.. శ్రీశ్రీగారి 'మనసున మనసై బతుకున బతుకై' పాట గుర్తుందా నీకు? ...'

మళ్లీ ఫోన్ రింగయింది.

'ఓ గంటసేపు దీని గొంతు నొక్కేస్తేగానీ తిక్కకుదరదు..' అంటూ చాలా విసుగ్గా 'హలో ఏంటి? నన్ను ఆఫీసులో పనిచేసుకోనిస్తావా లేదా? ఏమిటీ.. మా అమ్మకు రెండురోజుల నుంచీ వామిటింగ్స్ మోషన్స్సా? ఎవరు చెప్పారు? శ్రీరామ్ ఫోన్ చేశాడా? సర్లే! రేపు సాయంత్రం ఆఫీసులో పర్మిషన్ తీసుకుని వెళ్లి చూసొస్తా. ఆc... ఇంకేమిటి? అరగంట నుంచీ నీకూ వాంతులవుతున్నాయ? మధ్యాహ్నం ఏం తిన్నావు? అజీర్ణం చేసి ఉంటుంది. ఓ జెల్సిల్ నోట్లో వేసుకో! అలాగే ఫ్రిజ్‌లో ఈనో ఉంది కదా? కాస్తంత పౌడర్ నీళ్లలో కలుపుకుని తాగు పావుగంటలో తగ్గిపోతుంది' అంటూ ఫోన్ కట్‌చేశాడు రాజశేఖర్.

'అమ్మో రాజశేఖర్ మీ మిసెస్‌తో ఎలా వేగుతున్నావోగానీ గంటలోనే ఇన్ని అనారోగ్య సమస్యలా? మైగాడ్' సానుభూతి చూపింది సంధ్య.

'హమ్మయ్య ఇప్పటికైనా నా పరిస్థితి నీకర్థమైంది థ్యాంక్స్. ఇల్లు కాదది నరకం! ఇంట్లో కాలుపెడుతూనే సమస్యల దండకం వల్లెవేయడం మొదలవుతుంది.. ఇక చిరాకు పుట్టమంటే ఎందుకు పుట్టదు? '

'నిజమే ఇలాగైతే ఎవరికైనా కష్టమే'

'అందుకే శ్రీశ్రీగారి 'మనసున మనసై' గీతం అంటే పడిచస్తాను. అది వింటుంటే- నువ్వు నమ్ముతావో లేదోగానీ సంజూ! నువ్వే నా కళ్ల ముందు మెదుల్తావ్..'

'అహc అలాగా? '

'ఔను.. ఏదైనా అదృష్టం ఉండాలి..'

అతనేదో అనబోతుంటే ఫోన్ రింగైంది. మళ్లీ ఆవిడనుంచే-

'హలో.. '

'... ... '

రాజశేఖర్ ముఖంలో రంగులు మారుతుంటే ఆందోళనగా అతనివంకే చూస్తోంది సంధ్య ఏమర్థంకాక.



'సరే! ఇప్పుడే బయల్దేరుతున్నా..' అంటూ ఫోన్ కట్‌చేసి- 'సంధ్యా లే.. తొందరగా ఇంటికి వెళ్లాల్సి ఉంది..' అంటూ హడావిడిగా లేచాడు రాజశేఖర్.

'ఏమిటి ఏమైంది ఎనీథింగ్ సీరియస్? '

'అలాంటిదే.. పెన్సిల్ చెక్కుతుంటే బాబిగాడికి వేలుతెగిందట.. ఎంత తెగిందో ఏంపాడో నెత్తురొస్తోందట.. సర్లే మనం మరోసారి కలుద్దాం బబై'

అంటూ బైక్‌స్టార్ట్ చేసి రివ్వున ముందుకు దూకించాడు రాజశేఖర్.

'ఏంటో ఈ మనిషి తీరు' అనుకుంటూ చెదిరిన బట్టల్ని సర్దుకుంటూ తన స్కూటీ వైపు నడిచింది సంధ్య.

-చంద్రప్రతాప్





# చీకటి వెంటే వెలుగు!

ఫ్లోరిడా రాష్ట్రంలో సముద్రంమీంచి వచ్చే తుపానులు (టైఫూన్స్) అధికం. అలా వచ్చే ప్రతీ తుపానుకీ ఓ పేరు పెడుతుంటారు. 1997 హరికేన్ ఏండ్రూ వచ్చింది. లిండా చార్లెస్ (39), ఆమె భర్త రోన్నెల్ (40)లు ఆ తుపానులో హోమ్‌స్టెడ్ అనే ఊళ్ళోని తమకున్నదంతా పోగొట్టుకున్నారు. దాంతో వారు ఫ్లోరిడా రాష్ట్రాన్ని వదిలి స్వంత రాష్ట్రం జార్జియాలోని తమ ఊరు లలోనియాకి తిరిగి వెళ్ళారు. చిల్లిగవ్వకూడా లేకపోవడంతో తమ నలుగురు పిల్లలతో సహా వారు ప్రభుత్వం ఇచ్చే నిరుద్యోగ భృతిమీద ఆధారపడ్డారు.




అయితే దురదృష్టం వెన్నంటే, అదృష్టం కూడా ఉంటుందని పెద్దలు చెప్పినట్లుగా అదృష్టదేవత దయ వారిమీద కురిసింది. ఓరోజు లిండాకి ఓ ఆలోచన కలిగింది. 'దేవుడు ఫ్లోరిడాలో నాకున్నదంతా పోగొట్టాడు. ఈ రాష్ట్రంలో ఇస్తాడు' అనుకుంది. దాంతో లిండా ఒక డాలరు పెట్టి లాటరీ టిక్కెట్‌ని కొన్నది.

జార్జియా స్టేట్ లాటరీస్ పవర్‌బాల్‌లో ఒక డాలరు పెట్టి ఓ టిక్కెట్‌ని కొన్నాక, రెండు రోజుల తర్వాత దాన్ని కొన్న షాపులోని సేల్స్‌మెన్‌కి దాన్నిచ్చి అడిగింది, లాటరీ తగిలిందేమో చూడమని.

"లిండా! మీకు 50లక్షల డాలర్లు తగిలింది!" చెప్పాడతను చెక్ చేసి.

షరతుల ప్రకారం ఏడాదికి 1,65,000 డాలర్ల చొప్పున 2013 దాకా ఆమెకి లాటరీ కంపెనీ డబ్బు చెల్లిస్తుంది.

కూలిపోయిన తన ఇంటి అవశేషాల దగ్గర నిలబడి కడుపు తరుక్కుపోయేలా ఏడ్చిన లిండాకి ఆ వార్త ఎంతో ఆనందాన్ని కలిగించింది.

ఇంటికి పరిగెత్తుకెళ్ళి తన భర్తతో చెప్పింది.

"మనం లక్షాధికారులం అయ్యాం"

వంటవాడిగా పనిచేసే రోన్నికి, ఎడ్మినిస్ట్రేటివ్ అసిస్టెంట్‌గా పనిచేసే లిండాకి ఓ చిన్న కారు, దుస్తులు, భోజనానికి సరిపడే డబ్బు తప్ప ఇంకేం లేని పరిస్థితిలో ఇది గొప్ప ఆధారం అయింది. అంతదాకా బీదవాళ్ళలా భోజనం చేసిన ఆ కుటుంబం మహరాజుల భోజనాన్ని తినగలిగే స్థాయికి చేరుకున్నారు. అంతదాకా తమ సోదరి నించి ఆర్థిక సహాయం పొందిన లిండా దాన్ని ఇప్పుడు తీర్చగలిగింది.

జార్జియా స్టేట్ లాటరీ ప్రతినిధి డెబ్రా జేమ్స్ వాళ్ళకి తొలి చెక్‌ని ఇస్తూ చెప్పాడు-

"లిండా ఆమె భర్త విషయంలో మాకు ఎంతో ఆనందంగా ఉంది. చాలా లాటరీ కథలకి మంచి ముగింపులుంటాయని ఇంకోసారి రుజువయ్యింది."

అయితే రోన్ని కాని, లిండాకాని దాన్ని వృథా చేయదలచుకోలేదు. ఓ చిన్న ఇల్లు కొనుక్కుని మిగిలింది పిల్లల కాలేజీ చదువులకోసం బేంక్‌లో వేస్తున్నారు.

అతనో అభిమన్యుడు!
దిగువ మధ్యతరగతి కుటుంబంలో పుట్టి,
తిమిరంలాంటి పేదరికంతో ఓవైపు..
అనుక్షణం ఎదురయ్యే ఇతరత్రా అనేకానేక
కుటుంబ సమస్యలతో మరోవైపు
నిత్యసమరం సాగించే అభిమన్యుడు.

మధ్యతరగతి జీవితంలో చెదురు
మదురుగా తొణికిసలాడే మందహాసాన్నీ,
ఎల్లవేళలా అంటిపెట్టుకుని ఉండే
అంతులేని మనోవేదననూ
అనుభవిస్తాడతను.

జీవన పోరాటంలో తారసపడ్డ వ్యక్తులు
అతనికి ఏం బోధించారో..
ఎదురైన సంఘటనలు
ఏ పాఠాల్ని నూరిపోశాయో వెల్లడించే
**నవులూరి వెంకటేశ్వరరావు** వైవిధ్య భరిత నవల
**అవశేషం** ఈ నెల చతుర సమర్పణ.

తుపానేమో! సన్నటి జల్లు పడుతోంది. ఇంటి దగ్గర తప్ప ఎక్కడైనా వర్షం అందంగా కనిపిస్తుంది, ఇంకా కురవాలి అనిపిస్తుంది. ఆనందాన్ని, మత్తును కలిగిస్తుంది. బయట కురిసిన వర్షం రోడ్లమీద, సందుల్లో, మురికి కాలువల్లో మాయమైపోయినా ఇంట్లో మాత్రం మరో అవతారంలో ప్రత్యక్షమవుతుంది. విపరీతమైన తేమ, సున్నం ఊడిపోయిన గోడలు, ఎర్రటి గచ్చు, రంగుకు నోచుకోవటం ఏనాడో మానేసిన పాత చెక్క తలుపులు- అన్నీ చెమరుస్తాయి. ఎండకు ఎండుతూ, గాలికి ఆరుతూ వాటి బాధలకు తాళలేక ఇలాంటి ఇళ్లలో తేమ తలదాచుకుంటుందేమో. రాత్రివేళయితే స్నానాల గదిలో పడుకున్నట్లుంటుంది. అప్పుడు రాత్రిని ఎవరన్నా శాశ్వతంగా నిషేధిస్తే బాగుణ్ణు అనిపిస్తుంది. ఇంట్లో మసలుతున్నప్పుడు, పవలూ చికాకుని కలిగిస్తుంది తేమ. పవలును కూడా నిషేధిస్తే బాగుణ్ణు అనిపిస్తుంటుంది. ముక్క కంపు కొడతాయి జీవంలేని వస్తువులు. మనుషులూనూ. పడుకున్నప్పుడు వెన్నులో చలిపుట్టి కొనసాగుతుంది. పక్కగుడ్డలు చల్లగా ఉంటాయి. చిరంజీవి ఉచ్చపోశాడా, ఇక చావే. ఇంటి కప్పు ఒక జల్లెడ. కింద మూడు నాలుగు గిన్నెలో, పళ్లేలో పెట్టాలి. అప్పుడు వర్షపు నీరు జారిపడుతూ టప్, టప్‌మని శబ్దం చేస్తుంటుంది, ఎవరన్నా నిద్రపోగలిగిన వాళ్లుంటే ఆ అదృష్టం వాళ్లకు లేకుండా చేయటానికి. తండ్రి లేచి (అంతకుముందు వర్షం నిద్రపోనిచ్చి ఉంటే) దిండు కింద నించి అగ్గిపెట్టె, చుట్ట తీస్తాడు. అగ్గిపుల్ల అల్లరి క్షణం వినిపిస్తుంది. దాంతో అగ్గిపెట్టె పక్కన గీసినపుడు కసురుకున్నట్టు రాపిడి శబ్దం. తర్వాత వెలుగు, చీకటికయిన గాయంలా. మంచం మీదినుంచి కిందికి కాళ్లు వేలాడేసి కూర్చుంటాడు. పళ్ల మధ్య చుట్ట బిగపట్టిన నోటితో, చుట్ట వాసన పీలుస్తున్న ముక్కుతో "అందరూ లేచిపోయార్రా? " అన్న ప్రశ్నకాని ప్రశ్నను వేస్తాడు. మాటల్లో కించిత్ చిలిపిదనం, కించిత్ బాధ వ్యక్తమవుతాయి. అందరికీ మెలకువ వచ్చినా ఎవరూ సమాధానం చెప్పరు.

కిటికీలోనించి బయటికి చెయ్యి చాచాడు అభిమన్యు. చాలా సన్నటి వర్షం. తడపటానికి మొహమాటపడుతున్నట్లు; ఏదో అపరాధ భావం వేధిస్తున్నట్లు. ఆకాశమంతా పావురాల ఈకల అల్లిక పనిలా ఉంది. ఎవరిమీదో అలిగినట్లు గాలి మాత్రం వీచటంలేదు.

"పురుషులు, స్త్రీలు, పిల్లలు వీధులలో ఇళ్లలో చనిపోయారు. అలాగే వదిలివేయబడినారు. అంత్యక్రియల ప్రసక్తి లేదు. వివిధ రకాల అస్థిపంజరాలు దొరికాయి. ఒకచోటయితే వాటి గుట్ట ఉంది. ఒకదాని మీద ఒకటి కుప్పగావేయబడ్డ అస్థిపంజరాలలో ఏదో బాధతో చనిపోయిన వైఖరి కనిపించింది. నగరం నించి పెట్టే బేడాతో ఏదో దాడినుంచి జనం పారిపోవటానికి ప్రయత్నిస్తుండగా వారిని ఎవరో ఊచకోత కోసినట్లుగా..."

శేషాచలం మాస్టారు చరిత్ర ఒరవడిలో కొట్టుకుపోతుంటాడు. చెప్పే పాఠాన్ని ఆనందించేవాళ్ళు ఆనందిస్తారు. నవ్వుకునే వాళ్లు నవ్వుకుంటారు. 'గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్' అని పూర్తిగా నమ్మిన వ్యక్తి. చరిత్ర బొమికల గురించో, శిథిలాల గురించో వెదుకుతున్నప్పటిలా వుంటుంది నడక. నియాండర్‌థాల్ మనిషిని తప్ప మరొకరిని అతగాడు మెచ్చుకోడు.

"ఈ కారణాలవల్ల సింధూ నాగరికత క్షీణించింది అని ఇప్పుడు పరిశోధకులు భావించడంలా..."

గత సంవత్సరం శేషాచలం ఆరాటం



# చెల్లెళ్ళకు అక్క ప్రాణభిక్ష

**న్యూ** హేంప్‌షైర్ రాష్ట్రంలోని పోర్ట్‌మౌత్ అనే ఊరికి చెందిన 51 ఏళ్ళ డయానాకి 2002 ఆగస్ట్‌లో బాగా తలనొప్పి వచ్చింది. దాంతో తను డాక్టర్ దగ్గరికి వెళ్ళింది. సాధారణంగా డాక్టర్ దగ్గరకి వెళ్లడానికి బద్దకించే ఆమె, తలనొప్పి బాగా రావడంతో వెళ్ళింది.




అందువల్ల ఆమె బతకడమే కాక, ఆమె ఇద్దరు చెల్లెళ్ళు కూడా రక్షింపబడ్డారు!

డాక్టర్ డయానాకి జరిపిన బ్రెయిన్ స్కాన్‌లో అనేయూరిస్మా అనే వ్యాధిని కనుగొన్నారు. రక్తనాళం రక్తాన్ని ప్రసారం చేసే బదులు బెలూన్‌లా ఉబ్బడమే ఈ జబ్బు లక్షణం. సరైన సమయానికి దానికి చికిత్స జరక్కపోతే అది పేలిపోయి మరణం లేదా పక్షవాతం సంభవించచ్చు.

మెదడులో అప్పటికే రక్తం కారుతోందని వెంటనే ఆపరేషన్ అవసరం అని డాక్టర్లు ఆమెకి చెప్పారు. బోస్టన్‌లోని మసాచుసెట్స్ జనరల్ హాస్పటల్‌కి ఆమెని తరలించారు. ఆరు గంటల ఆపరేషన్ తర్వాత ఆమె ప్రాణాన్ని రక్షించారు.

ఆమె అమ్మమ్మ, పినతల్లి బ్రెయిన్ అనేయురిస్మా వ్యాధితో మరణించారని డాక్టర్లకి తెలియగానే ఆమె ముగ్గురు చెల్లెళ్ళు మేరీ, హెలెన్ (47)లకి డాక్టర్లు బ్రెయిన్ స్కానింగ్ చేసారు. మేరీ, హెలెన్‌లకి ఆ రోగం అప్పటికే వుందని కూడా గుర్తించారు. ఇరెనె ఆరోగ్యంగానే వుంది.

డయానాకి ఆపరేషన్ చేసిన సర్జనే, ఆమె ఇద్దరు చెల్లెళ్ళకి కూడా ఆపరేషన్ చేసి వాళ్ళ ప్రాణాలని రక్షించాడు.

డయనాలో ఆ వ్యాధి లక్షణాలు కనపడకపోతే ఆమెతో పాటు ఆమె ఇద్దరు చెల్లెళ్ళు రోగానికి బలయిపోయేవారు.



గుర్తుకొస్తోంది. సముద్రపు ఒడ్డునుంచి గాలికి ఎగిరి నీట్లో పడతాడేమో అనిపించింది. ఇసుకలో కాళ్ళు అదిమి నడుస్తుంటే, గాలి వంచిన విల్లులా తోచాడు. శిథిలాల కన్నా శేషాచలం చేష్టలు, హడావుడి వినోదం కలిగించాయి. కోణార్క దేవాలయాన్ని ఎవరు కట్టించారో పదోసారి చెబుతుంటే, "శేషాచలం మాస్టారు" అని పాతదే చలోక్తి వేశారు ఎవరో.

"అయివుండవచ్చు ఆ జన్మలో" అన్నాడాయన.

"అది కట్టించినాయన్ని లాంగూల నరశింహదేవ అనే వారట... లాంగూల అంటే తోక అట గదా, మాస్టారు? "

"తోకలమాట అటుంచండి. మీలో ఒక్కొక్కరికి అవి వంద వున్నాయి" అన్నాడు.

శిథిలమైనా కోణార్కలు కోణార్కలే, మొహెంజదారోలు మొహంజదారోలే. గర్వం కలిగించేవి, విలువైనవి. అవి నిరుటివి కాబట్టి. నేటి శిథిలాలకు విలువ లేదు. పరిఢవిల్లుతున్న నాగరికత మధ్యనా శిథిలాలుంటాయి, క్షీణించిన నాగరికత లోనే కాక.

ఇక ఒక వారంలో కాలేజీ మూస్తారు. ఈ జీవిత చరిత్రలో ఒక అధ్యాయం ముగుస్తుంది. ఎందుకు కాలేజీలో చేరినట్లు? ఉద్యోగ సాధనమైన విద్య గురించా, విజ్ఞాన సముపార్జనకా? దేనికీ ఇది ఉపయోగపడదు. తండ్రి కళాశాలలో చేర్రా అన్నాడు. తండ్రి మాట శిరోధార్యమన్నట్లు పితృవాక్య పరిపాలకుడిలా చేరాడు. తనకు తను ఒక నిర్ణయం తీసుకోలేనప్పుడు మరొకరు చెప్పినట్లు చేస్తే పోతుంది. ఎటుపోయి ఎటువచ్చినా తప్పు వాళ్ళమీద తోసేయవచ్చు. ఈ కళాశాల జీవితంలో పదిలపరచుకోదగిన అనుభవాలు లేవు. రెండు మూడు జతల బట్టలతో, అనుక్షణం సెల్ఫ్‌కాన్షస్‌గా, చేతిలో ఏగాణీ లేకుండా జీవించటం మరిచిపోదగిన అనుభవం-మరిచిపో గలిగితే. భవిష్యత్తులో విచారంతో కూడిన ఆనందం కలిగించే జ్ఞాపకంగానూ ఇది పనికి రాదు.

ప్రసూన ముందు బెంచిలో కూర్చుని దీక్షగా వింటోంది. కుడిచేతి వేళ్లలో క్యాప్ తీసిన పేనా ఎత్తిపట్టుకుని, చేతిని బుగ్గకు ఆనించి మరీ వింటోంది, ఆయన ఈమె వంశ చరిత్ర చెబుతున్నట్లు. వెనుక బెంచిలో ఆడపిల్లలు ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు, శేషాచలం కంఠం ముడి కదలికలకేమో. అది నిత్యనూతన విషయం వాళ్లకు. కిటికీలోంచి చూస్తే కలహంస గమనాన దమయంతి వస్తోంది. ఎవరికో ఏదో సమాధానం చెబుతోంది. కలికి ఎక్కడికే అని అడిగితే అలదేవదేవు సన్నిధికి అన్నట్లు. అందుకా నవ్వులు? ఆమె శేషాచలంతో మాట్లాడితే క్లియోపాత్ర ముందు నిలబడ్డట్లు మెలికలు తిరుగుతాడు. హరప్పన్ లిపిలా ఆమె ముఖంలోని భావాలు మాత్రం ఎవరికీ అర్థం కావు. "బట్టలు లేకపోతే మొహెంజదారో కాంశ్య నృత్యకారిణిలా వుంటుందేమో" పుష్పరాజన్నాడు అభిమన్యు చెవిలో. ఒకటి మాత్రం నిజం. నిలబడినప్పుడు ఆ విగ్రహంలాగే తల వెనక్కు వంచి నడుం మీదికి చేతిని చేర్చుతుంది.

**"బట్టలు లేకపోతే మొహెంజదారో కాంశ్య నృత్యకారిణిలా వుంటుందేమో" పుష్పరాజన్నాడు అభిమన్యు చెవిలో. ఒకటి మాత్రం నిజం. నిలబడినప్పుడు ఆ విగ్రహంలాగే తల వెనక్కు వంచి నడుం మీదికి చేతిని చేర్చుతుంది.**

గంట దీర్ఘంగా మోగుతుంటే శేషాచలాన్ని తోసుకుని మరీ విద్యార్థులు తరగతి గదినించి బయటపడ్డారు, రాతియుగపు గుహనుంచి బయటికొచ్చినట్టు. బస్సు

ఎక్కి జగదంబ జంక్షను దగ్గిర దిగాడు. ఆ నాగరికత నుంచి ఈ నాగరికతలోకి అడుగు పెట్టాడు అభిమన్యు. చేతిలో పుస్త కాలు, పనికిరాని ఆయుధాలలా.

ఇది ఆధునీకరించబడిన ఎల్లమ్మతోట. అంగుళం ఖరీదు వంద రూపాయలు పలుకుతున్న నేలమీద నిలబడ్డాడు. నగరం నడిబొడ్డు. అందుకే అంత విలువ. అంత విలువైన నేలమీద నిలబడ్డవాళ్ళు, నడుస్తున్న వాళ్ళు మాత్రం అందరూ ఖరీదైన వాళ్లు కాదు. పుట్టిన నిముషాల తర్వాత బొడ్డులకి విలువలుండవు. వాటితో పనీ వుండదు. శరీరంలో గుండెను చేరని రక్తం వుండనట్లే ఈ నగర నడిబొడ్డు తాకని జనం వుండరు. రూపాయే ఇంధనం గమ్యమూ రూపాయే.

అరగంటకు పైగా నిలబడ్డాడు ఎప్పుడూ వుండే ఆ వింతలను దృశ్యాలను చూస్తూ వర్షం ఆగింది. కాళ్లు పీకుతున్నాయి. మరొక బస్సెక్కాలంటే డబ్బులు కావాలి.

నడక మొదలు పెట్టాడు. టర్నరు చౌల్ట్రీ దగ్గిరకు వచ్చాడు. ఈ ప్రాంతాన్ని ఏనుగులతోట అనేవాళ్లు వందేళ్ల క్రితం. 1891-92లో కట్టిన ఈ అతిధి గృహానికి అప్పటి ఆంగ్లేయ జిల్లా అధికారి హెన్నీ గ్లిబుల్ టర్నర్ పేరు పెట్టారు. దీర్ఘ చతురస్రాకారపు కట్టడం. ప్రవేశమే అతిథులకు స్వాగతం చెబుతున్నట్లుంటుంది. లోపలి కెళితే ఉత్తరం, దక్షిణం వైపుల గదులు మధ్యలో పెద్ద చావిడి వుంటాయి. రాతి స్తంభాలు, చెక్క స్తంభాలు, చవుడు సున్నం, పెంకులతో కట్టిన కట్టడం. ముక్కోణపు ముందు చూరు. అది దాటి, సర్దార్ వల్లభాయి పటేల్ పేరు పెట్టిన ఒకనాటి పూర్ణా మార్కెట్టు, 1860 సంవత్సరంలో ఇసుక కొండ (శాండ్‌హిల్) మీద కట్టిన మిసెస్ ఎ.వి.ఎన్. కాలేజీకి దారి తీసే 'కాలేజ్ డౌన్' మీదుగా, కొత్త రోడ్డు దగ్గిర ఎడమ మలుపు తిరిగి చెంగల్రావు పేట వైపు నడిచాడు. చెంగల్రావు అనే ఆయన గోడే జమీందారు కుటుంబంలోని వాడు. ఈస్ట్ ఇండియా కంపెనీలో ప్రాముఖ్యత గల అధికారిగా పనిచేశాడు. విపరీతమైన ఆస్తిని ఆర్జించాడు. ఈ ప్రాంతపు ఊరు పెరగటానికి ఆ రోజుల్లో కృషి చేశాడు.




ఇల్లు చేరాడు. తలుపు దగ్గిరగా వేసి వుంది. లోపలికి అడుగు పెట్టాడు. 'హా' అని అరిచాడు తలుపు చాటున దాగి వున్న తమ్ముడు, ముందుకు దూకి. వాడు తను రావటం ఎలా గమనించాడో? నాలుగేళ్ల వయసు వాడిది. అభిమన్యు ఉలిక్కిపడ్డాడు. మనసులో ఆలోచనల వర్షం ఇంకా కురుస్తుండటం చేత కోపం వచ్చింది. చెయ్యెత్తాడు దెబ్బవెయ్యటానికి, దించాడు వాడి బుగ్గ నులమడానికి వాడి బిక్కమొహం చూసి. వాడ్ని పైకెత్తి దించి పిర్రల మీద చరిచాడు.

"అమ్మా, అన్నయ్య..." అంటూ ఇంట్లోకి పిచ్చుకలా తుర్రుమన్నాడు. ఎవరినో బంధువును చూడటానికన్నట్లు వరండా లోకి వచ్చిందామె.

"వర్షంలో తడిశావా?"

"కావాలని తడవలేదు"

"కాసేపాగి రావచ్చుగా?"

"ఆగి ఆగి పడుతోంది వర్షం. ఎన్నిసార్లు ఆగగలను. అయినా అది సన్నటి జల్లే"

వరండాలో కూర్చున్నాడు చొక్కా

గుండీలు తప్పిస్తూ. ఆమె తెచ్చిచ్చిన మంచినీళ్ల లోటా ఒక చేత్తో తువ్వాలు మరొక దానితో అందుకున్నాడు. ఆమె అతని వాళ్లోని పుస్తకాలు తీసుకుంది. నీళ్లు తాగి లోటా ఇచ్చేశాడు. తువ్వాలుతో తల అద్దుకుని ఇచ్చేశాడు.

"సరిగా తుడుచుకో తల తడి అలాగే వుంది"

"ఆ తువ్వాలుతో లోపలి తడి ఆరదులే"

"తువ్వాలుకేం బాగానే వుంది కదా? "

★ ★ ★

తల్లిచేత చిన్నవాడు పద్యం చెప్పించు కుంటున్నాడు. బుట్ట కుర్చీలో కూర్చుని నవలా పారాయణం చేస్తోంది అక్క. దాని ప్లాస్టిక్ వైరంతా తెగి వేలాడుతోంది- ముక్కలు ముక్కలుగా, తెగిన కుక్క పేగు లలా. కంత ఏర్పడింది దాంట్లో కుదురులా. లోపల చదువుకుంటున్నా ఆమె పెదవులు కదులుతున్నాయి. కుంకుమ చెదిరి కుడి కనుబొమలో దాక్కుంది.

బీరువాకు ఒక తలుపు లేదు. ఊడిపోయిన తలుపు రెక్కను బీరువా, గోడల మధ్య కంతలోకి తోశారు. రెండు రెక్కల అద్దాలూ ఏనాడో పగిలిపోయాయి. అది ఇల్లు గల వాళ్లది. పనికొచ్చేవి, పనికి రానివి, ఎలుకలు తినేసినవి ఏవేవో వున్నాయి అందులో. కాల ప్రభావం వల్ల పెళుసుగా పట్టుకుంటే పొడిగా మారేట్లున్న పుస్తకాలు పేర్చి వున్నాయి. ఇల్లు గలావిడ చనిపోయిన మొగుడివి. చనిపోవటం జరిగి ఎంతకాలం అయిందంటే ఆమె కూడా ఆయన్ను మరచిపోవటం ఆరంభించినంత.

బీరువా పక్కన గూడు. విద్యుత్తు పోయినపుడు వెలిగించి పెట్టే కిరసనాయలు దీపపు బుడ్డికి తప్ప ఆ గూడు ఎవరికీ నీడనిచ్చేది కాదు. ఉపకారం చేసి చేసి గూడు పొగ చూరిపోయింది. సీసా మూతకు కన్నం కొట్టి గుడ్డ పీలికను సన్నగా మెలేసి దూర్చి సీసా కడుపులో నూనె పోసి తయారు చేసినది. అది చీకటిని కాల్చి నుసిచేసి, గూడంతా నింపుతుంది ఘనకార్యం అందరికీ తెలియాలన్నట్లు. కుక్క వేషం వేసుకున్న గాడిద కుక్క ధర్మం నిర్వహిస్తోంది. సమర్ధవంతంగా ఎవరిచ్చినా వెలుగు ఆహ్వానించదగిందేగదా. చీకటిని పారద్రోలటం కావాలి. కళ్లు చీకటిలో చూడగలిగి వుంటే వెలుతురుతో పనేంటి.

బీరువా కుడివైపు కిటికీ. అది ఇంటి పక్క సందులో ఏం జరుగుతుందో తెలుసుకోవటానికి మాత్రం ఉపయోగపడుతుంది. ఇనుప కడ్డీలు దిగేశారు. ఏ దొంగ వస్తాడనో మనిషే పట్టని కంత. దొంగలు సూక్ష్మరూపంతో రావచ్చును. చెప్పలేం, పిదప రోజులు.

పెంకుటిల్లూ, చవుడు సున్నపు గోడలు. అరవై సంవత్సరాల వార్ధక్యపు ఇల్లు.

గడపలు అరిగిపోయాయి. గోడలనిండా మేకులు. మేకులు లేని మేకులు చేసిన కన్నాలు; ఆకాశంలో చుక్కలన్ని. మూడేళ్ల నాటి లక్ష్మీదేవి క్యాలెండరు. లక్ష్మీదేవి కాబట్టి ఏ సంవత్సరానిదైనా దాన్ని పారేయలేరు, జ్యేష్ఠాదేవి విలయతాండవం చేసే ఇల్లయినా సరే. గతంలో క్యాలెండర్లు కదిలి కదిలి చేసిన గోడ గాయాలు. కుటుంబ ఛాయా చిత్రం; నలుగురే వున్నారందులో- పదేళ్లనాటిది. తల్లి, తండ్రి, నాయనమ్మ, తామిద్దరు. నాయనమ్మకు మోకాలిమీద వ్రణం వుండేది. మానీమానక వుండిపోయింది ఆమె చావు దాకా. చివరకు, చితిమంట ఆమెను, ఆమె అభరణం లాంటి వ్రణాన్ని ముగించింది. ఎపుడూ చూపుడు వేలుతో దాన్ని రాస్తుండేది, దురదేమో. ఆమె రెండో ఆభరణం రుద్రాక్షమాల. అది ఛాయా చిత్రంలో పడేట్టు సరిచేసుకుంది, రెండవదానికి

ఎలాగూ ఆ వీలు లేదు కాబట్టి. "కారే రాజులు" పద్యంలోని మనిషి తీసుకుపో లేని వాటి మాటేమోగాని, ఆ ఆభరణాన్ని మాత్రం ఆమె తనతో గొనిపోయింది. మిగ తావాళ్లకు అక్కరలేని ఆభరణం, తొలగిం చలేని ఆభరణం. నాలుగు మూలలా డ్రాయింగు పిన్నులతో గోడకు కొట్టబడిన చలనచిత్ర నటుడు- అరవై వయసులో ఇరవై ఏళ్లున్నట్లు నటించిన పాపానికి శిక్షలా.

రెండు గదుల వంటిల్లు. నిజానికి వంట ఇంటితో కలిపి రెండు గదుల ఇల్లు. ఒక గదిని కొంతమేరకు వదిలి విభజన గోడ కట్టారు. ముందు జాఫ్రీ. దాంట్లోంచి రోడ్డువైపుకు కిటికీ వుంది. గాలిని, వెలుతురును అడ్డి, దుమ్మును మాత్రం రానిస్తుం టుంది. కిటికీలకూ కళలు అబ్బుతాయి.

"అన్నయ్యా, కథ చెప్పవూ- ఈగ కథ? "

"ఎప్పుడు పడితే అప్పుడేనా. రాత్రికి బజ్జునేప్పుడు"

"ఇప్పుడూ అప్పుడూ చెప్పొచ్చుగా..." రాగం తీశాడు.

"అల్లుడా రమ్మని... పద్యం వచ్చిందా? ఎన్ని రోజులు నేర్చుకుంటావది. మొద్దు వెధవ... వెళ్లు, అక్క చెబుతుంది నేర్చుకో"

"అన్నయ్యా, పోనీ కోతి కథ పూర్తి చెయ్యి"

"పూర్తయిపోయిందిగా నిన్ననే? పోనీ ఎంతవరకు చెప్పానో చెప్పు"

చెప్పాడు.

"అంతే. ఇంకేం లేదు. డోలు పట్టుకుని కోతి పాడింది- ముల్లు పోయి కత్తి..."

"మొదటి నుంచి కావాలి..."

"రాత్రికి"

"రాత్రికి నిద్దరొస్తుంది"

"ఈ రాత్రికి రాదులే"

"ఊరుకోరా, చిరంజీవి ఏంటల్లరీ" తల్లి.

సుమిత్ర వరండాలోకెళ్లింది. తన డబ్బు మొక్కను చూచుకుని, నిమిరి ఆనందించ టానికి. అది జాఫ్రీ అంతా అల్లుకుపో తోంది. రోజూ ప్రతి ఆకుని పరిశీలిస్తుం టుంది. ప్రతి చిగురుకూ సరదా పడు తుంది. దాని ఆకులు ఒక ఆశ, తీగలు భ్రాంతి. బతకటానికి రెండూ అవసరం. వాస్తవం, నిరాశ చావువైపు మొగ్గు చూపి స్తాయి. భ్రాంతినించి బయిటపడింది. లోపలికి వచ్చి గుడ్డి కిటికీ మూసేసింది, భ్రాంతినయినా ఎందుకు అనుభవించనీయాలి అన్నట్లు కాలువ కంపు కొట్టటం వలన.

"అన్నయ్యా, కథ చెప్పవూ- ఈగ కథ?" "ఎప్పుడు పడితే అప్పుడేనా. రాత్రికి బజ్జునేప్పుడు" "ఇప్పుడూ అప్పుడూ చెప్పొచ్చుగా..." రాగం తీశాడు.

విద్యుత్తు లో వోల్టేజిలోకి మారింది. అరవై వాట్ల బల్బు మొహం మాడింది. కాంతి కూడా లగ్జరీ. అగ్గిపెట్టె తయా రుగా పెట్టుకుంటే మంచిదని తల్లి వంట గదిలోకి వెళ్లింది. అది తీసుకుని వచ్చేసరికి విద్యుత్తు పూర్తిగా పోయింది. గూట్లో వెలిగించిన దీపంబుడ్డి వెలిగింది. సరిగా వెలగటం లేదని సీసా మూత తీసి, అదు గునించి గుడ్డ వత్తి కిందికి లాగి మంట సరిచేసింది. చీకటి గుహలో పొగ చూరుతోంది, మసి సంపదను అధికం చేస్తూ.

వర్షం పడటం లేదు. అయితే ఏ క్షణా న్నైనా పునఃప్రారంభం కావచ్చు వాన కైనా అలసటుంటుంది. వరండాను దాటి ముందుకు సోకలేక ఆగిపోతోంది వెలు తురు. దానికీ పరిమితులుంటాయి. పిండి కొద్దీ రొట్టె, దీపం కొద్దీ వెలుతురు. వరండా ముందు తోడేలులా కూర్చుని

వున్న చీకటి, రోగిష్టి దీపం ప్రాణం ఆరి పోతే దాడి చేయటానికి.

చీకటిలో నుంచి దగ్గు వినబడింది చీకటిని అదిలిస్తున్నట్లు. ఏదో మానవాకారం చీకటి స్నేహితుడిలా నిలబడివున్నట్లు లీలగా కనిపిస్తోంది. దగ్గు, ఆకారం చిరపరిచితమైనవే. గుర్తించటానికి వెలుతురు సహాయ హస్తం అక్కరలేదు. చీకటిలో నించి ఆ ఆకారం వెలుగులోకి రాబోతోంది.

"మీ నాన్నగారిలా వున్నారు. అప్పుడే వచ్చేశారే!"

చెప్పులు వరండాలో వదులుతున్నపుడు చప్పుడు. గూట్లోనించి దీపం తీసి గాలికి ఆరిపోకుండా ఒక చేతిని అడ్డుగా వుంచి వరండాలోకి వెలుతురు సోకేలా పట్టుకుంది భార్య.

"బహు పరాక్, బహు పరాక్..." పాడుతోంది సుమిత్ర.

గుమ్మం పట్టుకుని, నోట్లోంచి చుట్టతీసి రెండు వేళ్ల మధ్య వుంచుకుని, నోట్లోంచి ఉమ్మి కారకుండా జాగ్రత పడుతూ-

"అబ్బాయి వచ్చాడా? "

"వచ్చాడు, ప్రభూ!"

"పాపా? "

"వచ్చింది, ప్రభూ!"

"నా గురించి ఎవరైనా వచ్చారా? "

దీనికి సమాధానం 'రాలేదు, ప్రభూ' కావాలి ఆయనకు.

"ఎందుకో రాలేదు, ప్రభు!"

"నేనూ వచ్చా, నాన్నా" చిరంజీవి.

"ఓరి, ఓరి... ఎప్పుడ్రా? "

"ఇప్పుడే, పైనించి రెక్కలు కట్టుకుని వచ్చి వాలాడు విహంగంలా" సుమిత్ర అన్నది.

చుట్ట నోట్లో వుంచుకుని కుర్రాణ్ణి ఒక చంకలో వేసుకున్నాడు. బయటికెళ్లి ఆఖరి పొగ వదిలి, ఉమ్మి, చుట్ట కొసను పారేసి, ఆకాశంవైపు చూసి కురవదు అన్న తెచ్చిపెట్టుకున్న ఆశాభావాన్ని తనకై తను వ్యక్తం చేసుకుని, పొడి దగ్గు దగ్గుతూ లోపలికి వచ్చాడు.

"కరెంటు పోయి ఎంతసేపయింది? "

"మీరు వచ్చే ముందే" కూతురు సమాధానమిచ్చింది.

కొడుకును బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు పెద్ద శబ్దం చేస్తూ.

"కంపు, నాన్నా..."

"నా దగ్గిర కంపంటావా, నేను కంపునాన్ననంటావా? " మళ్లీ ముద్దు పెట్టుకోబోతున్నట్లు నటిస్తాడు.

"నీవు మంచి నాన్న. చుట్ట కంపుది. అది తాగుతావు కాబట్టి నీవు వాసనొస్తావు"

"చుట్ట తాగకుండా వుండలేకే కదరా తాగటం"

"నేను తాగకుండా వుండటంలా? "

"పెద్దయితే నీవూ తాగుతావేమో. చిన్నప్పుడు నేనూ తాగలా... మంచి బాలుడిని... ముద్దొచ్చేవాడిని నీలా. అలా అని అందరూ అనేవాళ్ళు"

రెండు చేతులతో వాడిని పైకెత్తి పొట్ట మీద మూతితో రాశాడు.

"మీసాలు గుచ్చుకుంటున్నాయి, నాన్నా..."

"మీసాలు గుచ్చుకోక మెత్తగా ఎలా వుంటాయి, నాన్నా" కొడుకు మాటలని అనుకరిస్తూ అన్నాడు.

బుగ్గ కొరికాడు.

"నాన్నా నెప్పి"

"నాన్నా, కొరికితే నెప్పిగా కాక ముద్దు పెట్టుకున్నట్లెలా వుంటుంది? "

"మరెందుకూ కొరకటం, నాన్నా? "

"కొరికితే నాకు బాగుంటుంది కదా- అందుకు, నాన్నా!" తండ్రికి బదులు కూతురంది. తండ్రి గొంతుకను అనుకరిస్తూ, నోట్లో చుట్ట వున్నట్లు మూతిని పెట్టి.

పెద్దగా నవ్వి, కొడుకును దించాడు. పొడుగు చేతుల తెల్ల ఖద్దరు చొక్కా తల



నవ్వులు... విసుర్లు... చురకలు!!
పొట్టచెక్కలయ్యేలా కితకితలు పెడుతూనే-
మెత్తగా వాతలంటించే హాస్యరచయిత
యర్రంశెట్టి సాయి సరికొత్త శీర్షిక
అపార్ట్‌మెంటాలజీ
త్వరలో..
AH
HA
AH
HA
AH
HA

మీదినించి విప్పి చిలక్కొయ్యకు తగిలించాడు. పెద్దనీడ పైకప్పును, గోడను, నేలను విశ్వరూపంలా ఆక్రమించింది. గదిలో ఒక మూలకి ఎత్తిపెట్టి వుంచిన ఇనుప పడక కుర్చీ వాల్చాడు. రెండు చెక్కలమీదికి రెండు కాళ్లు చాపాడు. కుడి చేయి తలకింద మడిచి వుంచుకున్నాడు. గదిలో సగాన్ని ఆక్రమించింది కుర్చీ. అది గతకాలపుది. అందులో కూర్చుంటే గతం తవ్వుతాడు.

"అబ్బాయ్, చొక్కా జేబులో చుట్ట వుంది, అందుకోరా!"

వెలిగించుకున్నాడు.

"రాజారావు మాస్టారు సంబంధం చెప్పేరోయ్"

"ఈ ఊరేనా? "

చంటోడు వళ్లో దూరాడు. మీసాలు ఆటవస్తువు.

"మా నాన్న తద్దినం దగ్గిర పడుతోందోయ్... ఎన్నాళ్లయినా ఆయన ఇంకా గుర్రంమీద తిరుగుతున్నట్లుందోయ్! ఎన్నాళ్లయినట్లు? "

"నేను పుట్టడానికి రెండేళ్లక్రితం ఆయన పోయినట్లుగా మీరు చెప్పగా విన్నా. అంతకు ఎన్నేళ్ల క్రితం గుర్రం ఎక్కి తిరిగారో తెలీదు" ఆమె వ్యంగ్యంగా అంది.

"ఎంతో నిక్కచ్చిగా పన్నులు వసూలు చేసేవాడని చెప్పుకునేవాళ్లు. చిన్నప్పుడు నన్నూ గుర్రంమీద కూర్చోబెట్టి తిప్పేవాడు. మా అమ్మకు గుర్రాన్ని, గాడిదను చూసినా చచ్చేంత భయం... ఒకసారి గాడిద తన్నిందట, గుర్రం తొక్కేసిందట.... రామలింగడి పిల్లిలా..."

"ఆ సంబంధం గురించి చెప్పండి"

"ఆ సంబంధం లాభం లేదులే... ఒక్క పైసా తనది కానిది తినేవాడు కాదు. ఏం నిజాయతీ, ఏం నిజాయతీ! విధి నిర్వహణే ఆయన లోకం..."

"నాన్నా... మళ్లీ మొదలు పెట్టారా? "

కూతురు అడ్డుకోబోయింది.

చుట్టపొగ గుప్పు గుప్పుమని ఊదాడు. ఆ పనైన తర్వాత మాట్లాడటం కొనసాగించదలచినట్లు. తర్వాత దగ్గేడు. ఆ అడ్డు తొలగిన తర్వాత గతానుభవ జీవిత పుటల్లోకి మనసును మళ్లించాడు.

"మా తాత లక్ష్మినారాయణగారు చెబుతుండేవాడు... అప్పటికి మాది సంపన్న కుటుంబమే... ఆయన భార్య, అంటే మా నాయనమ్మ, మా నాయన నెలల పిల్లవాడుగా వున్నప్పుడు చనిపోయింది ఉన్నట్లుండి, ఏ కారణం వలననో..."

"ఇంతకూ ఆ సంబంధం..."

"కొట్టం వారగా వేసివున్న నులక మంచంమీద ఆమె చచ్చి పరుండగా మా

---

**చతుర సమీక్ష** | **డిసెంబరు '07 నవల 'అవశేషం'**

చతుర సమీక్షకు ఆఖరి తేది 25

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు:

________________________________

చిరునామా:

________________________________

________________________________

________________________________






# గుర్రాల తోకలకు విగ్గులు



**వా**షింగ్టన్ రాష్ట్రంలోని విన్‌లాక్ నగరానికి చెందిన జాన్‌గోడింగ్ (52) అమెరికాలోని అత్యంత వింత వృత్తిని చేపట్టింది. అది గుర్రాలకి తోకల విగ్గులని తయారు చేయడం!

ఓ గుర్రానికి పొడవైన దట్టమైన తోక పెరగడానికి అయిదేళ్ళదాకా పడుతుంది. ఆ తర్వాత చాలా గుర్రాల తోకల్లోని వెంట్రుకలు రాలిపోయి, అవి సన్నగా అవుతుంటాయి. బేరల్ రేసుల్లో పాల్గొనే గుర్రాలకి పరిగెత్తేపుడు బేలన్స్ కోసం దట్టమైన తోక అవసరం ఉంటుంది (ఓ పద్ధతిలో పెట్టిన బేరల్స్ చుట్టూ గుర్రాలు పరుగెత్తే పందెమిది).

అంతేకాక ప్రదర్శన గుర్రాలకి కూడా అందమైన తోకలు అవసరం. వీటికి పరుగుకి కాక, అందానికి ప్రాధాన్యతనిచ్చి బహుమతులిస్తారు. ఒక్కో కృత్రిమ తోకని వంద డాలర్ల చొప్పున సగటున నెలకి పదిహేను కృత్రిమ తోకలని జాన్‌గోడింగ్ అమ్ముతోంది. ఇందు కోసం ఆమె ఎక్కడా ప్రకటనలు ఇవ్వదు. గుర్రాల యజమానులు మౌఖిక ప్రచారం ద్వారా ఈమె గురించి తెలుసుకుని సంప్రదిస్తారు. వారు తమ గుర్రాల ఫొటోలని, గుర్రం తోకకి ఉన్న జుట్టు శాంపిల్స్‌ని పంపుతారు. వాటి ఆధారంగా ఆ గుర్రానికి నప్పే మూడడుగుల పొడవు గల కృత్రిమ తోకని ఈమె తయారుచేసి పంపుతుంది. నిజమైన గుర్రం తోక జుట్టుని ఈమె ఓ బట్ట మీద కుట్టి తయారుచేస్తుంది. దాన్ని గుర్రం తోకకి క్లిప్పులతో బయటికి కనబడకుండా అమర్చవచ్చు.

ఒక్కో తోకని కుట్టి తయారుచేయడానికి ఆమెకి గంటసేపు పడుతుంది. నిముషాల్లో గుర్రాలు కొత్త తోకకి అలవాటు పడిపోతాయి. ఆ కృత్రిమ తోక రెండేళ్లదాకా పాడవకుండా వుంటుంది.

జాన్‌కి పది ఎకరాల నేల, అందులో గుర్రాల శిక్షణ కేంద్రం వున్నాయి. ఇది ఆమె ప్రధాన వృత్తి. కృత్రిమ తోకలు తయారుచేయడం హాబీతో కూడిన వృత్తి.





నాన్న పాలు తాగుతున్నాడు. చనిపోయిన తర్వాత పాలొస్తాయా రావా అని సందేహం వెలిబుచ్చకండి. నాకూ తెలీదు. పది నెలల ఆ పసికందుకూ తెలీదు. చనిపోయిన ఆ మహాతల్లికి ఎలాగూ తెలీదు. ఎద్దులు కట్టెయ్యటానికి వచ్చిన మా తాత నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. ఎద్దులు ఎందుకో బెదిరి వెళ్లిపోయాయి. ఎంతటి విచిత్రాలతో కూడుకుంది జీవితం!"

కొద్ది నిముషాలు ఇంట్లో నిశ్శబ్దం రాజ్య



మేలింది. ఆయన చుట్ట తాగుతూ వుండి పోయాడు.

"సంబంధం గురించా అడిగావు? " నోట్లోంచి చుట్టతీసి నుసి రాల్చుతూ అడిగాడు.

"బుద్ధొచ్చింది. ఇక అడగను"

"ఓపికలు కావాలి. ఉత్కంఠలు పనికి రావు. అబ్బాయి వయసు ముప్పై నాలుగు. మొదటి పెళ్లాం చనిపోయింది. ఆ లెక్చరర్ చెప్పిన సంబంధం అది"

పిల్లవాడు మీసాలు ఎక్కువగా లాగుతుంటే, "నాయనా, మీసాలతో పనయిపోయిందా? " అని కిందికి దించాడు. వాడు అమ్మవడిలో దూరాడు. వాడిని వదిలించుకుని లేచిందామె.

"ఏం వొండుతున్నట్టు? "

"ఉప్పు పిండి"

కూర్చో అన్నట్టు సైగ చేశాడు. చెప్పినట్లు చేసింది.

"ఆ లెక్చరరు ఉద్దేశం అర్థం కావటం లేదూ? అతని ఉద్దేశంలో మన స్థాయికి రెండవ పెళ్లివాడు తప్ప వేరే మార్గం అంతగా లేదు. అలాంటి సంబంధం గురించి చెప్పటం మనల్ని అవమానించినట్లు గాదూ? "

"పోనీలే అని అతనేదో సహాయం చేయబోతే దానికి వేరే అర్థాలు ఆపాదించటం ఎందుకు? మనమే ఆత్మన్యూనతా భావంతో వున్నాం... ఈ విషయం వదిలేసి మీకు ఇష్టమయిన విషయం తిరిగి అందుకోండి"

"మరి నీవు వెళ్లిపోతున్నావ్? "

"మీకు తిండి అక్కరలేదంటే కూర్చుంటా. అయినా ఈ ఇంట్లో ఎక్కడున్నా మీ గొంతు వినబడకపోతే గదా"

"తిండి అంటే ఆయన తినేది! ఉప్పు పిండ్లు, గాడిదగుడ్లు కాదు. మా నాన్నది ఒకటే పద్ధతి. రెండు కూరలు, పప్పు, చారెడు నెయ్యి, పచ్చడి, వడియాలు, అరిసెలు, లడ్లు... ఏ పదార్థాన్నైనా అరాయించుకోగలడు, చేయించుకోగల ఆర్థిక స్థోమతా వుండేది. ఏనాడన్నా అరగకపోతే నోట్లోకి వేళ్లు పోనిచ్చి..."

"నాన్నా... నాన్నా నా కడుపులో దేవుతోంది" విసుగ్గా అన్నాడు కొడుకు.

"ఒరేయ్, అన్నట్లు చలమయ్యగారిని చేబదులు అడగమన్నా.. అడిగావా? "

"చలమయ్యగారు ఇల్లు ఖాళీచేసి ఏనాడో వెళ్లిపోయారు" కూతురంది.

"ఆ తిక్కముండ ఇంట్లో ఎవరు అద్దెకుం డగలరూ! ఎప్పుడు? "

"మూడ్రోజులవుతుంది. నిన్న తర్వాత కలుస్తానన్నారు"

"మంచి వ్యక్తి. ఎన్నిసార్లు చేబదుళ్లి చ్చాడు... తను ఇబ్బందిలో ఉన్నపుడు సైతం. ఆర్నెల్లవలేదు వాళ్లు ఆ ఇంట్లో దిగి.

"ఆవిడ సంగతేంగాని మన ఇల్లు గలావిడ సంగతి చూడండి. రేపోమాపో ఇంటి ముందు శోకండాలు పెడుతుంది. మొగుడు చచ్చిందాన్ని, మరో దక్షత లేనిదాన్ని. అందుకే అద్దెలు సరిగా ఇవ్వ టంలేదని మొదలుపెట్టి, ఇంటి మీదున్న నాలుగు పెంకులు రాలేట్లు అరుస్తుంది"

"మొగుడ్ని చచ్చిపొమ్మని మనం చెప్పలేదు. ఆయన పోవటంలో పాపం ఎవరిదన్నా ఉంటే అది ఆమెదే. వేరే మగ దక్షతంటావా, దేశం గొడ్డుపో లేదు"

"నాన్నా... నాన్నా..." కూతురు.

పైకప్పు నించి నీటిచుక్క రాలింది ఆమె నెత్తిమీద, ఏదో గుర్తు తెస్తున్నట్లు. చిత్ర హింస ఆరంభమవుతుంది.

"ఈ దిక్కుమాలిన కొంప మారదాం నాన్నా. వీధికీ, ఈ ఇంటికీ తేడా లేదు. సరైన స్నానాలగదీ లేదు, పాకీదొడ్డీ లేదు"

వర్షపు చప్పుడును, కారే నీటిబొట్ల టప్ టపల్ని వింటున్నారు. శబ్దాలలో మాధుర్యం లేదు. కాలం గడుస్తోంది. అది త్వరగా గడిచిపోవటమే గదా కావాలి.

**మన ఇల్లు గలావిడ సంగతి చూడండి. రేపోమాపో ఇంటి ముందు శోకండాలు పెడుతుంది. మొగుడు చచ్చిం దాన్ని, మరో దక్షత లేనిదాన్ని. అందుకే అద్దెలు సరిగా ఇవ్వ టంలేదని మొదలుపె ట్టి, ఇంటిమీదున్న నాలుగు పెంకులు రాలేట్లు అరుస్తుంది.**

కుర్రాడు జోగుతున్నాడు. చెదలు తినని పుస్తకం తీసి నిలబడే (అనవసరపు, నిరుపయోగమైన చదువు) చదువుతున్నట్లు నటించాడు అభిమన్యు. ఒక వేలితో ముక్కుపుడక తిప్పుతూ ఆలోచిస్తోంది సుమిత్ర. వంటింటిలోనుంచి సీతమ్మ వచ్చింది.

"వెధవా నిద్రపోకు. అందుకే మధ్యాహ్నం ఓ గంట పడుకోమనేది. అప్పుడేమో అల్లరి"

"కలలుగనే వేళ యిదే కన్నయ్యా, నిదురలో ఎంతో హాయి చిన్నయ్యా..." సుమిత్ర కూనిరాగం అందుకుంది. చిలిపిదనం లేదు అందులో.

భర్తకు చేరువగా వెళ్లింది. సన్నటి గురక వినిపిస్తోంది. నిదురహాయిని పొందుతు న్నాడు కూతురు జోల పాడక ముందునుంచే. ఆయన వేళ్లమధ్య నుంచి జారి నేల మీద పడివున్న చుట్టను కాలితో తొక్కి ఆర్పివేసింది. దాన్ని అవతల పారేయమని కూతురుకి పురమాయించి, ఆమె మేలుకొలుపు పాడింది.

"ఏమండీ, ఫలహారం తయార్. మొహం కడుక్కుని రారూ? "

"ఆc ఏవిటీ? "

"ఫలహారం చేయటానికి లేవమంటున్నా. మత్తువల్ల అకాలనిద్ర; చుట్టలు తాగి, కడుపులో ఆకలి చచ్చినట్లుంది"

"ఫలహారమేమిటి? "

"ఈ రోజు శుక్రవారం కదా"

"సరేలే..." లేచి తూలుతూ అన్నాడు. సీతమ్మ చేయివేసింది మీద. పవిటకొంగుతో ముక్కు మూసుకుంది.

స్నానాలగది వైపు నడుస్తున్న తండ్రి వెనుక రెండడుగులు వేశాడు అభిమన్యు.

"రానక్కరలేదు" అని సైగచేసి, తువ్వాలు భుజంమీద వేసుకుని వెళ్లాడాయన.

తుపాను వర్షం హెచ్చినట్లుంది. అలక తీరిందేమో వర్షం మీద, గాలీ ఆరంభమయింది.




ఆ చీకట్లో తల్లి ఏదో చెప్పటానికి ప్రయత్నించటం మొదట్లో గమనించలేక పోయాడు. లోపలికి అడుగుపెట్టాడు. వరండాలో మడతమంచం వాల్చి ఉంది. గదిలోని వెలుతురు లీలగా ప్రసరిస్తోంది వరండాలోకి.

గోడవైపు ముఖం ఉండేట్లు పక్కకు తిరిగి అష్టవంకరల శరీర భంగిమలో నిద్రలో ఉన్నాడు చిరంజీవి- అక్క కాళ్లు ముడుచుకుని నిద్రపోతోంది. బోసి మెడ. జాఫ్రీకి అల్లుకుని ఉన్న మనీప్లాంటు కొత్త కొత్త చిగుర్లు వేస్తూ చిక్కబడి గాలి, వెలుతురును అడ్డుకుంటోంది. దాని అందం అక్క కళ్లతో చూడాలి.

అర్ధరాత్రి పారిపోతున్న శాక్యముని పటం వేలాడుతున్న మేకు కన్నం పెద్దదయి జారిపడేట్లుంది. దాన్ని చూస్తూ చొక్కా విప్పుకుంటుంటే తల్లి అంది రహస్యం చెబుతున్నట్లు-

"మీ నాన్న ఇంకా ఇంటికి రాలేదురా"

చొక్కా విప్పటం మానేశాడు.

"పొద్దున వెళుతున్నపుడు ఏమన్నా చెప్పారా, సాయంత్రం ఎక్కడికన్నా వెళతానని? "

అనిన తర్వాత అవి వృధా మాటలు అనిపించింది. చెప్పివుంటే, "ఫలాన చోటుకి వెళతానన్నారురా, ఇంకా రాలేదు" అని ఉండేది. అయినా ప్రతి మాటనూ ఆచి తూచి అనం. ఆయన ఎనిమిదిన్నర దాటకుండా ఇంట్లో ఉంటారు. ఆ విషయంలో క్రమశిక్షణ ఉంది. ఇన్నేళ్లలోనూ ఆ విషయంలో మినహాయింపు ఎప్పుడూ లేదు. ఒక ఆలోచన వచ్చింది. కాని అది సరైన కారణం కాదని వెంటనే అనిపించింది. పుచ్చుకునేది మితంగా- ఒళ్లు, ఇల్లు, మనుషులను మరిచేంతగా కాదు. కాబట్టి ఎక్కడో పడివుండటం అసాధారణ విషయం. జీవితంలో ఏనాడూ జరగని సంఘటన ఇప్పుడు జరగకూడదనీ లేదు.

ఎక్కడని వెతకటం?

ఆయన వెళ్లేది ఇద్దరి ఇళ్లకే. ఒకటి అల్లిపురంలోని వైకుంఠం ఇల్లు, మరొకటి నారాయణరావు ఇల్లు. ఆ ఇద్దరి ఇళ్లలో లేకపోతే మరి ఎక్కడ వెతకటం? ఎలా వెతకటం? ఎవరి సహాయం తీసుకోవాలి? తుదకు ఇది చిన్న విషయమయితే హడావుడి, ప్రచారం మిగులుతాయి. చిన్న విషయం కాకపోతే?

ఆఫీసులో ఆలస్యం అవటానికి అవకాశం లేదు. తను ఖాళీగా బయట పచార్లు చేయకుండా మరికొంత ముందుగా ఇల్లు చేరివుంటే బాగుండేది. జరగబోయేది తెలిసే శక్తి వుంటే బాగుండేది. ముందుగా వచ్చి వుండేవాడు. అదే వుండి వుంటే ఆయనకు జరగబోయేదాన్ని ఆపివుండేవాడు- నిజంగా ఇప్పుడు ఏదైనా జరిగి వుంటే? !

గుమ్మందాటి ఆమే బయిటికి వచ్చింది సాగనంపటానికి. సందు మలుపు తిరుగుతూ ఎందుకో వెనక్కు తిరిగి చూశాడు. ఇంకా గుమ్మం ముందు నిలబడే వుంది. ఏడుస్తోందా? తండ్రి గురించి, తన గురించి.

మలుపు మొదట్లో దగ్గు వినిపిస్తోంది. ఒకటే దగ్గు దొంతరలు దొంతరలుగా. ఇంటి కిటికీ రెక్క సగానికి విరిగిపోయిన ఇల్లు. బస్తాలకొద్దీ సున్నం తెచ్చి కొట్టినా తెలుపు అంటుకోని ఇల్లు. ఎలాగూ ఆ ఇంటికి తెల్లదనం తేలేమని ఏనాడో సున్నం కొట్టడం మానేసిన గోడలు. ఆ గుమ్మం పక్కనే మేడమీది భాగపు దొడ్డి. ఆ భాగంలో ఇల్లు గలవాళ్లు, కలవాళ్లే వుంటున్నారు. దాపరికాలు లేకుండా, బహిర్గతంగా పైనించి కిందికి పడి ఉండేది కనిపిస్తుంటుంది- పైవాళ్లు తిండి కొరతలేమిద నాన్ని, తినటంలో భారీతనాన్ని సూచిస్తూ.

ఆమె నిద్రపోదు. వాడు నిద్రపోడు. వాడిని నిద్రపోనీయదు దగ్గు. వాడు, వాడి దగ్గు ఆమెని నిద్రపోనీయదు. వాడి రూపంలో వాడి తండ్రి పాపం అతగాడు లేకపోయినా, అతగాడిని బదులు ఈమెని పీడిస్తోంది. పాతిక-ముప్పై మధ్య వుంటుందామె వయసు. శరీరం మరో పది పైబడినట్లుంది. ప్రథమాంకం మొదలయిందే తడువు వెలుతురు కన్నా వేగంగా చరమాంకంలోకి వచ్చేసిన జీవితం. వెయ్యేళ్లకు సరిపోయే బాధతో కూడినది. వాడిమీద ప్రేమ, రొయ్యల కంపెనీ జీతం ఆవిడ జీవితం ముగియనీయటం లేదు. ఖళ్లు ఖళ్లుమని దగ్గు, తన పుట్టుకను తన పుట్టుకకు కారణమయిన వాళ్ల పుట్టుకను నిందిస్తున్నట్లు. అంగిటి నుంచి ఊడిపోవాలన్నట్లు నాలుక కుక్క నాలుకలా బయిటికి చొచ్చుకొచ్చి వేలాడుతుంది. లోపలి పేగులన్నింటినీ కక్కివేద్దామన్నట్లు గొంతు విచ్చుకుంటుంది. పక్కటెముకల మాంసం మిగలనందున చర్మం రాచుకుని చిరిగిపోవాలని చూస్తుంటుంది. గుడ్లు పొడుచుకొస్తాయి. ఎప్పుడో ఎముకలు విరిగిపోతాయి. చర్మం చిరిగిపోతుంది. పేగులు వెలుతురు చూస్తాయి, గుడ్లు రాలిపోతాయి. అప్పుడు దగ్గు ఆగిపోతుంది, తను వచ్చిన పని అయిపోయినట్లు. ఆ రోజెప్పుడో?

వెనకనించి- "లేదు, లేదు నాన్నా లేదు" అంటోందామె. బలహీనమైనదే అయినా కంఠం దూరానికి వినిపిస్తోంది నిశ్శబ్ద నిశీధిలో. లేదు అనుకుంటే ఉన్నది పోదు. "లేదు, లేదులు" ఉపశమనాన్నిసాయేమో ఏ మందులూ లేనపుడు. వాళ్ల బాధను వాళ్లు 'లేదు, లేద'నుకుని మోసం చేసుకో చూస్తే తప్పు కాదు. కొన్ని మోసాలూ తప్పు కాకపోవచ్చు.

పది అడుగులు వేశాడు. పచ్చయింటి పై భాగపు కిటికీ రెక్కలు తెరుచుకుని కిటికీ కమ్ముల వాతలతో వెలుతురు రోడ్డు మీద పడి, అవి మూసుకోగానే వెలుతురు లోపలికి జొరబడిపోయింది; ఆలస్యమయితే వెలుపలే ఉండిపోవలసి వస్తుందేమోనని, ఈ సన్నటి సందులో గోతులు. రోడ్డుకు ఇరువైపులా నీటిగొట్టాలు. నరకపు కారిడార్.

మరికొంత దూరం కొలిచాయి అంగలు. ఎంతెంత దూరం? చాలా చాలా దూరం! అక్కడేముంది? నాన్న వుండవచ్చు! చీకటిలో ఏదో ఆకారం కదిలింది. భయం. కాళ్లు తడబడ్డాయి. కుక్క, అంతే. తోడేలు కాదు. నగరాలలో అవీ, ఇవీ కూడా వుంటాయి. దాని రంగు తెలీదు. ఏ రంగైతే ఏమిటి- కరిచేకుక్కా, కరవని కుక్కా అన్నది ప్రధానం. అది కరవగలిగిన కుక్కలా లేదు. అరవగలిగిన కుక్కలా కూడా లేదు. దగ్గిరవుతుంటే దాని కళ్లు కనిపిస్తున్నాయి. ఎవరితగాడు, ఎచటినించి రాక, ఎచ్చటికేగుతున్నాడు. దేని గురించి వీడి. అన్వేషణ- అన్న ప్రశ్నల చూపు చూసింది. తను దాన్ని, అది తనను అపనమ్మకంతో చూసుకున్నారు. తన నిజాయితీని రుజువు చేసుకోవటానికి దాని దగ్గిరగా వెళ్లాడు ధైర్యంగా. దాన్ని దగ్గిరగా చూశాడు. దానికి ఒక కన్ను లేదు, క్రూర

# వారెవ్వా!



## ఇదో దైత్యం

ఈ తిమింగలాన్ని చూసి సముద్రంలో నుంచి పైకెగురుతున్న స్కడ్‌లాగుందని ఆశ్చర్యపోతున్నారా? దాదాపు 40 నుంచి 200 ఏళ్లు బతికే 24 మీ. పొడవు, 150 టన్నుల బరువు తూగే వీటికి సమస్త భూమండలంలోనే ఏ జీవులూ సాటిరావు. వీటి ధ్వని నూరుమైళ్ల దూరం వరకు సముద్రంలో వినిపిస్తుంది. దీంతో ఇతర తిమింగలాలతో అవి 'టచ్'లో ఉంటాయి. రోజుకు 4.5 టన్నుల ఆహారాన్ని ఒక్కో తిమింగలం సుష్టుగా అరగిస్తుంది. అంతేకాకుండా 80 నిమిషాల వరకు నీటిలోపల శ్వాస లేకుండా ఉండగలవు. ఇవి సముద్రాల్లో పదివేల కి.మీ.కు పైగా ప్రయాణిస్తాయట.

త్వానికి నిదర్శనంలా. దాని తలమీద చేయి వేశాడు. అది తల ఎత్తి చూస్తూ చెవులూ, తోక ఆడించింది, ఎవరిమీదా కోపం లేదంటున్నట్లు.

కుడిపక్క ఎత్తు అరుగుమీద ఇద్దరు పడుకుని ఉన్నారు. వాళ్లలో ఒకడు పలవ రిస్తున్నాడు. ఏదో తిట్టు. నిద్రలో కూడా ద్వేషం. మలుపు తిరిగి కొంచెం దూరం వస్తే 'కొత్త' రోడ్డు వస్తుంది. ప్రస్తుతం ఒక్క మనిషితడు. ఈ పాతపట్నం రోడ్లలో కొత్తది ఒకనాడు. ఎన్నేళ్లయినా అది కొత్తదే.

మెయిన్ రోడ్డు మీదికి వచ్చాడు. జగన్నాథుడి ఆలయం ముందు ప్రార్థించడానికన్నట్లు ఆగాడు. దీన్ని గరుడా జగన్నాయకులనే వ్యాపారి 1844వ సంవత్సరంలో మొదలుపెట్టి 1848లో పూర్తిచేయించాడు. విగ్రహాన్ని పూరీనుంచి ఒకస్వామి తెచ్చాడు. రాత్రి తొమ్మిదిదాకా జనసందోహంతో సందడిగా ఉండే గుడి చిన్నబోయి ఉంది. దేవుడి డ్యూటీ కూడా అయిపోయిందేమో, నిద్రవడిలోకి జారేడేమో అంతా సజావుగా ఉందని. దేవుణ్ని దేవుడు మోసం చేసుకోవటం కూడా తప్పు కాదు.

"రిక్షా కావాలా బాబూ? "

జేబులో మిగిలింది మూడు రూపాయలు, కొంత చిల్లర. ఆలోచనల అడుగుకు జారిన అలసట తొంగి చూసింది. ఇపుడు రిక్షా ఎక్కితే అటునుంచి నడిచి రావాలి. వాడు ఆశగా చూస్తుంటే కాదన లేకపోయాడు. బేరమాడటం అన్యాయమే. వేరే మార్గమేది.

"అల్లిపురం వస్తావా? "

"రెండు రూపాయలు, బాబూ" బేరం అవసరం లేని ధర.

ఎక్కి కూర్చున్నాడు. స్టేడియం రోడ్డుమీదుగా వెళ్లటం గుర్తించి వెనక్కు మళ్లించాడు. ఒక చేత్తో రొట్టెముక్క తింటున్నాడు రిక్షావాలా. పద్నాలుగు, పదిహేను సంవత్సరాల వయసు. కొల్లాయి కట్టి చొక్కా వేసుకున్నాడు. కాళ్లకు పెడల్ పూర్తిగా అందటం లేదు.

దారికి అటూ ఇటూ చూస్తున్నాడు తండ్రి కనిపిస్తాడేమోనని. ఏ రోడ్డుమీదో కాలువ పక్కనో పడిపోలేదు కదా. ఏ బండి కిందనో పడిపోలేదు కదా. వణుకు పుట్టుకొచ్చింది. పోయిన సంవత్సరపు ఒక అనుభవం గుర్తుకొస్తోంది. అది ఎన్నో రోజులు తనను వెన్నంటింది. మనిషి ఎంత అసమర్థుడో, క్రూరుడో సోదాహరణ పూర్వకంగా తెలిపిన అనుభవం. మనిషి తనకు అది అన్వయించుకోకుండా వేదాంతాన్ని ఎలా చిలకలా చెప్పగలడు?

తెలిసినవాళ్ల తొమ్మిదేళ్ల పాప బడికెళుతున్నపుడు తొక్కిసలాటలో సిటీ బస్సు వెనుక చక్రం కింద పడిపోయింది. బస్సులోకి వెళ్లటమంటే కొందరికి కైవల్యం చేరినట్లే కాబట్టి చిన్నపిల్ల అని కూడా చూడకుండా తోసేసి ఉంటారు. బూటు తొడిగి ఉన్న ఒక పాదం ఊడిపోయింది. ఊడిపోయినా పాదానికి బూటు అంటిపెట్టుకునే ఉంది విశ్వాసపాత్రంగా. రక్తసిక్తమైన మేజోడు. విరిగిన ఎముకలు, నలిగిపోయిన నరాలు. క్షణంలోనో ఇంకా తక్కువ కాలంలోనో జరిగిపోయింది సంఘటన. కానీ నూరేళ్ల జీవితం మీద దాని నీడ పడే ఉంది. దాన్ని క్షణం కూడా మరువనీయకుండా. ఆస్పత్రిలో చూశాడు బల్లమీద పడుకోబెట్టి ఉంచినపుడు. అందమయిన (బూటు తొలగించిన) పాదం ఒక కాలుకు. పాదం లేని మొండి కాలు దాని పక్కనే. ఏ విలువైన దానిని వెచ్చించి పోయిన పాదాన్ని తేగలరు.

తల్లిదండ్రుల బాధను, దుఃఖాన్ని చిత్రించగల భాష, లిపి లేవు. ప్రమాదం ఘోరమైనది. మరి జాలి లేని మనుషుల ప్రవర్తన ఘోరమైంది కాదు? ధనవృక్షం కింద ఏ విలువా మొలవదు. ధన వృక్షాల కింద

ఆ జాతి పిలకలే మొలుస్తాయి. దాని కింద విలువల మొక్కలు కలుపుమొక్కలు.

వయసు పైబడిన వైద్యుడిని ఆ సంఘటన జరిగిన రోజు చూస్తే ఎంతో సాంత్వన కలిగింది తనకునూ. హుందాగా ఓదార్పుగా ఆయన అన్న మాటలు వింటే విరిగిన కాలును... అంటించగలడు అని పించింది. నాలుగే రోజులు గడిచాయి. దుప్పటి పాపమీద కప్పితే ఆయన చికాకు పడేవాడు. కప్పకపోతే కోప్పడేవాడు. మంచం పక్కన సామాను పెడితే ఎగిరిపడేవాడు. పెట్టకపోతే నేనొచ్చినపుడు తీసేసి లేనపుడు పెడుతూ ఉండి వుంటారు అని తార్కికంగా మాట్లాడేవాడు. పిల్ల అవసరాలకు ఏ వస్తువూ ఉంచుకోకుండా ఏంచేద్దాం అనుకుంటున్నారు? వ్యంగ్యంగా ప్రశ్నించేవాడు. ఆయన జబ్బు గురించి బుగ్గలు లేని నర్సుని అడిగితే అదేంటో చెప్పి, చికిత్సా విధానం తెలియజేసింది.

మరుసటిరోజు ఆయన ఇంటికెళ్లారు. మొట్టమొదటి రోజులా మధురంగా, గంభీరంగా మాట్లాడాడు. ఆ తార్కిక వైద్యుడిలో నటుడూ కనిపించాడు. ఆయనలో సంతృప్తి కనిపించింది, ఆయన భాష ఎట్టకేలకు అర్థం చేసుకుని ఆయన ఇల్లు మేం చేరినందుకు. పిల్లలకు మనకు చేతనైన రీతిలో బోధిస్తున్నపుడు వాళ్లు అది గ్రహించి నేర్చుకుంటుంటే ఆనందం కలుగుతుంది.

"ఎంతో విచారం కలిగించే విషయం అంత చిన్నపిల్ల, పైగా ఆడపిల్ల ప్రమాదంలో కాలు కోల్పోవటమంటే" అని ఏదో ఆ విషయంలో సందేహం వచ్చినట్లు ఆగిపోయాడు కొంతసేపు. తన బాధను ఆ మౌనం ద్వారా వ్యక్తం చేస్తున్నాడేమో అనుకున్నారు. ఆయనను అపార్థం చేసుకున్నారేమో తాము.

కొనసాగించాడు.

"కానీ బాధపడి ప్రయోజనం ఏంటయ్యా? ఏడుస్తూ కూర్చుంటే పోయిన కాళ్లూ, వేళ్లూ వస్తాయా... జరిగిందేదో జరిగింది. మన చేతులలో లేనిది, జరగాల్సిందేదో అది చేద్దాం అని సమాధాన పడాలి- అవునా? అసలు నన్నడిగితే పాప ఒక విధంగా అదృష్టవంతురాలే. కాదంటారా? " మృదువుగా ప్రశ్నించాడు.

ఆ వయసులో కాలుపోయిన తర్వాత కూడా పాన్‌గ్లోస్ తప్ప ఎవరైనా అదృష్టం అన్న మాట అనగలరా అన్న సందేహంలో పడ్డారు. సందేహం గ్రహించాడాయన. ఆయనకు బాగా లెక్కలొచ్చు. ఎంతగానంటే ఆవలించకుండా పేగులు లెక్కబెట్టగలిగినంత.

"ఎట్లా అంటావా? మోకాలు కింద నాలుగంగుళాల మేర మిగిలింది. అందువల్ల కృత్రిమ కాలు పెట్టుకుంటే మోకాలు దగ్గిర దాన్ని మడుచుకోటానికి వీలుంటుంది. ఆ భాగాన్ని ఎట్లా రక్షించటమా అన్నదే నా తాపత్రయం. ఆ నాలుగంగుళాల మేర కూడా పోయి వుంటే ఆ పిల్లకు ఎంత కష్టం, నష్టం జరిగి వుండేవో ఆలోచించడయ్యా? అదృష్టం అన్నమాట వాడి నేను జోక్ చెయ్యాలా! అలా చేసివుంటే అది దుర్మార్గపు జోక్ అవుతుంది. నాకు మామూలు జోకులు అన్నా ఇష్టం ఉండదు. మరో విషయం. ఒక కాలికే దెబ్బ తగిలింది, రెండవ దానికీ తగిలి వుంటే ఎంత బాధ పడాల్సివుండేది? అసలు ప్రాణాలుపోతే మాత్రం ఏం

"ఎంతో విచారం కలిగించే విషయం అంత చిన్నపిల్ల, పైగా ఆడపిల్ల ప్రమాదంలో కాలు కోల్పోవటమంటే" అని ఆ విషయంలో సందేహం వచ్చినట్లు ఆగిపోయాడు కొంతసేపు. తన బాధను ఆ మౌనం ద్వారా వ్యక్తం చేస్తున్నాడేమో అనుకున్నారు.

చెయ్యగలం? అవునా, కాదా? "

డబ్బు ఆయన చూసేట్లు ఆయనకు కాస్త దూరంలో బల్లమీద పెట్టారు. ఆయన నొచ్చుకున్నాడు.

"ఏందయ్యా ఆ కవరూ? డబ్బా? ఎందుకయ్యా అది? నేనేమన్నా అడిగానా? భలేవాడిలా ఉన్నావే? నీ బాధలో నీవుంటుండగా ఈ ఇబ్బందెందుకూ పడటం... చ్చుచ్చుచ్చు" అని దానిమీద బౌండు పుస్తకం పెట్టాడు. అది తీసేసుకోండి అంటే ఆ మంచితనానికి తాము మరణించేవాళ్లు.

తండ్రి తాగుతాడని బాధపడకూడదు. తప్పతాగటం లేదని, తప్పతాగి పడిపోవటం లేదని సంతసించాలి. తాగి ఇంట్లో వాళ్ళమీద చేయి చేసుకోవటం లేదని సంతృప్తి పడాలి. తాగేది కూడా ఎక్కువ డబ్బు ఖర్చయ్యేది కాదులే అని సమాధాన పడాలి. ఖరీదైనదైతే ఇంట్లో పచ్చడి మెతుకులకూ కరువు అయ్యేది అనుకోవాలి. ఆయన అసలు తాగకూడదు అనుకోవటం అత్యాశ.

ముక్కుపచ్చలారని ఈ రిక్షాకుర్రాడి జీవితం కన్నా తనది ఉత్తమమయింది గదా. పరిపూర్ణమైన, అర్థవంతమైన కొరత లేని, సుఖవంతమైన జీవితాన్నాశించడం పేరాశ. "గరిటయితే గరిటెడు నీళ్లు, కడవయితే కడివెడు నీళ్లే" అర్హత మించి ఆశించరాదు.

జేబులో ఈ మూడు రూపాయలన్నా లేకపోయి వుంటే అటూ ఇటూ నడవాల్సి ఉండేది. ఇప్పుడు సగం శ్రమ తగ్గింది గదా.

అవివాహిత అయిన అక్క ఒక్కర్తే వుంది. అలాంటి తోబుట్టువులు మరికొందరు లేరు. ఈ వెతుకుతున్న సమయంలో తుఫానో, భూకంపమో రాలేదు, కర్ఫ్యూ విధించలేదు. వాతావరణం అనుకూలంగా ఉంది గావున ఇలాంటి రాత్రులు వేయైనా వెదుకుతూ గడపొచ్చు.

వీడి వయసు వాళ్లు ఈవేళలో ఆదమరిచి, కలలుగంటూ నిద్రపోతుంటే వీడు ఎగిరి ఎగిరి పెడలు వేస్తున్నాడు. వాడిలో దుఃఖం ఉన్నట్లు కనబడటం లేదే; పద్నాలుగేళ్ళకు పొద్దుబోయి రిక్షా తొక్కటం సర్వసాధారణ విషయం అన్నట్లున్నాడే! అలా వుండక అనుక్షణం కంట తడిపెడుతూ రిక్షా తొక్కుతాడా? తనను చూసి తాను జాలిపడే శాపంతో వాడు లేడు.

కలలకు, బాల్యపు సుఖానికి దూరమైన పసివెధవ నడిపే కీళ్లరోగపు రిక్షాబండిలో ఏదో రహస్యాన్ని ఛేదించటానికన్నట్లు పయనం. గమ్యం చేరని ఆలోచన పరంపరతో అలసిపోతున్న తన మస్తిష్కం, తొక్కటానికి శక్తి చాలని వాడు ఒకలానే తోస్తోంది.

"అరరే..." అని రిక్షా బ్రేకు వేశాడు. కిందికి దిగి వెదుకుతున్నాడు. మట్టిలో పడిన బన్నును తీశాడు. మూడొంతులు తినగా మిగిలిన ముక్క. సాణిగాడు.

"ఇంకా నయం కాస్తన్నా తినకుండా పడిపోలేదు"

చాలా రోజుల క్రితం ఒక ఊరి ప్రయాణం తగిలింది. ఆఖరి క్షణాలలో బయలుదేరాడు. రైలు ఆలస్యమయితే తప్ప దొరికే ప్రసక్తి లేదు. ఒక్కోసారి "ఎక్కవలసిన రైలు జీవితకాలం లేటవుతుంటుంది" కదా. రిక్షా బేరమాడకుండా ఎక్కేశాడు. లాటరీ దొరికిన చందాన వెంటనే పోనిచ్చాడు వాడు. రాత్రి- ఇప్పటి లాగే. వెలగని దీపాల వీధులే, ఇప్పటిలా. ఇప్పటి వాడిది ఎదుగుతున్న శరీరం, అప్పటి వాడిది ఎదిగి ఎదిగి ఆగిపోయిన శరీరం. నత్త సవారిలాంటి ప్రయాణం.

అప్పుడు అనిపించకపోలేదు తను తొందరలో ఉండటం వలన రిక్షా వేగంగా వెళ్లటం లేదని అనుకుంటున్నాడని. ఒకటి నిజం. ఊరంతా ఎత్తుపల్లాలే. మిసెస్

# ఇప్పటికి ఇదొక్కటే!

పుట్టింది ఒకప్పటి నెల్లూరు జిల్లాలోని దర్శిగుంట పేట. ఇప్పుడది ప్రకాశం జిల్లాలో ఉంది. చదివిన కొంచెం చదువు విజయవాడలో సాగింది. స్థిరపడింది విశాఖపట్నంలో. రాసిన రమారమి యాభైకథలలో నాల్గింటికి 'విపుల' సహా వివిధ పత్రికలలో సాధారణ బహుమతులు వచ్చాయి. అలనాటి ఆంధ్రప్రభ వీక్లీలో 'కథాప్రభ' (ఆ వారం ఉత్తమ కథ) శీర్షికన పదికథలు చోటు చేసుకోవడం సంతృప్తినిచ్చిన విషయం. రాసినది ఇప్పటికి ఈ ఒక్క నవలే.

**నా చిరునామా :**

నవులూరి వెంకటేశ్వరరావు,
డోర్ నెం. 39–8–39/1, నార్త్ ఎక్స్‌టెన్షన్,
మురళీనగర్, విశాఖపట్నం – 530 007



నవులూరి వెంకటేశ్వరరావు

ఫోన్: 0891– 2507577

ఎ.వి.యన్.కాలేజి మొదలు దాని ముందు రోడ్డు మెయిన్‌రోడ్డును కలిసే వరకు పెద్ద వాలు. కింగ్‌జార్జి ఆస్పత్రి నుంచి మెయిన్ రోడ్డుదాకా జారుడు బల్ల వేసినంత వాలు. ఆసీలు మెట్ట నుంచి ఆర్టీసి కాంప్లెక్సు దాకా కొండ మీదినించి నేలదాకా వున్నంత ఏటవాలు. కిందినించి పైకి రిక్షా లాగట మంటే సిసిఫస్ బండరాయిని కొండ మీదికి దొర్లించే ప్రయత్నం చేస్తున్నట్లే. ఊరి ఎత్తుపల్లాలు రసజ్ఞుల హృదయా లను రంజింపచేస్తాయి. రిక్షావాళ్ల నడుము లను విరగదీస్తాయి. రోడ్డు మెరకగా ఉన్న చోట తోస్తున్నాడు కిందికి దిగి. వాలుగా ఉన్నచోట సీటు ఎక్కి అలసట తీర్చుకుం టున్నాడు. కాళ్ళకు విశ్రాంతి నిచ్చి అవసర మయినప్పుడు "దిగుతానుండు" అంటే, "లేదు బాబు, మీరు కూకొనే ఉండండి; ఒక్క మనిసినే తొక్కనేపోతే రిచ్చా ఎందుకు ఎయ్యటం. నాయం ఉండాల" రొప్పుతూ అంటాడు. తనను దిగనీయడు, అతగాడు రిక్షాను వేగంగా పోనీయడు.

తాగాడా? (తాగలేదని తర్వాత తెలి సింది) వాలు వచ్చినప్పుడు చెబుతున్నాడు. వినీ వినక వింటున్నాడతను. డెబ్బై సంవత్సరా లొచ్చినా చావని తలిదండ్రులు, ఇట్లాటి బతుకులోకి తనను లాక్కొచ్చి పడేసింది చాలక "ఆల్లకన్నా నాకు సెత్రువులు ఎవ రున్నారు బాబూ? ఆల్లు సేసిన బుద్ధిపొ రబాటు పనే నానూ సేశాను. ముగ్గురు పిల్లలు. ఆల్లూ తనను సెత్రువనుకుంటే తప్పులేదు" ఒక కొడుకు ఇదే రిక్షా వేస్తాడు. పగలు కొడుకు, రాత్రి తండ్రి. వాడి సంపాదన సగం తాగుడికి సరిపో తుంది. ఆఖరోడు ఇల్లు వదిలి పారిపో యాడు. ఒక విధంగా వాడు ఉపకారం సేశాడు. "సావు రాకుండా సంపుతుంది, బతుకు సావులా వుంది"

స్టేషన్లో ఏదో రైలు కూత వేస్తోంది. తన రైలేమో? సరైన వేళలకే రైళ్లు నడు స్తున్నాయా? ఎవరో జోకేసినట్లు నిన్నటిది ఈరోజు రావలసిన వేళకు చేరిందా.

"ఆపయ్యా, ఈ నాలుగడుగులు వేస్తాలే"

"లేదు బాబూ, ఎల్లిపోతన్నాంగద. నన్ను నమ్మండి. కూతేసింది మీ రైలు కాదు"

మాంసపు పోగుతో ఆకర్షించి, దాన్ని అద్దెకిచ్చి, దాన్ని బతికించుకో జూస్తున్న వాళ్లు ఇద్దరు నిలబడి వున్నారు. పోస్టాఫీసు చీకటి ఆశ్రయంగా కుడివైపు రోడ్డు పొడవునా రైల్వే క్వార్టర్సును వేరు చేస్తూ వేసిన ముళ్ల కంచెమీద క్రీపర్ల దగ్గర నిలబడి మరికొందరు. వాడు తన శరీరంతో మరొకడిని మోస్తాడు. వాళ్లు వాళ్ల శరీరాలను అప్పగిస్తారు. శరీరాలే ఒక శాపం, అవే ఒక వరం. శాపకాలంలో.

ఎండిన శరీరంలోని శక్తిని నూతిలోనించి బయటికి లాగినట్లు లాగి, మెరక ఎక్కించి, స్టేషను చేర్చాడు. శ్రమతో, ప్రమాదాలతో కూడిన పర్వతారోహణ తదుపరి కలిగే ఆనందం, ఉపశమనం వాడి ముఖంలో కూడా ఉందేమో ఆ క్షణాన చూడలేదుగాని మరొకటి వెలుతురులో కనబడినవి- అతని బోదకాళ్లు.

ఎడమవైపు ఇనుప సామాన్ల కొట్టు అరుగు కింద ఒక మానవాకారం పడుకుని/పడివుంది. రిక్షా ఆపమని దిగి వెళ్లాడు దగ్గిరికి. అరుగు మీది నించి దొర్లినట్లున్నాడు, బాధగా మూలుగుతున్నాడు. వాడి బాధకు కారణం ఏమిటో తెలీదు. కిందపడటం వల్ల కలిగిన బాధో మరో బాధవల్లో కిందపడి మూలుగుతున్నాడు. వాడి బాధకు గల కారణం వాడికే తెలియాలి. అతగాడి బాధ కనుక్కోటానికి అభిమన్యు వెళ్లలేదు. స్వార్థంతో వెళ్లాడు. ఎలాగూ వెళ్లేడు కాబట్టి దాన్ని తీర్చలేకపోయినా ఓదార్పుగా ఉంటుందని ఒంటిమీద చేయి వేశాడు. తన అన్ని బాధలకూ అభిమన్యు కారణమన్నట్లు బూతులకు లంకించుకున్నాడు. మనిషికి వచ్చిన భాష అవతలివాడ్ని హింసించటానికి కూడా ఉపయోగపడుతుంది. వెనక్కి వచ్చేశాడు.

రెండు విధాల అక్కడికి వెళ్లటం తప్పుగా తోచింది. పశ్చాత్తాపం కలిగింది. తండ్రిని అంత తక్కువగా అంచనా వేయటం. మరి ఏవిధంగా ఆయనను వెదికేట్లు? ఆ మనిషి దొరుకుతాడో దొరకడో తెలీకుండా చేసే అన్వేషణ.

మాంసపు పోగుతో ఆకర్షించి, దాన్ని అద్దెకిచ్చి, దాన్ని బతికించుకో జూస్తున్నవాళ్లు ఇద్దరు నిలబడి వున్నారు. పోస్టాఫీసు చీకటి ఆశ్రయంగా కుడివైపు రోడ్డు పొడవునా రైల్వే క్వార్టర్సును వేరు చేస్తూ వేసిన ముళ్ల కంచె మీద క్రీపర్ల దగ్గర నిలబడి మరికొందరు.

వైకుంఠంగారి ఇల్లు దగ్గిరపడుతోంది. జంక్షన్‌లో దిగి లోపలికి నడిచిపోతే సరి. రెండు మూడు నిముషాల నడక అంతేకదా. ఈ సమయంలో ఇంటిల్లిపాది నిద్రలో మునిగి వుంటారు నిద్రపట్టి వుంటే. వాళ్లలో ఎవరికన్నా నిద్రపట్టకుండా వుంటే వాళ్ల ద్వారా విషయం తెలుస్తుంది. తలుపు నెమ్మదిగా కొడితే సరిపోతుంది ఇంట్లో అందరూ లేవకుండా. నిద్ర సుఖాన్నీ వాళ్లకెందుకు దూరం చేయాలి?

ఆయనకు అరవై రెండు అరవైమూడు సంవత్సరాలు మీదపడ్డాయి. వార్ధక్యం ఆయన సమస్య కాదు. గుమస్తా 'గిరి' నుంచి దిగి ప్రస్తుతం ఖాళీగా(?) ఉంటున్నాడు. అలా తప్ప మరోలా ఉండటం వీలవక. ముగ్గురు 'రత్నాల' లాంటి కూతుళ్లు. మొదటి అమ్మాయికి ఆలస్యంగానైనా పెళ్లయింది. ఆమె పెళ్లినాటికే మిగతా ఇద్దరూ ఆమెంత ఎదిగివున్నారు శారీరకంగా; పోటీపడుతున్నట్లు మిగతా రెండు రత్నాలని కైవసం చేసుకోడానికి ఏ మూర్ఖుడూ ముందుకు రాలేదు. రత్నాన్ని చేపట్టడానికీ రూకలు కావాలి. చెల్లని ఆ రత్నాలున్నాయి కాని, చెల్లేరూ

కలు లేవు.

ప్రస్తుతం ఆఖరి ఆమ్మాయితో చదరంగం ఆడుతుంటాడు. తండ్రి కూతుళ్లు దాని కారణంగా ఒకళ్లమీద ఒకళ్లు అలుగుతుంటారు. పిల్ల వివాహ విషయంలో భార్యాభర్తా ఒకరిమీద ఒకరు అలుగుతుంటారు. అలకలూ ఒక కాలక్షేపం.

"డబ్బు ఉంటేనే గాని దానికి పెళ్లవదు. డబ్బు ఉంచుకుని దానికి పెళ్లి చెయ్యకపోతే అప్పుడు నాది తప్పు" అంటాడు.

"గత పదేళ్ల కాఫీ, వక్కపొడి ఖర్చుతో అమ్మాయి పెళ్లి అయివుండేది. డబ్బులు సంపాదించకపోవటం మీ తప్పు కాదా? "

"తిండి కూడా ఇద్దరం మానేసి వుంటే రెండోదాని పెళ్లి మన చేతుల మీదుగా జరిగివుండేది"

"మీ తెలివితేటలు మాటలకు, ఆ ఆటకే పరిమితం అయిపోయాయి"

పదవీ విరమణ నాటికి, "కోపిష్టి ముండాకొడుకేగాని, నిజాయతీపరుడు" అని పేరు గాంచాడు. అలాంటి పేర్లు అహం సంతృప్తులకే గాని జీవితం గడపటానికి ఉపయోగపడవని అనుకోలేదు. అడ్డదార్లు ఎన్నో ఉండేవి ఉద్యోగం వున్నప్పుడు. అవి తొక్కివుంటే నాలుగు రాళ్లు దొరికి వుండేవి. అప్పుడు కాఫీ, వక్కపొడులకు ఎలాంటి లోటు లేకపోవటమే కాక రత్నాలను ఏ అయ్య చేతిలోనో ఆ రాళ్లతో పాటు పెట్టెయ్యాటానికి వీలుండేది.

ఒకసారి ఒకడు వంద రూపాయల నోటు ఫైలు కింద ఆయనకు తెలీకుండా పెట్టిపోయినాడు. ఆ నోటును తర్వాత చూసి జాగ్రత్తగా జేబులో పెట్టుకున్నాడు. మరుసటి రోజు ఆ వ్యక్తి వచ్చాడు. "ఎంతవరకు వచ్చింది సార్" అన్నాడు. రాస్తున్న కాగితంలో నుంచి కళ్లు మళ్లించి, తల ఎత్తి, కళ్లజోడు ఫ్రేం పైనించి చూశాడు కొద్ది క్షణాలు. హాల్లో పాతికమంది చూస్తుండగా జేబులోకి చేయి పోనిచ్చి నోటును బయటికి తీసి అడ్డుగా, నిలువుగా చింపగలిగినంతగా చింపి, "ఇంతవరకు వచ్చింది" అన్నాడు నులక అగ్నిహోత్రావధానులు. ఆ విషయం తెలిసి వైకుంఠాన్ని శంకరగిరి మాన్యాలు పట్టించాడు పైఅధికారి, లంచం ఇవ్వజూపిన వ్యక్తిపని తనే కానిచ్చి.

ఆ విషయం సహోద్యోగులు చాలా కాలం చెప్పుకుని తర్వాత మరిచిపోయారు. కొందరు దానిని మెచ్చుకోలు పనిగా భావించారు. కొందరు పైత్య వికారంగా భావించారు. నిత్య శంకితులు "ప్రతి మనిషికీ ఒక ధర వుంటుంది. అతనితో పెద్ద ధర పలకాలి అంతే" అనేవాళ్లు.

పదవీ విరమణ అయిన సంవత్సర కాలం తర్వాత అప్పుడే జ్ఞానోదయం అయినట్టు, ఒకసారి అభిమన్యుతో అన్నాడు, "నేను లంచాలు తీసుకోక పోవటంవల్ల ఒరిగిందేమిటో అర్థం కావటం లేదు. నీతి ఎవరికి కావాలి. నా అహం సంతృప్తికి. అంటే, స్వార్థానికి ఉపయోగపడింది. డబ్బు కుటుంబంలో యానమ్మందికీ ఉపయోగపడేది"

ఒక ఆదర్శ ప్రభుత్వ ఉద్యోగి ఆదర్శవంతుడైన తండ్రి కాకపోవచ్చు రెండో అమ్మాయితో ఒక కాలక్షేపంగా కాక ఒక యజ్ఞంలా, అదే లోకంలా భావిస్తూ చదరంగం ఆడుతుండేవాడు. ఆ అమ్మాయికి చదరంగమే ఒక లోకం కానక్కరలేదు. చూసి చూసి మేడమీద కుర్రాడితో స్నేహం ఆరంభించింది. ఖాళీవున్న సమయంలో ఆమె ఇంటి ముందు పడకకుర్చీలో చేతులు ఎత్తి వెనక్కి వేలాడేసి, కాళ్లు జాపి ముక్కాలు పీటమీద ఉంచేది. అతను పైవరండా జాఫ్రీకి చేతులు ఆనించి చొక్కా, బనీను లేకుండా ఉక్కగా వున్నప్పుడు నిలబడేవాడు. ఇద్దరికీ అప్పుడు తోచక సంభాషణ ఆరంభించేవారు. ఆమెరికా రష్యాల సయోధ్య, వాతావరణం కాలుష్యం, సినీహీరోల నటనలు



వగైరాల మీద సంభాషించేవాళ్లు. తండ్రి కూడా అప్పుడప్పుడు విని ఆనందించే వాడు. పిల్లల తెలివితేటలు పెద్దలకు ఆనందాన్నివ్వటం సహజం కదా. వాళ్లిద్దరి మధ్య స్నేహం బలపడేకొద్దీ చదరంగం ఆటలో ఆమె తప్పుడు ఎత్తులు ఎత్తటం అధికమయింది. తను గెలుస్తున్నందుకు కాస్త ఆయనకు ఆనందంగా వున్నా ఆమెలో ఏకాగ్రత లోపించటం విచారం కలిగించేది. అలాంటి ఆట రక్తి కట్టదు కూడా. స్నేహం కారణంగా ఆమె చద రంగం పాటవం కుంటుపడుతోందని ఆయన గ్రహించలేకపోయినాడు. కొన్ని రోజులకు ఆ ప్రేమ పక్షులు ఎగిరిపో యాయి. కొన్నాళ్లు ఆయన తలెత్తుకోలేక పోయాడు. ఏడుస్తూ భార్యా సాధిస్తుం డేది. "మనం పెళ్లీ చేయక, దానితోవ దాన్ని చూసుకోవద్దు అంటే ఎలానే. ఎందువల్ల జరిగిందో అది ఒక విధంగా మన మంచికే అనుకో" అన్నాడు. ఆమె సాధింపు కాస్త తగ్గింది.

నీతి: అసమర్థులైన తల్లిదండ్రుల కూతుళ్లు ఇలాంటి వ్యవహారాలు చాటుమా టుగాను, అంత చాటుమాటుగా కాకుం డాను నడుపుకుని వాళ్ల తోవలు వాళ్లు చూసుకోవటమే ఉత్తమం. పైగా ఒకే రాయితో రెండు పక్షులను కొట్టినట్లు, తల్లి దండ్రుల రుణం తీర్చుకున్నట్లు కూడా అవు తుంది.

ఆ విధంగా రెండో కూతురు తల్లిదండ్రు

లను, ఇంటిని, చదరంగాన్ని వదిలి మరో పక్షితో జంటగా ఎగిరిపోయిన కొత్తల్లో ఆయన విచారగ్రస్తుడయినాడు. మూడో కూతురు కొంతమేరకు తండ్రి రుణం తీర్చు కోదలచింది.

"నాన్నా.. మీకు తెలీకుండా ఆట నేర్చు కున్నాను. నీ అంత, అక్క అంతా ఆడలేక పోవచ్చును. ఒక్కరోజే ఎవరూ పెద్దవాళ్ల వరని మీకు నేను చెప్పక్కరలేదు. అతి త్వరలో ఆటకు సంబంధించి అక్కలేని లోటు తీరుస్తా" అంది. ఆయన కాఫీ సేవించి, వక్కపొడి నములుతున్న వేళ. అలాంటివేళ కూడా ఆయనకు ఎందుకో కోపం ముంచుకొచ్చింది.

"ఆట ఆడకపోతే ఛస్తానా? అందుకే ఏడుస్తున్నానా, మీ అక్క చేసిన నిర్వాకా నికి కాక. అవతలికి ఫో. మరో జన్మంటూ వుంటే ఆడపిల్లల్ని కనను" అన్నాడు వాళ్లను ఉద్ధరించడానికి కావాలని కన్నట్లు.

గంట గడిచింది. ఆయనది నవనీత హృదయం. పిల్లని తిట్టినందుకు పశ్చాత్తా పృడ్డాడు. తను బాధపడుతుండటం చూసి కదా అది అలా అంది. "రామ్మా!" అని లాలనగా పిలిచాడు. బోర్డు తీస్తూ, వక్క పొడి నములుతున్న దవడలు ఆడిస్తూ.

జంక్షనులో దిగి అల్లిపురం మెయిన్ రోడ్డు అని పిలవబడే అడ్డుగా అయిదు గురు పట్టే సందులో ముందుకు పోయి ఇద్దరు పట్టే ఎడమ సందులోకి మళ్లాడు. ఒక ఇంటి ముందు ఆగి దాన్ని పరికిం చాడు. అది పురాతత్త్వశాఖ త్రవ్వకాలలో అప్పుడే బయటపడ్డట్టుంది. ఎవరన్నా మేలుకుని ఉన్నారో లేరో, వరండా కిటికీ మూసేసి వుంది. లోపలి నుంచి వెలు తురు కిరణం ఒక్కటీ బయటపడటం లేదు. ఇక్కడ ఆయన లేనట్లేగదా, ఎందుకు తలుపు కొట్టి ఎవరిదో నిద్రపాడు చేయటం? ఒకవేళ ఇంతకుముందే ఆయన వచ్చి వెళ్లుంటే అది తెలుస్తుంది కదా. తలుపు తడితే వదులుగా వున్న పైకప్పు పాతపెంకులు రాలిపోతాయేమో, ఎటూ తేల్చుకోలేక కాసేపు నిలబడి, తెగించి నెమ్మదిగా తలుపు కొట్టాడు. కొంతసేపు ఆగాడు. లోపల అలికిడి విని పించక మరోసారి కొడదాం అనుకుంటుం డగా తలుపు పక్క కిటికీ తలుపు తెరుచు కుని దాని వెనుక వైకుంఠంగారి అఖర మ్మాయి ముఖం కనిపించింది. "ఎవరూ? " సన్నటి గొంతుతో కాస్త ఉత్కంఠతో అడి గింది. సమాధానం ఇచ్చేలోపే, "ఉండండి తలుపు తీస్తాను" అంది.

"అక్కర లేదండీ, మా నాన్నగారు వచ్చి వెళ్లారేమో కనుక్కుందామని వచ్చాను అంతే. ఏ పనిపడో ఉండిపోయి వుంటారు, ఇంకా ఇంటికి రాలేదు.

"రాలేదండీ, నాన్నగారిని లేపుతానుం డండి" అంది ఆయన ఆ సమస్యను తీర్చ గలిగినట్లు.

"అబ్బే ఎందుకండీ, ఆయన నిద్ర పోగొ ట్టడం, వస్తా" అని బయలుదేరిపోయాడు.

## 4

జేబులో రూపాయి మిగిలింది. సమయం పదకొండు అవుతుండవచ్చు. తండ్రి పనిచేసే చోటు హార్బరు దగ్గర వుంది. ఆ చోటు కూడా చూస్తే వెతకటా నికి ఏమీ మిగలనట్లే. ఆ తర్వాత ఇంటికి వెళ్లి ఏం చేయాలో తల్లితో మాట్లాడి నిర్ణ యించవచ్చు.

నడిచి పావుగంట- ఇరవై నిముషాలలో హౌరా బ్రిడ్జి జంక్షను చేరుకున్నాడు. కుడి వైపు తిరిగి హార్బరు వెళ్లటమా, ఎడమ వైపు తిరిగి ఇంటి దారి పట్టటమా అన్న మీమాంసలో పడ్డాడు. ఇంటికి ఈసరికి ఆయన వచ్చేసి వుండవచ్చు. ఇంతవరకు తను పడిన శ్రమ అర్థం లేనిదవుతుంది.

ఆయన ఇల్లు చేరటం జరిగితే శ్రమ అర్థవంతమయిందా కాదా అన్న ప్రశ్నే రాదు. ఒకవేళ చూడదగిన ఈ చోటు చూడకుండా ఆయన వచ్చి ఉండొచ్చు అన్న ఆశాభావంతో వెళ్లి, తీరా ఆయన వచ్చి వుండకపోతే?

తండ్రిమీద కోపం వచ్చింది. వయసు పైబడింది గాని పెద్దరికంగాని, బాధ్యతాయుతమైన నడవడిగానీ లేదు. కుడివైపు తిరిగాడు. పది నిముషాలలో ఆయన పని చేసే చోటుకి వచ్చాడు. మూసిన తలుపులు దర్శనమిచ్చాయి. కావలిస్తే బుర్ర బాదుకోవచ్చు.

**తండ్రిమీద కోపం వచ్చింది. వయసు పైబడింది గాని పెద్దరికంగాని, బాధ్యతాయుతమైన నడవడి గానీ లేదు. కుడివైపు తిరిగాడు. పది నిముషాలలో ఆయన పని చేసే చోటుకి వచ్చాడు. మూసిన తలుపులు దర్శనమిచ్చాయి. కావలిస్తే బుర్ర బాదుకోవచ్చు.**

నారాయణరావు ఇంటి దగ్గిర లేడు. కాబట్టి డ్యూటీకి వచ్చి వుండాలి. ఇక్కడ చూచి అతను డ్యూటీకి రాలేదని నిర్ధారించుకుంటే తండ్రి అతనితో ఎక్కడో వున్నాడని సరిపెట్టుకో వచ్చు యాంత్రికంగా కాళ్లు హార్బరు గేటువేపు సాగాయి.

లేపాక్షి హస్తకళల షోరూము మూసేసి ఉంది. హార్బరు గేటుకు ఇరువైపులా ఎత్తైన ప్రహరీ. గోడమీద ఇనుప ముళ్లతీగె కంచె. గోడల కవతల నించి జిరాఫీల్లా ఆకాశానికి తలలెత్తి చుక్కలను అందుకోజూస్తున్నట్లు ఎలక్ట్రిక్ వార్ఫ్ క్రేనులు. గేటు దాటిన వెంటనే ఎడమచేతి వైపు సందు. దాన్నానుకుని సి.ఎస్.ఎఫ్. వాళ్ల కంట్రోలు రూం. లోపల ఇన్‌స్పెక్టరు - ఏదో రాసుకుంటుంటే గార్డ్ నీలుక్కుపోయి నిలబడి వున్నాడు. కంట్రోలు రూం తర్వాత రైలుపట్టాలు, ఆపైన "రిపోర్ట్ హియర్ ఫర్ కస్టమ్స్ ఎగ్జామినేషన్" అన్న బోర్డుతో కస్టమ్స్, కంట్రోలు రూం.

సెక్యూరిటీ గార్డ్స్ దగ్గిరకెళ్లి తన అవసరం వినిపించాడు, లోపలికి వెళ్లటానికి అనుమతి దొరికింది. అరవై అడుగుల దూరంలో కుడి ఎడమల స్టోరేజి షెడ్డులున్నాయి. మధ్యలో 'కీ వాల్' అని పిలువబడే ఓడలను కట్టే బెర్తులుండేచోటుకు దారి వుంది. ఇక్కడి నించి నిస్సహాయంగా ఒక ఓడ కనిపిస్తోంది. అలా వున్నా ఎత్తుగా, హుందాగా ఉంది. మూడో నెంబరు తూర్పు బెర్తు దగ్గిర కొందరు నిలబడి వున్నారు. ఇరుకు సందులాంటి సముద్రం నుంచి లోపలికి వచ్చే ఇన్నరు ఛానల్ ద్వారా ఏదో ఓడను అప్పుడే లాక్కొచ్చిన టగ్ (ఒక రకం మర పడవ), బరువు లాగి వచ్చిన దున్నలా రంకె వేస్తోంది. "నా భయంకరమైన ప్రయాణం ఇంకా ముగియలేదు, క్యాప్టెన్," అంటున్నట్టుంది. అప్పుడే మరో బెర్తు దగ్గిర కట్టివేయబడిన ఓడ. వాటి జీవితం అంతా ఎడతెగని ప్రయాణం, మధ్య మధ్యలో మజిలీలు; అంతే. మజిలీ మజిలీకి దాని చోదకుడికి ఆ విషయం "భయంకరమైన..." అని అది గుర్తు చెయ్యక్కర లేదు. లంగరు వ్రేలాడే కన్నంలోనించి ధారగా, కన్నీరులా సముద్రపు నీరు కారుతోంది. దాన్ని తాళ్లు పెట్టి బెర్తుమీది బొలార్డుకు (ఇనుప దిమ్మెకు) కట్టి, గ్యాంగ్‌వే (నిచ్చెన) తగిలిస్తున్నారు. ఈ తంతును షిప్ క్యాప్టెన్ అసహనంగా చూస్తున్నాడు. డాక్ మీది నించి - త్వరగా పని పూర్తిచేసుకుని ఈ రేవు వదిలి పోవటానికో, ఓడ దిగి నేల మీద కాలూనటానికో.

బెర్తు మీద నిలబడి మాట్లాడుకుంటున్న వాళ్ల దగ్గరగా నడిచాడు అభిమన్యు. వాళ్లలో ఒక వ్యక్తి ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్‌లా వున్నాడు. మరొకడు అతనికి యాంటిథిసి

స్‌లా ఇథియోపియానుంచి అప్పుడే ఓడ దిగినట్లు ఉన్నాడు. 'సృష్టిలో ఎంత వైవిధ్యం ఉంది' అని భోంచేసి ఉన్న వేళల్లో అబ్బురపడవచ్చు ఆనందించవచ్చు వాళ్లిద్దర్నీ చూసి. రెండవ వ్యక్తి మాటలు తేనెలొలుకు తుండటం వలన అతను విదేశీయుడు కాడు భారతీయుడే, అందునా పదహారణాల తెలుగువాడు, ఈ దేశపు కరువు పౌరుడే అని తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. అతనికి కుడివైపు చేతులు కట్టుకొని నిలబడ్డ మనిషి మలబద్ధక బాధితుడిలా ఉన్నాడు. మిగతా వాళ్లు ఇతనిపై అధికారులు కాదు. పైఅధికారుల కనుసన్నలలో అనుక్షణం మసలుతూ పై అధికారుల సమక్షంలో లేని వేళలలోను చేతులు అసంకల్పితంగా కట్టేసుకుంటాయి, చివరకు సొంత పిల్లలు ముందు కూడా. మలబద్ధక రోగం అతని చేతులలో లేనట్లే, చేతులు కట్టుకుని ఉండిపోయే రోగం కూడా అతని అధీనంలో లేనిది. రోగులను చూచి నవ్వుకోం, వీలయితే జాలిపడతాం. రోగిని చూసి నవ్వుకున్నామంటే మనలో రోగం ఉన్నట్లే. అతను సాధారణంగా, పనిచేసే చోటుకురాడు. సమయం దొరకదు, అధికారుల కనుసన్నలలోనే గడిచిపోతుంది. అతను ఈ పనిచోటులో అరుదైన అప్పియరెన్స్ ఇస్తున్నాడు. ఇక నాలుగు, అయిదవ వ్యక్తుల మాట. వాళ్లలో ఎలాంటి ప్రత్యేకతలు లేవు, అతి సామాన్యులు. హిచ్‌కాక్‌ను పోలిన పోలికలు గాని, మలబద్ధకత లాంటిది గాని, దారిద్ర్యపీడత లక్షణంగాని లేని ఆ ఇద్దరు అతి సామాన్యులు గాక వేరెంకెవరు?

కరువు దేశ పౌరుడిని మినహాయిస్తే మిగతా వాళ్లంతా ఏదో సమ్మోహనాస్త్ర బంధితులై ఉన్నారు. అతన్ని మినహాయించటానికి కారణం అతను లోకాతీతుడని కాదు. ఆ అస్త్రాన్ని ప్రయోగిస్తున్నవాడు అతనే కావటం చేత. ఆ సమ్మోహనాస్త్రం అతని సుమధుర పలుకులు.

అప్పుడప్పుడూ హిచ్‌కాక్ నవ్వుతున్నాడు. "శ్రమ తీసుకోకుండా నవ్వుట ఎటులు? " అన్న తను రాయని థీసిస్‌ను స్వకులస్థుడైన వి.సి., ఆచార్యుల ఆశీస్సులతో విశ్వవిద్యాలయానికి సమర్పించి డాక్టరేటు కొట్టేసినట్లు అతను కనిపిస్తున్నాడు. అతను నవ్వటానికి చేసేదల్లా - పెదవులు మూసి విల్లులా చెవులదాకా సాగదీయటమే. బాణం లాంటి నవ్వు దూసుకుపోతుంది. అవి చెవులదాకా చేరుకోవటానికి ప్రయత్నించినపుడు, ఆ కలయికను చూడటం ఇష్టంలేనట్లు కళ్లు మూసుకుపోతాయి. కాబట్టి నవ్వుట లేక చూచుట మాత్రమే డా॥ హిచ్‌కాక్ చేయగలడు. శబ్దరహితమైనట్టిది, ఎవరికీ అసౌకర్యం కలిగించనట్టిది ఆ నవ్వు. పది నిముషాల కాలంలో మిగతా వాళ్లంతా ఒక్కసారైనా మాట్లాడారు కాని ఈయన ఒక్కసారీ మాట్లాడలా, మరో విధమయిన పనికీ నోరెత్తలా. నవ్వు, చూపు - ఒక దాని తర్వాత ఇంకొకటి. ఆ రెండిటికి బదులు ఒళ్లంతా చెవులు చేసుకుని వింటున్నాడు. వింటేనే కదా నవ్వొచ్చేది - చూచి నవ్వటానికేమీ లేనపుడు. నిండుకుండలు మాటలు తొణకవు. నిండుకుండ తొణికితే ఎలా వుంటుందో ముందు ముందుగాని తెలియదు. ఏ తాత్త్విక విషయమో వెల్లడి కావచ్చు, నవరత్నాలు రాలవచ్చు. అప్పుడే చుట్టూ వున్నవారు జ్ఞాన హరితులు కావచ్చు లేదంటే నవరత్నాలు ఏరుకోవచ్చు.

"మా ఇంటిమీదున్నాడుగా ఆడు నన్ను సలహా అడిగాడ్లే. భార్య వుండగా మరో ఆడదాంతో పోవచ్చునా అని. ఇన్నేళ్ల తర్వాత ఇంత లేటు వయసులో ఈ అనుమానం ఏలా, దరమ సంకటం ఏల, అన్నా. ఒదినకి సెప్పమంటావా? అన్నా," కరువుదేశ పౌరుడు కొనసాగించాడు

# ఉషశ్రీ చతురోక్తులు



పురాణవిజ్ఞానం, ఆధ్యాత్మిక విషయాలపై పట్టుగల పౌరాణికులు ఉషశ్రీ అందరికీ సుపరిచితులు. దశాబ్దాల క్రితం ఆకాశవాణిలో ధర్మసందేహాలకు సమాధానాలిస్తూ శ్రోతల్ని ఆకట్టుకున్న ఆయన వివిధ సందర్భాలలో నుడివిన చతురోక్తులు మీకోసం..

## అంపశయ్య

ఆఖరిరోజుల్లో ఉషశ్రీ ఆస్పత్రిలో ఉన్నారు. ముందునుంచీ పరామర్శలు, ఓదార్పులు అంటే ఆయనకు తగని చిరాకు. ఆ క్షణాల్లో కూడా తన హాస్యధోరణి విడిచిపెట్టేవారు కాదు. ఎవరైనా మిత్రులు పలకరించడానికి వస్తే 'ప్రస్తుతం భీష్మపర్వం నడుస్తోంది.. అంపశయ్యమీద ఉన్నాను' అనేవారు తన పౌరాణిక సంభాషణా శైలిలో.



సమ్మోహనాస్త్రాన్ని ఒకసారి ప్రయోగించటం చేసింతర్వాత వెనుదిరిగే ప్రసక్తే లేనట్లు.

"నీ గుణం ఎలాంటిదో తెలుసుకోటానికి ఆ ఎత్తు ఎత్తాడేమో వాడు" ఏ ప్రత్యేకత లేని వాళ్లలో ఒకడు అన్నాడు.

"మనవాడు పరమ పవిత్రుడు అని ఎవరన్నా భావించినపుడు కదా శీలపరీక్ష ప్రశ్న వచ్చేది. పవిత్రుడా, అపవిత్రుడా అన్న విషయం మనవాడి విషయంలో ప్రధాన విషయం కాదు. సామర్థ్యం ఉన్నపుడే కదా ఆ ప్రశ్న అసలు ఉదయించేది. అందువల్ల అదేదో శీల పరీక్షా ప్రయత్నం అంటే నేను చచ్చినా నమ్మను". కానిష్టిపేషన్ పేషెంట్ అన్నాడు. అతనికి దేన్నీ (సొంత పెళ్లాంతో సహా) నమ్మని రోగం కూడా వుంది, ముందు చెప్పుకున్న జబ్బుతోపాటు.

"ఆయన కాలక్షేపానికి ఏదో విషయం చెబుతున్నాడు. వినవచ్చుకదా. వినకుండా, విననీయకుండా వ్యాఖ్యానాలెందుకు," ఏ ప్రత్యేకతా లేని రెండవ వ్యక్తి అన్నాడు విషయం మీద కలిగిన ఆసక్తితో.

"తమ్ముడూ! మా కొంప కూల్చాలన్న కోరికేదైనా వుంటే మీ ఒదినకి చెప్పు. ఆ ప్రశ్న వేధించే అవకాశం నా జీవితంలో మొదటిసారి ఇప్పుడే వచ్చింది మరి, అన్నాడు. ఇవరాలు సెప్పు సందేహం తీరుస్తా అన్నా. ఏ సాయమన్నా మానే యొచ్చు, మాట సాయం మానకూడదు. పైగా దానికి కాణీ ఖర్చులేదు.

"ఇవరాలు అడక్కండి, మీరు సక్కని సలహా ఇవ్వగలరన్న నమ్మకంతో ఎవరి దగ్గిర అనరన్న దీమాతో ఈ ఇసయం మీకు సెప్పా" అన్నాడు. అప్పుడు ఆడు నన్ను నమ్మినందుకు ఉబ్బిపోయి సలహా ఇచ్చా"

"ఏమని? " ఏ ప్రత్యేకతా లేని రెండవ వ్యక్తి మొహం అంతా కళ్లూ, చెవులూ చేసుకుని అడిగాడు.

"అబ్బే తప్పేం లేదు. అవకాశం రావాలి గాని ఆ పని సేయని ఎదవెవ్వడు. ఆ పనికి సరిగా పనికి రానోడు కూడా ఏడవగలిగినంత వరకే ఏడుద్దావని తయారవుతాడు" అన్నా.

"వివరాలు కొన్నైనా లాగాల్సింది; ఆడమనిషి ఎవరో ఏంటో, ఆమెకు పెళ్లయిందో లేదో"

"బలవంతంసేసా, సెప్పలేదా గాడిద కొడుకు. ఎవరా స్త్రీ? పెల్లయిందా కాలేదా? వయసులో వుందా, మద్దెవయసా? అందగత్తా, ఓ మోస్తరా? ఇక్కడి మనిసా - అంటే మనం ఎరిగిందా, ఎరగందా? ఆడు సెప్పన్దే. అన్ని ప్రశ్నలకు అడ్డుగా తలూపాడు అడ్డగాడిదలా.

# కాళ్ళే చేతులు




అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రానికి చెందిన టోనీమెలెన్‌టెజ్ గొప్ప గిటార్ ప్లేయర్ కానీ పుట్టుకతోనే అతనికి చేతులు లేవు! తన కాలివేళ్ళతో గిటారు తీగలని వాయిస్తాడు!!

అమెరికా అంతటా తిరుగుతూ వివిధ మ్యూజిక్ హాల్స్‌లో టోనీ గిటార్‌ని వాయిస్తుంటాడు. హేండ్స్ ఇన్ హెవెన్, ఐ విష్ దట్ ఐకుడ్ హోల్డ్ యూ లాంటి పాటలు వాయిస్తాడు.

నికారాగ్వా దేశంలో పుట్టాడు టోనీ. వేవిళ్ళని ఆపడానికి అతని తల్లి థైలాడోమైడ్ అనే మందు తీసుకునేది. తర్వాత ఆ మందు తీసుకున్నవారికి పుట్టిన పిల్లలంతా అంగవైకల్యంతో పుట్టడంతో ఆ మందుని నిషేధించారు.



అతను తన కాలితో ఫోన్‌ని డయల్ చేయగలడు. ప్రత్యేకంగా నిర్మించిన డాడ్జిమ్‌డామ్ ఛార్జర్ అనే కారుని తన కాలితో నడపగలడు.

ఇతను టీనేజర్‌గా ఉండగా తన తండ్రి 12 తీగల స్పానిష్ గిటార్‌ని వాయించడం గమనించాడు. అతనికి గిటార్ మీద అలా ఆసక్తి కలిగింది. 1987లో లాస్ ఏంజెల్స్‌లో పోప్ పాల్ జాన్-II ముందు మతపరమైన సంగీతాన్ని వాయించి ఆయన మెప్పు పొందాడు. 'నెవర్ బి ది సేమ్' అతని మొదటి ఆల్బం.

అతనికి లిన్‌తో వివాహమైంది. మరిసా అనే కూతురు, ఏండ్రూస్ అనే కొడుకు కూడా ఉన్నారు.



శమించు బావగారు, నన్ను నమ్మి నన్ను సేరే ఆడకూతురుకు అన్నేయం సేకూడదు అన్నాడు. సలహా సెప్పేంతవరకు నేను తమ్ముడ్ని, అది సెప్పేసిం తర్వాత బావ నయి పోయానాడికి. నిన్ను నమ్ముకున్న భార్యకు తెలీకుండా ఇంకో దాంతో పోవటం నీ భార్యకు అన్నేయం సేయటం కాదా అని అడిగాను. తప్పేం లేదని నువ్వే సెప్పావు కదా అన్నాడు. ఆ అమ్మాయి ఇవరాలు సెప్పటం కూడా తప్పుకాదని నే సెప్తున్నా ఇనూ అన్నా. నేను ఈ ఇసయంలో సలహా అడగ లేదే అని ఎదురు ప్రశ్నేశాడు. విపరీతమైన కోపమొచ్చింది. తన కోపమె తన శత్రువు గదా, ఆ శత్రువును దిగమింగుకుని, జీర్నం జీర్నం వాతాపి జీర్నం అనుకున్నా. ప్రాధేయపడుతూ అన్నా: నీకు సలహా అడగటా నికి పనికొచ్చాగాని, ఇవరాలు ఇనటానికి పనికిరానా, అన్నయ్యా! ఆడు కరగలా, ఆడు నాగుండెలో తన్నినట్లు బాధ నటించినా"

"పోనీ క్లూ అన్నా అడక్కపోయావా? " సస్పెన్సు భరించ లేని వ్యక్తి అడిగాడు.

"మాకు బుద్ధిచెప్పి నువ్వెందుకు వాడు చెప్పేదానికి అడ్డు తగులుతావు", అన్నాడు కాన్‌స్టిపేషన్ పేషెంటు ఈసారి సస్పెన్సు భరించలేకపోవటం తనవంతు అయినట్లు, ఉన్న రోగం చాలనట్లు.

"బతిమిలాడగా, బతిమిలాడగా ఆడు క్లూలిచ్చాడు. ఒడ్డూ పొడవూ ఉంటది. పిటపిటలాడుతుంటది. ముచ్చెనగుంటలో పుట్టుమచ్చుంటది. వయసు పాతిక నుంచి నలభైదాకా ఎంతైనా కావచ్చు. మన క్వార్ట ర్సులోనే ఉంటున్న పెళ్లయినది"...

**"బతిమిలాడగా, బతిమిలాడగా ఆడు క్లూలిచ్చాడు. ఒడ్డూ పొడవూ ఉంటది. పిటపిటలాడుతుం టది. ముచ్చెనగుం టలో పుట్టుమచ్చుం టది. వయసు పాతిక నుంచి నలభై దాకా ఎంతైనా కావచ్చు. మన క్వార్ట ర్సులోనే ఉంటున్న పెళ్లయినది"...**

"పుట్టుమచ్చ ముచ్చెలిగుంటలో ఉంటే మనకెలా కనబడుతుంది, జెడెత్తి చూస్తే తప్ప"

"అప్పుడు ఆలోచించటం మొదలుబెట్టా, రెండు రాత్రిళ్లూ రెండు పవళ్లూ ఆలో సించా... ముగ్గురు ఆడోళ్లు ఆడుసెప్పిన గుర్తులుకు సరిపొయ్యారు. మరోరోజు ఆలోసించా..."

"ఆలోచించటం తప్ప నీకు మరో పనే ముందిలే రాత్రిళ్లు."

"ఆలోచించటానికేనా నిన్నా, మొన్నా, శలవు పెట్టావు? "

"అందుకయి ఉండదు - అనకాపల్లి వెళ్లటానికయివుంటుంది"

"అనకాపల్లి" అన్నమాట వినంగానే కరువు దేశ పౌరుడి మొహం జేవురించింది. ఎవరో తన్నరానిచోట తన్నినంత బాధ కలిగింది. ఆ మాటలు అన్న మనిషిని తీవ్రంగా చూచి దక్షిణ దిక్కుకేసి అడుగులు వేశాడు. మనుషులలో దుర్మార్గం ఎక్కువవుతోంది. బాధపెట్టి సంతసించే నైజం రాక్షస నైజం.

ఆ మాటలన్నది హిచ్‌కాక్.

తాత్త్విక రహస్యం, ముత్యములు కాక అణు విస్ఫోటంలా అనకాపల్లి అన్నమాట ఆ నవ్వుల విల్లు పెదవుల మీదగా దొర్లొచ్చి పేలింది.

"భలేవారండి, బావగారూ, ఎవరన్నా సరదాగా హాయిగా ఉంటే చూడలేరుగా! చిరునవ్వులు చిందించే హక్కు మీకొక్కళ్లకే ఉందా? ఇదేం న్యాయం? " సస్పెన్సు భరించలేని బలహీనుడు ప్రశ్నించాడు, మందలించాడు, ఆక్షేపించాడు, జాలిపడ్డాడు, బాధపడ్డాడు, ఆశాభంగం చెందాడు.

హిచ్‌కాక్ సమాధానం చెప్పలేదు. నవ్వాడు తన మార్కు నవ్వు. ఇంకిపుడల్లా మాట్లాడడు, తాంబూలాలిచ్చేశాను తన్నుకు

చావండి అన్నట్లు.

"మనవాడి ఇంటిమీది వాడికి వీడు క్రానిక్ వాయర్ అని తెలిసిపోయుం టుంది. అందువల్ల వీడ్ని ఏడిపించటానికి, వీడ్ని ఊరించటానికి శృంగార కథ అల్లేసి వుంటాడు. లేదంటే సొంత గొప్ప గురించి సొరకాయ కోశాడో" కానిష్టి పేషన్ పేషంటు అన్నాడు.

వాళ్లు అంత సీరియస్‌గా ముచ్చటించు కుంటుంటే పానకంలో పుడకలా వెళ్లటం ఎందుకని కాస్తంత దూరంలో నిలబడిన అభిమన్యు వాళ్ల దగ్గరగా వెళ్లి, "నారాయణ రావుగారు ఎక్కడుంటారో చెప్ప గలరా? " అని అడిగాడు.

"అతను ఈరోజున విధులకు హాజరైవుంటాడన్న నమ్మకం నాకు లేదు, బాబూ"

హిచ్‌కాక్ నవ్వాడు, ఆ మాటలతో తను ఏకీభవిస్తు న్నట్లు.

నారాయణరావు గురించి ఆ కుర్రాడు ఎందుకు అడుగుతు న్నాడా, ఇతనికి అతనికి ఏమిటి సంబంధం అన్నట్లు కుతూహ లంగా అభిమన్యువైపు చూశాడు ఒక వ్యక్తి.

"రావచ్చు కాస్త ఆలస్యంగానైనా. వస్తే ఇక్కడికే వస్తాడు. కాసేపు వేచి వుండండి'
'.

"అయ్యా, నా మాట వింటావ్! (తను వింటాడో లేదో సమాధానం రాకుండానే కొనసాగించాడు) ఏ పింక్ ఎలిఫెంట్‌కో, ఉమర్ ఖయ్యామ్‌కో, అమర్‌ఖయ్యామ్‌కో వెళ్లి వెతికితే అతగాడు తేలిగ్గా దొరుకు తాడు. నిన్ననేగా చేతికి జీతం వచ్చింది. జీతం బరువు అతి త్వరగా వదిలించుకో వాలి"

ఈ లోపల తను చెబుతున్న కథను పూర్తిచేయాలన్న తహతహ అనకాపల్లి కలి గించిన బాధను అవమానాలను జయించి నట్లుంది, కరువు దేశస్థుడు తిరిగివచ్చాడు తన మిత్రుల దగ్గరకి. చిరకాల మిత్రుడు కనిపించినట్లు సాదరంగా ఆహ్వానించి వీపు తట్టారు. స్నేహం అలాంటిది మరి. వాళ్లందరికీ అప్పుడు ఒక పరిచిత శాల్తీ గాంభీర్యంగా ఏనుగు నడక నడుస్తూ వాళ్ల వైపు రావటం కనిపించింది.

**పెయిర్‌లెస్ మీద తెగ సంపాది స్తున్నాడుగా. భార్యను కూడా అసలు పనికి మానేసి ధనార్జనకే వినియో గించుకుంటున్నాడు. పెళ్లాం కట్టే బట్ట సూడు? ఇల్లు తుడవటా నికి, కట్టుకోడానికి ఒకటే వాడుతున్న ట్టుంటుంది.**

"సుందరంగాడు కదూ? .... ఛా, కాదు... ఆc వాడే.... వాడు కాక ఇంకె వరు? రోజు రోజుకూ దుక్క తన్నుతున్నాడు"

"తన్నేస్తాడు! తన్నెయ్యడూ? తప్పకుండా తన్నేస్తాడు! తెగ సంపాదిస్తున్నాడుగా. భార్యను కూడా అసలు పనికి మానేసి ధనార్జనకే వినియోగించుకుం టున్నాడు. పెళ్లాం కట్టే బట్ట సూడు? ఇల్లు తుడవటానికి, కట్టుకోడానికి ఒకటే వాడుతున్న ట్టుంటుంది. అయినా ఉల్లి పాయ, పచ్చిమిరపకాయ నంచు కుని, నీళ్ల మజ్జిగన్నం జుర్రే టోళ్లకు కూడా అంతవొళ్లెట్లా వస్తదో నాకర్థం కాదయ్యా!" కరువు దేశపౌరుడు ఆ అయిన వాళ్ల దగ్గిర నెమ్మదిగా ఆవేదన వ్యక్తం చేశాడు.

హిచ్‌కాక్ నవ్వలేదు.

"బావగారు, మీ గురించి అన్లా. మీ ఒక్కరి తిండికి కర్చయ్యేది ఒక ఇంటిల్లిపా దికి సరిపోతుంది- మీ మీదొట్టు", శీలపరీ క్షకు సిద్ధపడ్డాడు కరువుదేశ పౌరుడు.

హిచ్‌కాక్ నవ్వలేదు.

"నా మీద ఒట్టు," క్షణంలో తప్పెరిగి అన్నాడు.

నవ్వాడు.

కరువు దేశపౌరుడి పేరు సత్యం. అత

నికి అందరిలా పెళ్లయింది. రంభలాంటి భార్య. అతని మాటలు గంట వినట మంటే అరగంటసేపు నీలిచిత్రం చూచి నట్లు. అతగాడి 'రసికత' మనసుకు, నోటికి పరిమితమైపోయి క్రిందికి జారకుండా పుట్టినచోటే ఉండిపోయింది. చూచి చూచి రంభలాటి భార్య మడికట్టుకుని ఉండటం మానేసింది. ఈలోగా ఆమె మేనబావ భార్య దివంగతురాలయింది. ఏదో త్యాగం చేయబోతున్నట్లు తనకు భర్త బాధా (నిజానికి భర్తతో ఏ బాధా లేదు - అదే కదా అసలు సమస్య) తీరుతుంది, మేనబావ జీవితంలోని ఖాళీ భర్తీ చేసినట్లుంటుందని అనకాపల్లి వెళ్లిపోయి అక్కడే వుండిపోయింది. మేనబావ బాగా డబ్బున్నవాడవటం చేత 'కులపోళ్లు' కూడా ఏం చెయ్యలేక సత్యాన్ని సత్యం కర్మకు వదిలేశారు. స్వతహా ఆశాజీవి కాబట్టి కాలంమీద, భార్య చంచలత్వం మీద ఆశపెట్టుకుని ఆమె గురించి ఎదురుచూస్తూ, అప్పుడప్పుడూ అనకాపల్లి వెళ్లివస్తున్నాడు. ఇప్పటికి పదిసార్లె ళ్లాడు. కొన్నిసార్లు మేనబావ ఇంట్లోనే ఉండటం వలన సత్యానికి తన భార్యను కలవటం వీలవలేదు. వీలయినప్పుడు, "నేను మునుపటి మనిషిని కాను" అని చెప్పుకుని అతిదీనంగా ప్రార్థించాడు విశాఖపట్నం వచ్చేయమని. ఆమె ఈ మధ్య డోలాయమానంలో పడింది. అది గమనించి, "ఉందిలే మంచి కాలం ముందు ముందున" అన్న ఆశాభావంతో ఉన్నాడు.

**అతని మాటలు గంట వినటమంటే అరగంటసేపు నీలిచిత్రం చూచినట్లు. అతగాడి 'రసికత' మనసుకు, నోటికి పరిమితమైపోయి క్రిందికి జారకుండా పుట్టినచోటే ఉండిపోయింది. చూచి చూచి రంభలాటి భార్య మడికట్టుకుని ఉండటం మానేసింది.**

"శివంబాగారూ, పోయిన రెండు సార్లూ మీరే తీసుకున్నారు మొదటి రెండు పాటలు. ఆ రెండు సార్లూ పేరుకు ఫండు మీరు మొదలు పెట్టారుగాని సభ్యులను చేర్పించే గాడిద చాకిరి నేనే చేశాను. అందుకని ఈసారి మొదటి రెండు పాటలు నావి. నా భార్య పేరుతో, నా పేరుతో రెండు సభ్యత్వాలు తీసుకుంటా"

సుందరం పైకి చూడటానికి నిజంగా అందగాడు. నవ్వి ఊరుకున్నాడు హిచ్‌కాక్, అదే శివం.

"బావారిది సిరిగల చెయ్యి. ఆయన పేరు చెబితేనే నలుగురూ చేరతారు. అంతేకాక సొంత లాభం కొంత మానుకోగల వ్యక్తి బావారు," ఇథియోపియనుడు కవ్వింపుగా అన్నాడు.

"ఒరే సత్యం! సొంతలాభం మానుకునే తత్వం మీద నీ వేదాంత ఉపన్యాసాలే వినాలి. కొంచెం లాభం గురించి కూడా బట్రాజు అవతారం ఇట్టే ఎత్తే నువ్వు, నోటిని పొగడ్తలకు తాకట్టు పెట్టిన నువ్వు నీతుల జోలికి వెళ్లకరోరేయ్."

"భలేవాడివి రా సుందరం! ఎందుకంత కోపం. నీ గురించే వన్నా అన్నానా? అన్నానా అని. స్వార్థం అన్నమాట ఎవరి నోటెంటొచ్చినా నువ్వేగిరి పడితే ఎలా? దాని మీద హక్కు పేటెంటు చేశావా? "

ఒక చిట్‌ఫండు లెక్కల్లో వందరూపాయల తేడా వచ్చిం దగ్గర నించి సత్యం సుందరం గురించి ఈ క్రింది దుష్ప్రచారం చేస్తున్నాడు-

సుందరంగాడు ఎంత స్వార్థపరుడంటే, చిన్నప్పుడు వాడి ముక్కు కారుతుంటే, కావలిస్తే తన చొక్కాతో తుడుచుకునే బదులు పక్కవాడి చొక్కాతో తుడుచుకునే వాడు. పొడవుగా ఉంటాడు కదా, కావాలని ముందు బెంచీలో కూర్చుని బ్లాక్ బోర్డు వెనక కూర్చునే వాళ్లకు కనిపించనిచ్చేవాడు కాదు క్లాసులో.

విడాకులు తీసుకున్న ఓ యువతి తనభర్త
అమెరికాలో ఉన్నాడని నలుగురితో చెబుతూ
జీవనం కొనసాగిస్తుంటుంది.
రక్షణకోసం ఆమె ఆడిన చిరుఅబద్ధం
తన జీవితాన్ని ఎంతగా కల్లోలం చేసిందో
తెలియచెప్పే హోతా పద్మినీదేవి నవల

# సరిత్ర

నవ్యనవలా వేదిక... **చతుర** నూతన సంవత్సర కానుక!!

వాళ్లావిడ తొలిరాత్రి పాలగ్లాసుతో వస్తే చుక్కకూడా మిగల్చకుండా పూర్తిగా తాగి, "గ్లాసుతో తెస్తే ఎలా, చెంబుతో తెస్తే కొంత నీకు మిగల్చటానికి వీలవును," అన్నాడట. వాడే చెప్పుకున్నాడు.

వాళ్లనాన్న ఉద్యోగంలో ఉన్నంత వరకూ కొడుకు ఉద్యోగంలో ఉన్నా వాడి జీతం అడుగకుండా ఉమ్మడి కుటుంబాన్ని ఒంటెద్దులా లాక్కొచ్చాడు. ఆయన పదవీ విరమణ చేసే రోజే, "నాన్నా, మనూళ్లో పెంకుటిల్లు బాగు చేయించుకుని అందులో మీరు, అమ్మా ఉండండి. పెంకుటిల్లూ పాడవకుండా ఉంటుంది. అక్కడి ప్రశాంత వాతావరణం మీ ఆరోగ్యానికి నచ్చుతుంది" అని వాళ్లిద్దర్నీ తోలేశాడు.

సుందరం భార్య రెండవ సంతానం కన్నతర్వాత, దున్నపోతులాంటి సుందరం కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స తను చేయించుకోకుండా, రివట లాంటి భార్యను ఆస్పత్రి బల్ల ఎక్కించి, క్షణం వృధా అవకుండా విధులకు హాజరయ్యాడు ఆదర్శ ఉద్యోగిలా.

భార్య చిక్కిపోయి, పాలిపోయి, గుండె ఆగిపోయే రక్తస్రావంతో బాధపడుతుంటే అయ్యగారి బంగ్లాకి స్కూటర్ మీద తీసుకెళ్లాడు. "ఆ ప్రమోషను రాకపోతే మా వారు పిచ్చివారు అయిపోతార్ సార్, కనికరించండి," ముకుళిత హస్తాలతో వేడుకుంది. ఆ రాత్రి అయ్యగారికి నిద్రపట్టలా. ఒక ప్రక్క తను ప్రమోషనిద్దామనుకున్న సొంతకులపోడు, మరో పక్క అంత దీనమైన మొహంకల స్త్రీ భర్త. ఆమె పాడెనించి నేరుగా తన బంగ్లా కొచ్చి ప్రార్థించిందే! ఆయన ఆరవ ప్రాణమైన కులాభిమానం ఆ ఒక్కసారికి పరాజయం పాలైంది.

## పాదుకాపట్టాభిషేకం

ఉషశ్రీ రామాయణ, భారత ఉపన్యాసా లకు జనం ఎగబడేవారు. ఉపన్యాస వేది కపైకి వెళుతూ చెప్పులు కింద విడిచి వెళ్లడం ఆయన ఆనవాయితీ. అలాగే ఒకరోజున ఆయన వేదిక దిగాక చూసుకుంటే క్రితంరోజే కొన్న కొత్తచెప్పులు కన్పించలేదు. నిర్వాహ కులు జరిగినదానికి బాధపడుతుంటే '.. రామాయణం విన్నాడుకదా ఎవడో పాదుకాప ట్టాభిషేకం చేద్దామనే పట్టుకెళ్లి ఉంటాడు మీరేం బాధపడకండి' అంటూ ఆయన చమ త్కరించారు. అంతా ఒకటే నవ్వులు..



ఇద్దరు కొడుకుల్లో ఒకడు ప్రమాదవ శాత్తు మరణించాడు. ఓదార్చటానికి గుళ్లో దేవుడులాంటి అయ్యగారే దిగి వచ్చాడు. అప్పుడు తనకు మరో పోస్టింగు(డబ్బులు 'దొరికేది') ఇవ్వమని దయనీయంగా ప్రార్థించాడు. నలుగురి మధ్య ఆయన అప్పటికప్పుడు ఆ వరం ఇచ్చాడు. దేవుడు మన దగ్గిర కొచ్చినప్పుడు వరం ఇస్తాడు. మనం ఆయన దగ్గరకెళితే ఉలకడు, పల కడు. అలా కాకుండా తను అప్పటికి ఉన్న పోస్టింగులోనయితే తత్సంబంధమైన బరువు బాధ్యతలను కొడుకు పోయిన విచారంలో మోయలేడట.

అభిమన్యు ముందుకు నడిచాడు, కీ వాల్ దక్షిణ దిశగా. నావలోని మ్యాంగ నీస్ ఖనిజం నింపుతున్నారు. ఆ ఖని జంతో నిండిన క్రిబ్స్(బక్కెట్ల లాంటివి) చక్రాలుగల ఇనుప చట్రాలలోకి దిగేసి వున్నాయి. ఆ చట్రాలను బుల్లి రైలింజను లాక్కొచ్చి బెర్త్ పక్కనున్న రైలుపట్టాల మీద వదిలి పోయింది. అవి తమవంతుకై ఎదురు చూస్తున్నాయి. ఒకటి నించి అయిదు వరకూ అంకెలు పెయింట్ చేసిన క్రేన్లు వాటి కొక్కేలకు వార్ఫ్(గట్టు) మీదున్న మనుషులు క్రిబ్బులు తగిలిస్తే, నడ్డితిప్పి వాటిని ఎత్తి ఓడవైపు తిరిగి అందులోకి దింపుతున్నాయి.

ఎంతసేపని ఈ నిరీక్షణ? 'ఉపయోగం' ఉందో లేదో. అర్థం లేని నిరీక్షణ. నారా యణరావ్ ఎక్కడున్నావ్? పిలిస్తే పలుకు తాడా? వినబడేంత దూరంలో వుంటే పలుకుతాడు. నాన్నా నీవు? నారాయణకే తెలుసు, బహుశ.

అవతల వద్దున ఫర్టిలైజర్ బెర్తుకు కట్టిన ఎరువుల ఓడ. బెర్తు పొడవున పసుపు పచ్చని గంధకపు కువ్వలు. దానికి సమీపాన పడమటి బెర్తుల దగ్గర బొగ్గు నావ. సైడింగు దగ్గర ఆగివున్న వేగన్లు, బొగ్గుతో నిండి వున్నవి. వాటన్నిటికి దూరంగా, పశ్చిమం వైపు ఆయిల్ స్టోరేజి టాంకులు. దూరంగా వంగిన పారిశ్రామిక ఆకాశం. ఆ దూర దృశ్యంలో వివిధ పరి శ్రమల క్రేన్లు దివినుండి ఈ భువికి సంప దను దింపటానికి.

ఇంత సంపద మధ్య, పారిశ్రామిక ప్రపంచం చేరువలో జేబులో రూపాయతో, ఇంకా ఇంటికి రాని తండ్రి గురించి వెతు కుతూ, నిరీక్షిస్తూ తను కీవాల్ అంచుకు వచ్చాడు. మడ్డినీరు. తళతళ లాడుతూ, వెండి పళ్లేలు దాచుకుని ఉన్నట్లు. అవి అందుకోవాలని దిగితే ముప్ఫైఅయిదు అడుగుల లోతు కెళ్లి బురదలో కూరుకు పోతాడు. ఎంత రహస్య స్వభావంతో వుంది నీరు? చావులా. చావుకు తనకు పదిహేనడుగుల దూరం కాలంతో కొలిస్తే

క్షణం విడదీస్తుంది చావునించి తనను.

నారాయణరావు భార్య సుందరమయిన, ఆప్యాయతతో కూడిన (రంకెలేసే నోరున్న) ముఖం గుర్తుకొస్తోంది. ఆమె హృదయం నవనీతం. చెయ్యెత్తు మనిషి. వెడల్పైన శరీరం. వెడల్పైన ఛాతీ. మొరటుగా కనిపిస్తుంది. భార్యంటే కాస్తంత భయం వుండేది అతనికి. అది తాగటం మానేసేటంత భయంకాదు. భర్తని ఏ విధంగా కష్టపెట్టేది కాదామె. అతన్ని కష్టపెట్టి తాగుడు మానిపించటం ఎందుకులే అంటుండేది. "మితంగా తాగవయ్యా!" అని శాసించి ఊరుకుంది. కొంతకాలం తప్పతాగి వచ్చేవాడు.

"ఇదిగో చూడు, ఆ బీరువాలో నీ మందు సీసా పెట్టుకో. తాళం నా దగ్గిర వుంటుంది. ఏరోజు కారోజు నేనే తీసి ఇస్తుంటా. మందులాగే పుచ్చుకో"

రోజూ సీసాతీసి టేబుల్‌మీద పెట్టి గుమ్మం దగ్గిర నిలబడి చూస్తుండేది. తాను చేసి పెట్టిన వంటకం తింటూ మందు చప్పరిస్తుంటే గోముగా చూస్తుండేది.

రాత్రిళ్లు నిద్రలో దుప్పటి తన్నేసుకునే వాడు పసిపిల్లాడిలా, చలి కాలమయితే నాలుగుసార్లు దుప్పటి సరిచేసేది "ఈ వెర్రిబాగులోడికి చలివేస్తుంది" అంటూ.

వారం వారం ఒళ్లంతా నలుగుబెట్టి "చాల్లేవే నీ దుంపతెగా" అని అతను అంటున్నా వినకుండా తలంటేది, "భలేవాడివయ్యా! ఊరుకోవయ్యా!" అంటూ.

కుంకుడు కాయరసం వేసేప్పుడు "తల పెకెత్తు" అని గసురుతుండేది. కన్న కొడుకుని కూడా అలా చూచుకుని వుండదు.

"ఏమయ్యోయ్! ఆ తలకు మఫ్లర్ కట్టుకు పోరాదూ? "

ఈ రోజన్నా రెండు జతల బట్టలు కొని తెచ్చుకుంటావా లేదా? "

"ఆ తలకి నూనె రాసి ఒక దశాబ్దం గడిచిందా? దానికి బదులు గుండు కొట్టించుకుంటుండు పదిరోజుల కొకసారి. అప్పుడు నూనెరాసుకునే బాధా, జుత్తు దువ్వుకునే బాధా వుండవు. ఆ చింపిరి జుత్తు నీవు ఉద్యోగస్తుడివని ఎవరన్నా అనుకుంటారా? "

"ఇదిగో షిఫ్ట్ అయిపోగానే నేరుగా ఇంటికొచ్చెయ్, వేడివేడిగా ఏమన్నా చేస్తే తిందూగాని. మందుంటే, పోచుకోలు కబుర్లుంటే చాలు. పెళ్లామక్కర్లా, ఇల్లక్కర్లా"

"అట్లాగే లేవే నీ-దుంపతెగ. చంపుకొని తినక. షిఫ్ట్ అవంగానే కాళ్లకు చక్రాలు కట్టుకుని ఇల్లు చేరతా. క్షణం వృథా అవకుండా నీ ఎరురుగా కూర్చుని నిన్ను చూస్తుంటా"

ఒకరోజు తండ్రి పంపితే అప్పు అడగటానికి వచ్చి నారాయణరావు ఇంట్లో ముందు గదిలో మాట్లాడుతున్నాడు అభిమన్యు. ఖాళీ దొరికినప్పుడు పుస్తకాలు చదివే అలవాటుంది నారాయణరావుకు; కష్టంలో ఉన్నవాడి వెన్నంటి వుండే గుణముంది. ఏదో పుస్తకంగురించి మాట్లాడుతున్నాడు. తను మాట్లాడుతున్నప్పుడు మరొకరిని మాట్లాడనీయని గుణం కూడా పుష్కలంగా ఉంది. ఒక ప్రాణం మందయితే నాలుగు ప్రాణాలూ భార్యా. " అది ఇంటి దగ్గిరగాని, ఊళ్లోగాని లేకపోతే నేను బెంబేలెత్తుతా. మందుకూడా ముట్టబుద్ధి అవదు," అంటుంటాడు.

ఆ రోజు ఏనాటికి తను మరిచిపోలేదు. ఎప్పుడు జరిగిందో ఆ సంఘటన. వాళ్ల తొమ్మిదేళ్ల ఒక్కగానొక్క కొడుకు తామున్న గదిలోకి ఊగిపోతూ వచ్చాడు. వాడి నోట మాట రావటం లేదు. కళ్లలో భయస్వరూపం విలయతాండవం చేస్తోంది. ముఖంలో రక్తం ఇంకిపోయింది. వాడి కళ్ల వెంబడి కన్నీటి ధార, విప్పిన కుళాయిలా. ముఖంలోని రక్తం నీరుగా మారి కళ్లవెంబడి వస్తోందా? కుర్చీలలోనించి

లేచిపోయారు స్ప్రింగు బొమ్మల్లా. కొడుకును వాటేసుకున్నాడు. "ఏమయింది నాన్నా నీకు, ఏమయిందిరా?" అంటూ వీపు చరచటం మొదలు పెట్టాడు. భార్య ఏమయింది? "ఏమే!" అని లోపలికి కేక పెట్టేడు, చావుకేక. సమాధానం లేదు. "ఎక్కడ చచ్చావ్?" మళ్లీ అరిచాడు.

"నాన్నా అమ్మ..." అన్న మాటలు వాడి



నోటి నుంచి వెలువడ్డాయి. వాణ్ని ఎత్తుకుని లోపలికి పరిగెత్తాడు. వాడు స్నానాల గదివైపు చూపించాడు. అక్కడికి నడిచారు.

స్నానాల గది తలుపు గడియ సరిగా, పడదేమో తలుపు తెరుచుకుని వుంది; గాలికో, మరో కారణం చేతో. చుట్ట చుట్టుకుని ఆమె క్రింద కూలిపోయివుంది. తల సిమెంటు తొట్టికి ఆనుకుని వుంది. జారి పడి పోయివుంటుంది. ఆమెను పేరుపెట్టి ఆప్యాయంగా, భయంగా పిలిచాడు. దండెం మీది చీర తీసి ఆమెకు చుట్టాడు. చుడుతున్నంత సేపు ఆమెను తట్టి పేరుతో పిలుస్తూనే ఉన్నాడు. ఏడవటం మొదలు పెట్టాడు. కొడుకు గొంతుకలిపాడు. ఆమె నుంచి ఎలాంటి సమాధానం రాలేదు. ముగ్గురూ కలిసి మోసి తెచ్చి మంచం మీద పడుకోపెట్టారు.

గుండెమీద చేయివేసి చూశాడు. తన వైపు వెర్రిచూపు చూశాడు. అప్పుడే బరువు



మోసివుండటం చేత గసపెడుతున్నాడు. తనూ అతన్ని అయోమయంగా చూశాడు చేష్టలుడిగి.

చనిపోయింది.

ఎంత భారీ మనిషి? అయితేనేం? కేవలం స్నానాల గదిలో జారిపడి, తలకు సిమెంటు తొట్టి తగలటం వలన ప్రాణం వదిలేసింది. తోలుతిత్తికి మానవ శరీరానికి తేడా లేదని తెలుసుకోటానికి ఇంత కన్నా సాక్ష్యం అక్కరలేదు. ఎంత నమ్మలేని నిజం. ఎంత మార్పు క్షణకాలంలో జరగటానికి వీలుందీ! ప్రాణం అని పిలుచుకునేది కనురెప్ప కాలంలో మాయమయిపోయింది శరీరం నుంచి. నగ్నంగా ఆమె ఎలా పుట్టిందో అలాగే పోయింది. ఎలా వెళ్లిందో, ఎక్కడికెళ్లిందో, దేనికెళ్లిందో తెలీదు. పోయేటప్పుడు ఆమె మనసులో "ఈ అస్తవ్యస్తపు మనిషిని వీడి పోతున్నానే" అన్న భావన, బాధ వుంటాయేమో. వీలు దొరికి ఉంటే "జాగ్రత్తగా ఉండయ్యో", "తాగుడు మానయ్యా", "ఆరోగ్యం జాగ్రత్తయ్యో" అని చెప్పివుండేది. అన్ని పనులూ చేస్తూ, మనుషులను శాసిస్తూ, ప్రేమిస్తూ వచ్చిన మనిషి మూగపోయి, అచేతనంగా పడివుంది. నారాయణరావు, కొడుకు గుండెలు బాదుకుని ఏడుస్తున్నారు. వాళ్ల పెంపుడు పిల్లి అరుస్తోంది. గాలికి గోడకున్న కేలండరు లబలబ మంటోంది.

ఇప్పుడు మరోసారి చావును అతిసమీపాన చూస్తాడు. సొంత మనిషిది. భయంతో శరీరం చల్లబడింది. భయం కూడా మనిషిని హింసించటానికి సృష్టించబడిన వాటిలో ఒకటేమో.

కీవాల్ దక్షిణ చివరకు వచ్చాడు. ఇటు పక్క వడ్డునే కాస్త దూరంలో జెట్టీకి లాంచీలు కట్టేశారు. నీటి కదలికలకు అవి కులాసాగా కదులుతున్నాయి. దూరంగా రాస్‌హిల్, దానికవతల విశ్రమిస్తున్న యారాడ కొండ. దక్షిణ దిక్కును గుత్తకు తీసుకున్నట్లు రాస్‌హిల్ మీద కట్టిన ఎత్తు కట్టడంలో ఒంటి స్తంభం మేడలా ఒక అంతస్తులో అతిథి గృహం. పైఅంతస్తులో సిగ్నల్ స్టేషన్, ఆకాశాన్ని దూరపు సముద్రాన్ని పర్యవేక్షిస్తూ.

ఇందాకటి. వాళ్లు వాళ్లకు కుతూహలం

కలిగించే అంశంలో తలమునకలవ్వ కుండా వుంటే నారాయణ గురించి అడిగి ఇంటికి పోదామనిపిస్తోంది. అసలు విషయం తేలకుండా ఇంటికి వెళ్లే నిర్ణయం తీసుకోలేడు.

వాళ్లవైపు నడిచాడు.

కుతూహలంతో వాళ్లను కట్టిపడేసే విషయాలు, ఒకరి మీద ఒకరి ఏడుపులు ద్వేషాలు, అసూయలు, పనికి రాని మాటలు అన్నీ ప్రస్తుతానికి పరిసమాప్తి అయినట్లున్నాయి తలా ఒకదారి చూసుకో బోతుండగా వాళ్లను చేరాడు. అభిమన్యును వాళ్లు గుర్తు పట్టారు.

"లేడు" అన్నాడు ఒకాయన, ముక్తసరిగా.

"ఇక రాడు" అన్నాడు ఒకాయన, కాస్తవిసుగా. నీ నిరీక్షణ వృథా అని తేల్చి చెపుతున్నట్లు.

నారాయణరావు రాకపోవటమే ఒకవిధంగా కావల్సింది. అతనితో తండ్రి వుండొచ్చు అన్న ఆశ ఏమూలో మిణుకు మిణుకు మంటుంటుంది మరి కొంత సేపు.




ఇంటిదగ్గిర బయలుదేరిన లగాయతు ఒక జీవితకాలం గడిచిపోయినట్లుంది. ఆ జీవితకాలంలో పరిష్కరించబడని సమస్య, వెక్కిరించే అసమర్థత, అన్వేషణా, అర్థరాహిత్యం. తన ప్రమేయం లేని ఆలోచనలు- నిరర్థకమైనవి. తనదైన వేదన, ఆవేదన.

ఫుట్‌పాత్‌మీద రావి చెట్టుంది.

దాని దగ్గరగా నడిచాడు.

కాళ్లు పీకుతున్నాయి. చెట్టును చూడగానే బడలిక గమనికలోనికి వచ్చింది. దాని క్రింద కూర్చున్నాడు. ఇది రాత్రి, చల్లని వేళ చెట్టుక్రిందికి చేరక్కరలా. కానీ కూర్చోడానికి వీలుగా దాని క్రింద గట్టుంది. అక్కడ కూర్చుని సేదతీరచ్చు, ఆలోచనలు కొనసాగించవచ్చు.

దానివలన అవి ఒక గమ్యం చేరకపోవచ్చు, జ్ఞానోదయం కాకపోవచ్చు. చెట్టు క్రింద కూర్చున్నవాడల్లా బుద్ధుడు కాకపోవచ్చు. మానవ జీవితాన్ని తరచి చూడటానికి ప్రయత్నించినవాడల్లా గౌతముడు అవాలని లేదు. కొద్దిక్షణాల సేదతీరిన తర్వాత ఈ అన్వేషణాపర్వాన్ని ఒక కొలిక్కి తేవచ్చు.

తండ్రిది ఎంత జాలిగుండె? అలాంటి గుణమే మనిషికి ఒక శాపమేమో!

ఒకరోజు ప్రొద్దునే రెండు పిల్లిపిల్లలు దర్శనమిచ్చాయి. ఇంట్లో ఎవరో మంత్రించి గాలిలో పుట్టించి ఏ ఇల్లు దొరకనట్లు, తమ ఇంట్లో వదిలినట్లు. పెన్సిలు గీతల రంగు. అందం లేదు. వాటి చిన్ని ఆకారాలు, సంగీతపు అరుపులు, నిస్సహాయత ముద్దు కలిగించాయి. బయటకి తరిమితే అప్పటికి వెళ్లిపోయి తిరిగివచ్చేశాయి.

" పిల్లులు ఇంట్లో ఉండకూడదు, దరిద్రం" అంది అమ్మ.

"ఇపుడు సిరులు చిందులేస్తున్నట్లు" అన్నాడు నాన్న.

వాటిని తనూ, అక్కా తోలేసినపుడల్లా- "ఒరే నోర్లేనివిరా, పోనీ ఉండనీయండిరా" అంటుండేవాడాయన.

చిరంజీవి పిల్లులను చూచి ముచ్చటపడ్డాడు. ఇద్దరు ఒకపక్కా, ముగ్గురు ఒక పక్కా చీలిపోయారు. మైనారిటీ అభిప్రాయమే గెలిచింది. నెల రోజులలో ఎదుగు

దల కనిపిస్తోంది వాటి ఆకారాల్లో.

ఒక పిల్లి ఇల్లు వదిలింది. భోజనాల వేళల్లో గంటకొట్టి పిలిచినట్లు తయారవుతుంది, ఇల్లు ఒక సత్రంలా, హోటల్లా. కొన్నాళ్లకు అది రావటం పూర్తిగా మానేసింది. మరోచోట ఆదరువు దొరికిందేమో. రెండోదాన్ని ఒక తెల్లగండుపిల్లి మరిగింది. ఎప్పుడు కడుపయిందో ఏమో. దాని నెలలు నిండినపుడు ఈయన తెగ బాధపడిపోయేవాడు దాని లోపలి పిండాన్ని ఈయన మోస్తున్నట్లు.

రెండ్రోజులు అది రావటం మానేసింది.

"దానికేమయిందోరా పాపం, వెతికి రండిరా. కనలేక చచ్చిందో ఏంటో!"

అక్క వెతికివచ్చింది. కనబడలేదంది.

"నాన్నా, మా బాధలు పట్టించుకోవుగాని ఆ పిల్లుల గురించి ఎందుకు ఇంత ఇదవుతావు", అడిగింది.

"మీకు కనీసం ఇదీ బాధ అని చెప్పుకోవటానికి నోరుంది. వాటికి అది లేదు కదా. మీ బాధలు తీర్చటానికి డబ్బు కావాలి. అది నా దగ్గిర లేదు. వాటిపట్ల జాలి - కాణీ ఖర్చులేని-జాలి చాలు".

మూడోరోజు రెండు పిల్లల్ని నోటితో పట్టుకుని ఇంటికి తెచ్చింది. అది చిరంజీవికన్నా ఆయనకు ఎక్కువ ఆనందం కలిగించింది. రెండూ తెల్లవే. ఒకదానికి మాత్రం గోధుమరంగు చారవుంది మొఖం మీద నామం పెట్టినట్లు. దానికి ఆచారి అని పేరు పెట్టాడాయన.

మగపిల్లి దాని సుఖం అయిపోగానే కాలు దులుపేసుకుంది. మగపిల్లి పాపానికీ, తన పాపానికి ఆడపిల్లి పరిహారం చెల్లిస్తోంది. మొయ్యటం, కనటం, సాకటం, కాపాడటం ఒకటేమిటి? మాతృత్వంలో మనిషీ, పశువూ ఒకటే.

కుక్కల గుంపులు వీధినిండా దాని సొంతదారులయినట్లు. నలుగురు మనుషులు కూడితే చట్టాన్ని వాళ్ల చేతుల్లోకి

ఎలా తీసుకుంటారో అలాగే నాలుగు కుక్కలు చేరినా. ""మందలు బలాలు తేల్చుకోవటమే ప్రజాస్వామ్యమంటే" అన్నాడు శేషాచలం మాస్టారు ఒకసారి. కుక్కల నించి పిల్లలను కాపాడుకోవటం చచ్చేచావయింది ఆడ పిల్లికి. తనను తను రక్షించుకోవాలి, పిల్లలకేం జరగకుండా చూసుకోవాలి. జాతిద్వేషం, ఒకేజాతిలో ఒక జీవంటే మరో జీవికి ద్వేషం. పిల్లులు, కుక్కలకు ఏవిధంగా పోటీ? కుక్కలు తిన టానికి కూడా పిల్లులు పనికిరావు. ఇంట్లో పెట్టిన నాలుగు మెతుకులు తల్లి పిల్లినించి దాని పిల్లలు లాక్కుని తింటుండేవి. ఆ తల్లి మొహానికి త్యాగమొకటి. ఎవరు నేర్పారు, ఎక్కడ చూచి నేర్చుకుంది? దాన్ని కుమ్మి కుమ్మి పాలు తాగేవి పిల్లలు. వాటిని అది నాకేది. అవి వది లిన మెతుకులే తినేది. వేటాడటం రాని అసమర్థపు పిల్లి. దానిముందే ఎలుకలు తిరిగేవి. "ఈ పిల్లికి తిండి దండగ" అనేది తల్లి. "పిల్లి వద్ద నుంచీ పెట్టే ముద్దకు ప్రతిఫలన్నాశించాలా? " ప్రశ్నించేవాడు తండ్రి.

ఒకరోజు పొద్దునంతా అరుస్తూ, కాలు కాలినట్లు తిరుగుతోంది తల్లిపిల్లి. ఎందుకో తెలీలా. "దానికేదో కష్టమొచ్చిందిరా పాపం" అన్నాడాయన. మార్జాల భాషలో అక్షరాల వరకూ నేర్చినట్లు. "మన కష్టాల సంగతే పట్టించుకుని బాధపడటం మానే స్తున్నాం. పిల్లుల కష్టాలు పట్టించుకుని ఏడవాలంటే మరో నోరు, మరో జత కళ్లూ కావాలి" తల్లి అంది.

"మీ పిల్లిపిల్ల చచ్చిపోయింది. మా ఇంటి వెనుక కిటికీ సన్ షేడ్ మీదుంది", అన్నారు ఆరోజు చీకటి పడుతున్నవేళ ఎదురింటివాళ్లు. వెళ్లి చూశారు. కంపు కొట్టడం ఆరంభమయింది. పొట్ట చీలిపో యింది ఆచారికి. కుక్కలు పీకేశాయి నిర్ద యగా. అవి కుక్కజన్మ ఎత్తటానికి ఆచారి కారణమన్నట్లు. క్రూరత్వం, హింసా అధిక మవుతున్న మానవ సమాజంలో బతుకు తున్న అవీ వాళ్లనుంచి పాఠం నేర్చుకు న్నట్లు. తప్పించుకోటానికి సన్ షేడ్ ఎక్కి వుంటుంది. అలా ఎక్కకముందే చావుకు దారితీసే హింస జరిగిపోయింది. నేల మీద రక్తం మరకలున్నాయి. అవి చీమ లకు విందుచేస్తున్నాయి. ఆచారిని నేల్లో గొయ్యితీసి పూడ్చిపెట్టారు. గౌరవసూ చకంగా కాదు. కంపు కొట్టకుండా. వంట గదిలోకి దూరి తల్లిపిల్లి వెదుకుతోంది. "దీనికి ఆ పిల్లిపిల్లను చూపించి వుండవల సింది" అన్నది తల్లి. "దాని బాధ మరీ ఎక్కువవుతుంది" అన్నాడు తండ్రి. ఆయన ఆ పూట సరిగా భోంచెయ్యలేదు. ముఖంలో విచారం గూడుకట్టుకుంది. ఆ రాత్రి చుట్ట తాగలేదు. నెత్తి బాదుకుంది తల్లి ఆయనను చూసి. జాగ్రీ ఎక్కిపడు కుంది తల్లిపిల్లి. వరండాలోని మంచంమీదే ఆయన ఆ రాత్రి పడుకున్నాడు. బాధను పంచుకోటానికి వీలయితే దానిబాధనంతా ఆయనే తీసుకుని భరించేవాడు. "మనం వాటికన్నా అదృష్టవంతులం. ఏడ్చి, మరొ కరికి చెప్పుకుని, ఓదార్పు పొంది బాధను తీర్చుకునే ప్రయత్నం మనం చేసుకోగలం. వాటికది వీల్లేదు" అన్నాడాయన. ఎల్లలెరు గని అనుకంపం.

అలాంటి నవనీత హృదయుడికి ఇలాంటి జీవితం ఎందుకు దొరికిందో. "కర్మ, పాపపుణ్యాల అనుగుణంగా." ఏ జీవికైనా మొదటి తప్పు ఉండి వుండాలి, అది ఒక ప్రేరణ వల్ల చేసి వుండాలి. తప్పు ముందుంది ప్రేరణ. అది లేకుండా వుండి వుంటే తప్పు జరిగేది కాదేమో. ప్రేరణది తప్పు. కార్యాకారణ సంబంధం. కర్మసిద్ధాంతం లోతుకెళ్లేకొలది ఆలోచనలు గందరగోళానికి దారితీస్తాయి. అసలు జీవి ఎందుకు సృషించబడాలి, పాపాలెందుకు చెయ్యాలి, ఫలితాలెందుకు అనుభవించాలి,

ఈ పిచ్చి ఆలోచనలు భరించలేక చెట్టు మొదట్లోలేచి నిలబడ్డాడు. బయలు దేరాడు.

ఇంటిముందు నిలబడ్డాడు. మరోక్ష ణంలో తలుపుకొట్టి అది తీసిన తల్లిని ప్రశ్నిస్తే ఏం సమాధానం వస్తుందో. ఆయన ఇంకా ఇల్లు చేరలేదంటే ఏం చేయాలి? ఆయనకేం జరిగిందో! తలుపు తట్టాడు. తల్లి వెంటనే తీసింది. తను తల్లిని ప్రశ్నించలేదు. ఆమె తనను ప్రశ్నించింది. ఆమెకు అర్థమయింది భర్త 'దొరక కలేదని. అయినా ప్రశ్నించింది: "దొరక లేదా? " "లేదు" అనిపించింది కొడుకు చేత.

లోపలికెళ్లాలా. బయటికి నడవాలా?

"ఏం చేద్దాం? "

"నాకూ ఏం తోచటం లేదురా!"

"నారాయణరావుగారు ఇంట్లో లేరు. డ్యూటీకి వెళ్లలేదు. ఉంటే ఆయనతోనే వుండాలి. వైకుంఠంగారి ఇంటికి కూడా నాన్న వెళ్లలేదు. ఆయన ఆఫీసు తలుపులు మూసివున్నాయి"

సందులో అలికిడయింది. ఏమిటది? ఎవరన్నా వొస్తున్నారా? తమ ఇంటి కేనా? ఈ సందులో మరో ఇంటికి కాక పోతే ఎంత బాగుండు! గుమ్మం వెలుపలికి దూకుడుగా వచ్చాడు అభిమన్యు. చీకటి. అయినా ఆ రెండు ఆకారాలు ఎవరివో తెలిసిపోతోంది.

"వస్తా సార్, జాగర్త. మీ వాళ్లు నన్ను క్షమించరు"

"పర్లేదండి, పర్లేదు... మీరేం తప్పు చేశారు. తప్పు నాది. నేనేం కుర్రాడ్నా? ఏ దండనయినా నాకే వేయమంటా"

అటు తిరిగి మాట్లాడుతున్న తండ్రి ఇటు తిరిగి నాలుగడుగులు నడిచి మెట్లు క్కుతున్నాడు. "ఏం నాన్నా, ఇంకా నిద్రపో లేదా? " అడిగాడు కొడుకును.

నారాయణరావు మీద కోపానికి బదులు కృతజ్ఞతాభావం కలుగుతోంది అభిమన్యులో ఎందుకో.




దూరం నుంచి, కానీ స్పష్టంగా ఇక్కడికి వినిపిస్తోంది. పక్క సందులో ఏ ఇంట్లోనో గుండె పగిలి ఏడుస్తోంది వాయులీనం. తల్లి ఏడుస్తోంది పెద్ద గొంతుకతో గుండె బద్దలయి. శ్రుతి కలిపింది అక్క.

ఒకవైపు తనూ రోదిస్తున్నాడు వేరేవిధంగా, తనకు చేతనైనట్లు. వారిద్దరిలా ఏడవాలని ఉంది. ఎందుకంటే అది ఒక ఘాతుకాన్ని అభిశంసిస్తున్నట్లుగా కూడా వుంది కాబట్టి. గుండె పగిలి ప్రవహిస్తున్న వేదనను వ్యక్తం చేయటమే కాక, ఏడుపు కూడా ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్లు ఏడ్చే వీలు లేనట్లుంది.

చిరంజీవి రాత్రి రక్తం కక్కేడు. పరీక్షలు చేసి మందులిచ్చారు. పొద్దునకల్లా జ్వరం తీవ్రరూపం దాల్చింది. రెండు గంటలపుడు ఆస్పత్రిలో చనిపోయాడు. ఇంటికి తెచ్చారు.

అభిమన్యుకి ఏం చెయ్యాలో తెలీక ఇంటిముందు జనానికి కాస్త దూరంగా, జరుగుతున్నది కనిపించే విధంగా నిలబడ్డాడు. గడ్డివామిలో నిప్పులా బాధ దహిస్తోంది. తండ్రి ఇంట్లో ఉన్నాడు, ఏదో పని మీద కాదు. మరి ఏం చేస్తున్నట్లు? ఈ దృశ్యం చూడలేక దాక్కున్నట్లున్నాడు. కంటితో చూడనంత మాత్రాన అది వదులుతుందా? వాడు అర్ధనిమీలిత నేత్రాలతో

## రంగులో ఏముంది?

ఉషశ్రీగారమ్మాయి పెళ్లి జరుగుతోంది. కాబోయే అల్లుడు కొద్దిగా రంగు తక్కువ. ఆ విషయాన్నే ఎవరో ఉషశ్రీతో ప్రస్తావించారు. దానికి ఆయన ప్రతిస్పందన 'ఆ శ్రీరామచంద్రుడు సింగరేణి బొగ్గు రంగు. సీతమ్మ వారు 24 క్యారెట్ల బంగారు వన్నె. పైపై రంగులు వారి దాంపత్యా నికి అడ్డువచ్చా యా? ఇదీ అంతే !'



రంగు గురించి ప్రస్తావించిన ఆయన నోటికి తాళంపడింది.

వాయులీనం వింటూ దివ్యలోకాలకి ప్రయాణం చేస్తున్నట్లున్నాడు. ఎవరిబాధ, ఏ బాధపట్టనట్లు. గాలికి వాడి జుత్తు చెదురుతోంది. అది తప్ప వాడి శరీరంలో దేనికీ కదలిక లేదు. ఏడ్చేవాళ్లని ఊరుకో మని చెప్పటానికన్నట్లు వీస్తోంది. చావును ఆపలేకపోయినా, వాడి పెదవులు స్వల్పంగా విడివడి వున్నాయి. ఎలుక పళ్లు కనబడుతూ కథ చెప్పమని అడగబోతున్న ట్లున్నాయి పెదవులు. అలా అడగబోతు న్నప్పుడే నిర్జీవుడయ్యుంటాడు; నిర్జీవుడవు తున్నప్పుడు ఆ కథ ఆఖరిసారి విందామని అడగబోయి వుంటాడు.

ఇంట్లోకి నడిచాడు. తండ్రి మంచం మీద పడుకుని ఉన్నాడు. ఎదురుగా గోడ మీద పెన్సిలుతో, రంగులతో గీసిన పిచ్చి బొమ్మలు, గీతలు; అవి రాసిన వాడి భవి ష్యత్తును తెలియజేస్తున్న భాషలా. నీరు కారే, సున్నం ఊడిన గోడలకు మరణిం చిన కుడ్య చిత్రకారుడి పనితనమే ఏకైక ఆభరణంలా వుంది. వాడి జీవితంకన్నా వాడి గీతల జీవితం దీర్ఘమయినది. చెరి పెయ్యకుండా ఉంటే. గీతల మీద నుంచి దృష్టి మళ్లించి గదంతా కలియజూశాడు. వాడిని జ్ఞప్తికి తెచ్చే వాడివైన వస్తువుల గురించి. అవి చూసి గుండెలు పగిలేలా ఏడ్చివాడు లేనిలోటు ఎంతటిదో ప్రకటించ టానికి.

దండెం మీద కాడల లాగు, భుజానికి తగిలించే ఒక కాడ తెగిపోయింది. లాగి లాగి వాడే తెంపేసుకున్నాడు. వేసినప్పుడు తల్లి పిన్నీసు పెట్టేది. ఇప్పుడు నిర్జీవ హస్తంలా వేలాడుతోంది. ఇదే లాగుకి వెనుక కన్నం వుంది. మూడురోజుల క్రితం వాడు వేసుకుని ఆడుతున్నపుడు చిరిగితే పోస్టాఫీసు ఆట ఆడాడు తమ్ము డితో. మళ్లీ చేయనా అంటూ ప్రతిసారీ ఇల్లు ప్రతిధ్వనించేలా నవ్వి, కేకలేశాడు. ఇపుడు ఇంట్లో నిశ్శబ్దం, వెలుపల దుఃఖం ప్రతిధ్వనిస్తున్నాయి. దగ్గిరకెళ్లి లాగూను తాకాడు ఆత్మీయంగా.

రెక్క విరిగిన చెక్క బీరువా మీద నుంచి బొమ్మ దొంగ చూపులు చూస్తూ దాక్కుంటోంది. అది పేద ప్లాస్టిక్‌తో చేసింది. రెండు మోకాళ్ల మీద రెండు చేతులు వుంచి కూర్చున్న బొమ్మ. రెండు అరచేతులలో గడ్డం ఆనించి దీర్ఘాలోచ నలో ఉంటుంది. దాని ముక్కుకు కన్నంప డిపోయింది. నాలుగయిదు నెలల క్రితం కొన్నది. దాన్ని ముందుంచుకుని దానిలాగే మోచేతులు మోకాళ్లమీద, గడ్డం చేతిలోను ఉంచుకుని ఆలోచిస్తూ దానితో ఏవో కబుర్లు చెబుతుండేవాడు. దాన్నందుకు న్నాడు అభిమన్యు. దుమ్మును చేత్తో తుడిచి; ప్రాణాలు లేనిదానికీ, ఒకప్పుడు ప్రాణాలున్న తమ్ముడికీ గల పోలికలు వెదికాడు.

తండ్రి గోడకు తిరిగి పడుకునే ఉన్నాడు. ఎంతసేపలా పడుకుని ఉండిపో తాడో. శరీరంలో కదలిక లేదు. ఉచ్ఛ్వాస

నిశ్వాసల కదలిక కూడా కానరావటంలేదు. ఇరుకుగదంతా ఎంతో ఖాళీ అయిపోయిన ట్లనిపిస్తోంది. నిజానికి గదిలోని ఖాళీ యేనా? ఏడుపు, కన్నీరు బాధకు కవాటా ల్లాంటివి. అవి లేకుండా బాధను భరిం చాలి. కొండల్లో, కోనల్లో కురిసేవర్షం ఏరుల్లా నదిలో చేరుతూ దాన్ని వరదకు ఆయత్తం చేస్తున్నట్లు క్షణక్షణం బాధ, వెలితి, అసహాయత, జ్ఞాపకాల మట్టం పెరుగుతోంది. బయట అక్క కంఠస్థాయి, తల్లి కంఠస్థాయికి చేరింది. జంటస్వరాల ఆరున్నొక్కరాగం, మందలింపుగా ఓదార్చు తున్న గొంతుకలు వినపడుతున్నాయి. దిబ్బడు కూడా ఓదార్చుతున్నాడు. వాడు పరమ కఠినుడిగా ఈ ఇళ్లలో ప్రసిద్ధుడు. రాతిలోనూ నీరుంది మరి. తల్లి గొంతు నీరసించి బొంగురుగా ధ్వనిస్తోంది. ఎంత సేపు ఏడిస్తే బాధ తీరుతుంది. ఇది తీరే బాధా. బాధ తీర్చుకోవటానికి ఏడుస్తారు. బాధవల్ల ఏడుస్తారు. గదిలో సాలెగూ డులా చీకటి అల్లుకుంటోంది. ఏవేళో ఇది. ఏవేళనైనా కాలగమనంతో పని ఉంటుంది. పని ఉంటుంది కాబట్టి కాలగ మనం కావాలి. డబ్బుమాట? ఇటు తిర గని తండ్రివైపు చూచి బయటికొచ్చాడు. లోపలున్నా బయటున్నా ఒకటే- రెండు కాదు. కింకర్తవ్యం?

నారాయణరావు ఎప్పుడొచ్చాడో; ఉన్నాడు ఆఫీసు తెల్లబట్టల్లో. అక్కను మందలిస్తున్నాడు. "సుమిత్రా! ఒకరినొ కరు ఓదార్చుకుంటూ, ఊరట చెందేబ దులు పోటీపడి ఎంతసేపు దుఃఖపడ తారు. ఊరుకో, ఊరుకో" అక్క పక్కనే గొంతు కూర్చున్నాడు.

అభిమన్యుని చూచి లేచివచ్చి భుజం మీద చేయివేసి నొక్కాడు; వేళ్లతో తట్టాడు.

"ధైర్యంగా ఉండాలయ్యా... ధైర్యం కావాలి, ధైర్యం!"

అతని జుత్తు రేగివుంది. నల్లటి, రంగు వేసిన జుత్తు. చొక్కాపై గుండీ విడిపో యింది. ఎండిన గుండెలు కనిపిస్తు న్నాయి. ధైర్యం చెబుతున్న నారాయణ రావు భార్య పోయిన తదుపరి విలపించిన వైనం గుర్తుకొచ్చింది అభిమన్యుకు.

తమ్ముడి మీద కళ్లు వాలాయి. చావుకూ, నిద్రకూ ఎన్నో పోలికలు దాయా దులలా. వాడు నిద్రపోతున్నట్లుగా ఉన్నాడు. తేడా అల్లా- తన పక్కన పడు కునివుండే బదులు, ఒక్కడే పడుకుని వున్నాడు. పక్క తడిపే బదులు, తడపటం లేదు. దిండు మీద వుండే బదులు చాప మీద అది లేకుండా తల ఆన్చి ఉన్నాడు. తన మెడ చుట్టూ నడుం చుట్టూ చేతులూ కాళ్లు చుట్టి వుండే బదులు సమంగా అమర్చి వున్నాయి. ఈ ముద్దులొలికే శరీరం ఎంతసేపు చెక్కుచెదరకుండా వుంటుంది. రాత్రి నించి శిథిలమవటం ఆరంభమవుతుంది. కుళ్లు కంపు ఆరంభ మవుతుంది. ఇన్నాళ్లు తమ్ముడిగా భావిం చింది ఈ భౌతిక శరీరాన్నా, చైతన్యవంత మైన పదార్థరూప రహితమైన మరో దాన్నా. హృదయానికి హత్తుకున్నది, ముద్దుగా కొరికింది, గిల్లింది, ఆడించింది, ఏడిపించింది ఈ శరీరాన్నే. వాడు చచ్చిపో య్యాడంటే వింతగా, నమ్మలేనిదిగా వుంది- వీడేదో మృత్యుంజయుడన్నట్లు. వాడి మీదినించి కళ్లు తిప్పాడు. కొంచెం దూరంగా గోడనానుకుని పిచ్చాయన భార్య నిలబడి వుంది మడ్డి మొహంతో. భర్తను గదిలో పెట్టి గడియవేసి వచ్చుంటుంది. వెళ్లిపోయేవాళ్లు వెళ్లిపోతుంటే కొత్తవాళ్లు వస్తున్నారు.

అక్క వెర్రిగా ఏడుస్తోంది. ఆమె దగ్గర కెళ్లి "ఊరుకో, అక్కా" అన్నాడు. తమ్ముడ్ని మరీ దగ్గరగా చూశాడు. నిద్రపోతున్నట్లే ఉన్నాడు. కాకపోతే ఇక మెలకువవుండని నిద్ర.

గంటలు గడిచాయి.

నారాయణరావు ఇంటికెళ్లివచ్చాడు. రాంగానే అభిమన్యుని పిలిచాడు పక్కకి.

"బాధపడుతూ ఉండిపోతే అవదయ్యా. జరగాల్సిన పనిచేయాలి-"

మౌనంగా నారాయణరావు ముఖంలోకి చూశాడు.

"టయిం ఎంతయిందో తెలుసా, ఏడు. మళ్లీ వాళ్లెళ్లిపోతారు. రేపటిదాకా ఉంచుకోవటం ఎందుకు? బాధపడటానికి తప్ప. కంటిముందు శవం కనిపిస్తుంటే దానికి అంతువుండదు. రేప్పొద్దునైనా చేయక తప్పని పని. ఇప్పుడే చేస్తే సరిపోతుంది అన్నివిధాల".

"మా నాన్నగారితో చెబుతా"

"ప్చ్", తల అడ్డంగా తిప్పాడు. దానర్థం అతనే చెప్తాడని అడగకుండా ఊరుకున్నాడు.

"అతనికి ఈ బాధకూడా ఎందుకు, అభిమన్యు? ఆ మనిషి దేనికీ తట్టుకోలేడు"

"సరే, లోపలికెళ్లి ఆయన్ను పలుకరించి వస్తా".

ఆయన ఇంకా పడుకొనే ఉన్నాడు. అయితే గోడవైపు నించి ఇటు తిరిగాడు. చీకటిగా ఉందని లైటు వేశాడు, మంచానికి అటువైపుగా గోడకున్న స్విచ్ నొక్కి.

"ఇపుడు లైటెందుకురా? " అన్నాడు. చీకట్లో గమనించలేదు. ఆయన తన కదలికలు చీకట్లో గమనిస్తున్నాడేమో.

"రాత్రి ఏడు గంటలవుతోంది, నాన్నా"

"నారాయణరావుగారున్నారా? "

"ఉన్నారు నాన్నా. జరిపించాల్సింది జరిపిస్తే పోతుందంటున్నారు"

"నేను ఏమీ చేయలేని స్థితిలో ఉన్నా, నాన్నా. ఇద్దరూ కలిసి జరిపించండిరా..."

ప్రపంచంలోని బేలతనమంతా ఆ మాటల్లో ధ్వనించింది. అభిమన్యుకు తండ్రిలా కాక, అభిమన్యుకి కొడుకులా ఉన్నది ఆ మాటల ధోరణి. ఆయన లేచి తన కాళ్లమీద తను అసలు నిలబడగలడా అన్నా అనుమానం కలిగింది అభిమన్యుకి. గొంతుకు ఏదో అడ్డుపడకుండా ఉండి వుంటే ఆయన ఇంకా ఏదో మాట్లాడి ఉండేవాడు. ఏమిటది?

"మరి..."

"డబ్బాలో చూడు..."

అదేదో అక్షయపాత్రలా, తల్లి ఎప్పుడన్నా డబ్బులడిగితే "డబ్బాలో చూడు" ఆయన అంటుంటాడు. ఇప్పుడూ అవే మాటలు. ఆయనకూ తెలీదు అది ఖాళీగా ఉందో ఏదన్నా డబ్బు మిగిలి వుందో అన్న విషయం. అదృష్టాన్ని పరీక్షించుకోవటమే.

రెక్క ఊడిన బీరువాలో మూడో అర నించి పాత బిస్కట్ల డబ్బా తీశాడు. మూత తీయబోతూ, "ఇందులో లేకపోతే ఏం చెయ్యాలి? " ఇంట్లో తీవ్రమైన డబ్బు అవసరం ఎప్పుడొచ్చినా అక్క అంటుండేది, "డబ్బు గురించేనా మీ చింత, నారాయణ ఉన్నాడు మీ చెంత" అని. మూత తీశాడు. చిందర వందరగా నోట్లున్నాయి. అన్నీ పేర్చటం మొదలుపెట్టాడు. పదులు లేవు. అయిదు అయిదులున్నాయి. మిగతావి ఒకటి, రెండు రూపాయల నోట్లు. ఒకటి రెండు నోట్లు శిథిలావస్థలో ఉన్నాయి. చెల్లుబడి అవ్వచ్చు, అవకపోవచ్చు. పనులు చేయించగల శక్తి తన గుప్పిట్లో ఉన్నట్లుంది, వాటిని దొంతరగా పిడికిలి బిగించి పట్టుకుంటే. కానీ అవవలసిన పనికి ఈ శక్తి సరిపోతుందా అన్నదే సమస్య. దాన్ని పట్టుకుని మంచం దగ్గిరగా వెళ్లాడు. ఈ సమయంలో మనసులో వెంట్రుకవాసి స్థలం కూడా తమ్ముడి ఆలోచన ఆక్రమించి ఉండవలసి ఉండగా ఆ చోటులో కొంత మేర డబ్బు గురించిన ఆలోచన చోటుచేసుకుంది. కానీ చేయగలిగిందేముంది? డబ్బు గురించి వేధించకుండా తండ్రిని ఆయన విచారంలో


పిట్ట కొంచెం... తోక ఘనం
సరిలేరు నాకెవ్వరూ అంటూ నీలాల నింగిలో విహరిస్తున్న ఈ ఎర్రముక్కు పక్షి చూడముచ్చటగా ఉంది కదూ? దీని శరీరం 19 అంగుళాల పొడవైతే తోక 22 అంగుళాలు. అట్లాంటిక్, హిందూ, పసిఫిక్ సముద్రాలపై కర్కటక, మకర రేఖా ప్రాంతాల పరిధిలో నివసిస్తుంది. జంటకట్టిన పక్షితోనే చిరకాలం జీవిస్తూ ఏడాదికి ఒకేఒక్క గుడ్డు పెట్టడం దీని ప్రత్యేకత.
వారెవ్వా!

ఆయనను వదిలివేయగలిగివుంటే బాగుణ్ణు. కానీ చేయగలిగింది ఏముంది. మనసులోకి చూస్తున్నవాడిలా, దాన్ని చదువుతున్నవాడిలా అన్నాడు ఆయనే.

"ఎంతుంది? "

చెప్పేడు.

"నా చొక్కా పక్కజేబులో కూడా చూడు. ఆపైన నారాయణ ఉన్నాడు"

చూశాడు. మరికొన్ని చిల్లర నోట్లు, చిల్లర, రెండు చుట్టలు ఉన్నాయి. ఆయన చుట్ట కాల్చి కొన్ని గంటలయింది. చుట్ట తాగితే ఆయనకు ఉపశమనం. ఇప్పుడు తాగితే బాగుండదు. చుట్ట వదిలి డబ్బులు తీసుకుని జేబులో వేసుకుని వరండాలో మనీ ప్లాంటు దగ్గిర నిలబడ్డాడు. అక్క బెక్కుతోంది. తల్లి ఏడుపు ఉధృతి తగ్గింది, వరదనీరు తగ్గుతున్నట్లు. నారాయణరావు చేత్తో రమ్మని సైగ చేశాడు.

వెళ్లాడు. "తయారవుదామా? " అడిగాడు నారాయణరావు. తను "ఊఁ" అని సమాధానం చెప్పాడు. 'రిక్షా పిలుచుకు వస్తానుండు' అని అతను బయటికి నడుస్తుంటే "నేనూ వస్తా" అన్నాడు. ఇద్దరూ జంక్షన్ దాకా నడిచారు. ఒకటే వుంది.

"ఏడు రూపాయలు"

బేరం ఆడకూడని, ఆడలేని సమయమిది. బరువులతో, దూరాలతో సంబంధం లేదు బేరానికి. శవాన్ని తీసుకెళ్లటమంటే ఒక తెగింపు పని చేస్తున్నట్లు, ఒక త్యాగం చేస్తున్నట్లు. వాడి బతుకు తెరువువాడు చూచుకోవడంలో తప్పులేదు. ఏడు రూపాయలు పెద్దమొత్తం కాకపోవచ్చు వాడి శ్రమకు ఇంతకు ఎన్నో రెట్లు ఇవ్వాలి. కానీ వాడు సాధారణంగా అడిగేదానికన్నా ఎక్కువ. అంతే.

వాళ్లిద్దరూ ముందు నడుస్తుంటే వాడు రిక్షా నడిపిస్తూ అనుసరిస్తున్నాడు.

నారాయణరావు కుర్రాణ్ణి దుప్పట్లో చుట్టి చేతుల్లోకి తీసుకుని రిక్షావైపు వెళుతుంటే తల్లి అడ్డుపడింది. అతను కానిపని చేస్తున్నట్లు, కానిపని చేసినవాడిని అడ్డుకోటం ఎలాగూ సాధ్యపడదు కాబట్టి. కూతురు ఏడుస్తూనే ఆమెను వారించింది.

గదిలోపలి చీకట్లోకి ఒకసారి చూసి అభిమన్యు నారాయణరావును అనుసరించాడు. ముందు రిక్షా అభిమన్యు ఎక్కాడు. నారాయణరావు చేతుల్లో నుంచి తమ్ముడిని అందుకుని తన ఒడిలో ఉంచుకున్నాడు. చేతులు చల్లగా తగిలాయి. మెత్తగా దూదిపింజలలా తగిలాయి. అభిమన్యు తన వేళ్లను వాడి నున్నటి బుగ్గలకు తగిలించాడు.

నారాయణరావు అభిమన్యు పక్కన ఇరుకుగా కూర్చుని వాడ్ని ఇలా ఇవ్వు అన్నాడు.

"ఫరవాలేదు నేనుంచుకుంటాను" అన్నాడు, వాడిని అసంకల్పితంగా గుండెకు హత్తుకుంటూ. అతను మారు మాట్లాడలేదు. రిక్షా కదిలింది.

అక్క, తల్లి ఏడుపులు దూరమవుతున్నాయి. మలుపు తిరిగి మెరక ప్రదేశం నుంచి పల్లంలోకి రిక్షా పరిగెడుతోంది. పెడలు వేయటం మాని, అడ్డుగా ఎవరూ రాకుండా ఉండటం గురించి అదే పనిగా బెల్లు మోగిస్తున్నాడు రిక్షా అతను. చావు గురించి శ్మశానం ఆగదు.

సముద్ర అశ్వాల దగ్గర మలుపు తిరిగి స్టేడియం రోడ్డు పట్టింది. రద్దీ తగ్గింది.

"చావును మించిన నిగూఢ రహస్యం లేదు" నారాయణరావు అన్నాడు.

దానికి ఏమీ మాట్లాడలేదు.

"చావు మనకు ఇప్పుడల్లా రాదు అనుకునే వింత భావన వల్లే ఎన్నో తాపత్రయాలు పడటం, వెధవపన్లు చెయ్యటం"

"ముందుగా తెలియటం వలన నష్టాలు, కష్టాలు ఉన్నాయి కదా. అయినవాళ్ల చావు గురించి ముందుగా తెలుస్తుంది రోగ కారణాల వల్ల. ముందునుంచే

ఏడుస్తూ కూర్చుంటాం."

"చావులో భౌతికమయిన మార్పులతో కూడిన స్థితిని తప్ప వాటికి అతీతమైన వేమన్నా ఉన్నాయా? ఉంటే అవి ఇవి అని నిర్ధారణగా చెప్పటానికీ లేదు. చావు అంటే స్వేచ్ఛ అంటారు. మరి శృంఖలాలను ఎందుకు అంతలా ప్రేమించి అవి వదిలేసేటప్పుడు ఎందుకు భయపడతామో తెలీదు. ఇవాన్ ఇలిచ్ మరణం చదివావా?."

చదివాడు. అయినా "చదవ లేదు," అన్నాడు ఈ చర్చలో ఇలాంటి సందర్భంలో ఏదో కృత్రిమత్వం చోటు చేసుకున్నట్లనిపిస్తోంది. అనుక్షణం తమ్ముడికి వెచ్చించాల్సింది పోయి తప్పు చేస్తున్నట్లు, వాడికి అన్యాయం చేస్తున్నట్లు అనిపిస్తోంది. ప్రతి మనిషిలోను ఏదో వైచిత్రి నారాయణరావులో లాగే. జీవితమంతా విచిత్రాలమయం. కష్టాలకు నా బాధ్యత లేదు కావలిస్తే తోడుగా ఉండి చేతనైంది చేస్తానన్నట్లు నారాయణరావు తనకు తోడు. కృతజ్ఞతలు. నారాయణరావుకూ అభిమన్యుడిలో కలిగిన భావనలే కలిగాయేమో మౌనంగా ఉండి పోయాడు. మౌనం వలన ఇలాంటి భారమైన క్షణాలు మరీ భారమవుతాయని ఏదో ఒకటి మాట్లాడే ప్రయత్నం చేశాడు. పైగా చావు తెచ్చిన భయంకరమైన అనుభవం తన జీవితంలోను తటస్థించింది కదా.

లెడ్ బీటర్ అంటాడు "ఎటూ పోలేని శిఖరం మీద ఉన్నాం. మన ఇంద్రియాలన్నీ చిన్న చిన్న కిటికీలు. అవి కొన్నివైపుల మాత్రమే అమరి ఉన్నాయి. అందువల్ల కంటికి కనిపించేదే ఉన్నట్లుగా అనుకోరాదు... మన చుట్టూ ఉన్న గాలినే చూడలేం. పెద్ద నౌకలను, హర్మ్యాలను కూడా కూలదోయగల శక్తిగల గాలి ఉనికిని కూడా అది చైతన్యవంతమైనపుడు మాత్రమే గమనించగలం.... జ్ఞాన పరిమితి కారణంగా, చావు మననుంచి వేరు చేసిన మనవాళ్లను చూడలేకుండా ఉన్నాం. చావు 'భయానక అనుభవాలకు రాజు' కాదు; పరిణామ సంబంధమైన అవసరమైన చర్య. శత్రువు కాదు, స్నేహితుడు. ఏ ప్రయాణికుడు తిరిగి రాని చోటు కాదు; సమగ్రమైన, ఉన్నతమైన జీవితపు తాళం తీయడానికి దేవత చేతిలోని బంగారు తాళం చెవి."

**"చావులో భౌతికమయిన మార్పులతో కూడిన స్థితిని తప్ప వాటికి అతీతమైనవి ఉన్నాయా? ఉంటే అవి ఇవి అని నిర్ధారణగా చెప్పటానికీ లేదు. చావు అంటే స్వేచ్ఛ అంటారు. ఇవాన్ ఇలిచ్ మరణం చదివావా?"**

ఆ మాటలు సత్యం అనిపిస్తాయి, నమ్మాలని వుంటుంది. చావు సంబంధిత భయాన్ని, విచారాన్ని లేకుండా ఆ మాటలు చేయగలిగితే మంచిది. మనిషి కావాలని భయపడడు, కావాలని విచారించడు. భయం, దుఃఖం మానవ నైజపు పార్శ్వాలలో కొన్ని. ఇలాంటి నైజం నాకు కావాలని అలవరచుకున్నదీ కాదు. తర్కం ద్వారా నిజగుణాల చొక్కాను విప్పి చిలక్కొయ్యకు తగిలించగలిగినపుడు చావును మామూలు సంఘటనలా తీసుకోవటానికి వీలవుతుంది. చావు వల్ల సమష్టి జీవితాలలో నష్టాలుంటాయి. చావు దినపు దుఃఖానికి ఆ కష్టం, నష్టం పరిమితం అయ్యేది కాదు.

ఒకనాడు తుమ్మెదల మెట్ట అని పిలువబడి, నేడు హరిశ్చంద్ర వాటిక అనే గొప్ప పేరుతో కొందరు పిలిచే శ్మశానం చేరారు. ముందుగా దిగి సాయం చేశాడు నారాయణరావు. రిక్షా డబ్బులు అతనే ఇచ్చాడు. వారించలేదు అభిమన్యు. డబ్బు రుణం ఎప్పటికైనా తీర్చుకోవచ్చు

సింహాచలం వైపు వెళ్లే బస్సుల గురించి ఎడమ ఎడమగా నిలబడి వున్నారు జనం. సెయింట్ జోసెఫ్స్ కళాశాల ప్రహరీ గోడ కివతల సన్నటి సందు- స్వర్గానికో, నరకానికో దారిలా. కళాశాల పై అంతస్తు కిటికీలు మరణించిన మనిషి కనురెప్పలలా మూసేసి ఉన్నాయి. ప్రహరీని కప్పి వున్న పూల లతలు, పూలు వాటి ఉనికి అర్థాన్ని అన్వేషించవు. ఏ రంగు పూలో గుర్తించటం కష్టం. ముందుకు నాలుగడుగులు వేయగానే కుడిచేత ప్రక్కన, ప్రహరీని ఆనుకుని, వ్రేలాడుతున్న బల్బుల వెలుతురు క్రింద ముగ్గురు కూర్చుని, వెలుతురును సద్వినియోగం చేయాలని ఎవరికో సందేశం ఇస్తున్నట్లు జూదం ఆడుతున్నారు. అందరికీ మేధాసంపత్తి ఉంటే మానవ జీవిత సమస్యల గురించి అందరూ కూర్చుని ఆలోచనలతో పొద్దుపుచ్చవచ్చు. ఆ సంపత్తి, ఏ సంపత్తి లేని వారలు శ్మశానాల దగ్గిర జూదాలతో పొద్దుపుచ్చక తప్పదు. అయినా అందరూ పల్లకీలెక్కి కూర్చుంటామంటే బోయీలూ ఎక్కడుంటారు.

**అందరికీ మేధా సంపత్తి ఉంటే మానవ జీవిత సమస్యల గురించి అందరూ కూర్చుని ఆలోచనలతో పొద్దుపుచ్చవచ్చు. ఏ సంపత్తి లేని వారలు శ్మశానాల దగ్గిర జూదాలతో పొద్దుపుచ్చక తప్పదు.**

"ఎవరూ లేరా? " అడిగాడు నారాయణ రావు కుర్రాడిని చూపించి.

"అరే ఇప్పుడే ఎల్లిపొయ్యారే," అన్నాడు పొడవాటి వ్యక్తి ముక్కలు ముడిచి. నోట్లోంచి గుప్పుమని వాసన వచ్చింది. క్షణం ఆలోచించి, "మీరు వేగిరం ఎల్లగలితే సావుల మదూం లోపు దొరుకుతారు. అందులో ఒక ముసలాడుంటాడు. వాడి ముఖం నిండా మచ్చలు, కంట్లో పువ్వు ఉంటాయి. బేగి ఎల్లండి"

"వాళ్లెవరో మేం గుర్తుపట్టటం కష్టం," పిలుచుకు రమ్మనట్లు ధ్వనించాడు నారాయణరావు. మాట వింటారా వాళ్లు. జూద బంధితులు.

పొడవు వ్యక్తి మూడో వ్యక్తి వైపు అర్ధ రూపాయి బిళ్ల ఎగరేసి, పేక ముక్కలు కలుపుతూ, "ఆంజనేయులూ, నీ వెళ్లా ఆల్తో తోడుగా. నువు కుర్రోడివి గదా, మనిసికి మనిసి కాకపోతే ఔల్లురా సాయి పడేది? "

కొంతసేపు పేకాటకు దూరమవటం అనే త్యాగం తన శక్తికి మించిన పనిగా భావించిన ఆంజనేయులు తోక ముడుచుకుని కూర్చునే ఉండిపోయాడు. కారణం గ్రహించగలిగిన మేధాసంపత్తున్న పొడవు మనిషి, "నీవొచ్చేంతవరకి ఆటుండదులే" అన్నాడు.

ఆంజనేయులు, నారాయణరావు కలిసి పరుగులాంటి నడకతో వెళ్లారు.

"కుర్రాడ్ని ఎంతసేపు ఎత్తుకుంటారు కిందికి దించండి" అన్నాడు రెండవ వ్యక్తి. మిగతా ఇద్దరూ కాస్తో కూస్తో కష్టంలో ఉన్న వాళ్లకు సాయం చేస్తున్నపుడు తనవంతు సాయం అందించాలన్న సదుద్దేశంతో సలహా ఇచ్చాడు. అతనివి గుంట కళ్లు, చప్పిడి దవడలు, సలహాలివ్వటానికి అవి అడ్డురావు.

"పర్లేదు. వాళ్లిప్పుడే వచ్చేస్తారుగా," వాడిని క్రింద పడుకోబెట్టటం ఇష్టంలేక, దూరంగా చీకట్లో కలిసిపోతున్న ఇద్దర్నీ చూస్తూ అన్నాడు అభిమన్యు.

వాళ్లు దొరుకుతారా? దొరక్కపోతే ఏం చేసేట్లు. ఇది చిన్న సమస్యలా తోచలేదు. మనిషికి ఒక బాధలో ఉంటే అది తీరే దాకా మరో సమస్య వేచి వుండదు. వాళ్లు వెళ్లిన దిక్కునే నడిచి సందు మొదటికొచ్చి నిలబడ్డాడు. జనం మధ్య వుంటే మరో

ఆలోచన మీదికన్నా మనసు మళ్లుతుందే మోనన్న ఆశతో.

ఎదురుగా పార్కు గోడకు ఆనించిన రిక్షాలు. వంతెన మీద దయ్యపు గొంగళిలా పాకుతున్న రైలింజను. కుడివైపు, దక్షిణ దిక్కున ఆకాశానికి వేసిన యమపాశంలా ఇనుప ఖనిజాన్ని ఓడలోకి చేరవేసే కన్వే యరు గ్యాలరీ, విద్యుద్దీప అలంకరణతో.

వాడ్ని ఆ భుజం నించి మరో భుజం మీదికి మార్చుకున్నాడు. దూరపు ఆశలా, ఆత్మీయతలా ఊగుతూవస్తున్న నారాయణ రావు, ఆంజనేయులు, మరో ముగ్గురు.

"మీ ఇలాకేయే గదా," వచ్చిన వాళ్లలో ఒకతను అన్నాడు. అతని మాట ముద్దగా వుంది. వచ్చిన వాళ్లలో పొడవాటి వ్యక్తి పేర్కొన్న ముసలాడు వున్నాడు.

ముసలాడు నారాయణరావును పక్కకు తీసుకుపోయాడు ఏ చిదంబర రహస్యం మాట్లాడటానికో. వినయంగా గుసగుసలా డాడు. అభిమన్యు వాళ్లని మౌనంగా చూశాడు. కుర్రాడ్నెత్తుకుని నిలబడి చేతులు కాళ్లూ పీకుతున్నాయి. నారాయణ రావు అభిమన్యు దగ్గరికి వచ్చాడు.

అందరూ తిరిగి వెళ్లిబోతున్నారు. ఎందుకలా వెళ్లిపోతున్నట్లు?

వాళ్ల వెనకే ఆంజనేయులు కేకేశాడు, "నేనొచ్చేదేటి? "

"నువ్వెందుకు(బూతుమాట)...దండగ? "

"బేరమిప్పించిన విశ్వాసం నేదు."

నారాయణరావు కుర్రాడిని ఎత్తుకుం టాను కాసేపు అన్నాడు. అభిమన్యు ఇచ్చే శాడు.

అవిటి కుర్రాడు వాడి తాత దిక్కు చూస్తూ నిలబడ్డాడు.

"వాళ్లని కాళ్లూ గడ్డాలూ పట్టుకుని బ్రతి మిలాడాల్సొచ్చింది. చేపల్లా తాగుతున్నారు, రేపన్నది లేనట్లు, ఏరోజుకారోజు జీవించద లచుకున్నట్లు. మళ్లీ తాగటానికి పదిరూపా యలు గుంజారు. యాభై బేరమాడకుండా ఇస్తే వస్తాం లేకపోతే రాం అన్నారు. వాళ్ల టయిం ఎప్పుడో అయిపోయిందట. పోస్లే అని ఒప్పుకుంటున్నాం అన్నారు. తాగి, తిరిగి వస్తారు."

డబ్బు గురించి ముచ్చటిస్తున్నందుకు నారాయణరావు మీద కాస్త చికాకు కలి గింది. కానీ ఇలాంటి సమయాల్లోనూ డబ్బు ప్రాధాన్యవస్తువు. అది ఉంటేనే మనుషులు మాట వింటారు, పనులవు తాయి. పైగా అతని డబ్బు ఖర్చవుతోంది. బాకీ వసూలవుతుందో లేదో అతనికి తెలీదు కదా.

"వాళ్లు వస్తారో, తాగి అట్నుంచి అటు వెళ్లిపోతారో."

నారాయణరావుకూ అదే సందేహం కలి గింది. ఎందుకైనా మంచిదని అభిమన్యు ఆంజనేయులు దగ్గిరకెళ్లి, "వాళ్లు తిరిగొ స్తారు కదా? " అడిగాడు.

"ఇది అరిచ్చంద్ర వాటిక సారూ," అన్నాడు ముద్దగా మాట్లాడే మనిషి, కళా వరు రాజును కసిగా క్రిందకు కొట్టి, తనకు రాజన్నా గౌరవం లేనట్లు.

కాస్సేపట్లోనే వాళ్లు ముగ్గురూ తిరిగి వచ్చారు హరిశ్చంద్ర వాటికకు. ముగ్గురి లోను నూతన శక్తి వచ్చినట్లుంది. ఇందా కటి కంటే ఆనందంగా ఉన్నారు. ఆనం దాన్ని చౌకగా, తేలికగా తెచ్చుకోగల "రహస్యం" వాళ్లకు తెలుసు.

ఒకడు ముసలాడి రెక్కపట్టుకుని లాక్కు పోయాడు, తెగిపోయిన ఎండుకొమ్మను అవలీలగా ఈడ్చుకు పోయినట్లు. నారాయ ణరావు, అభిమన్యు వాళ్ల వెనుక శ్మశానం ద్వారం దగ్గిరకు వెళ్లారు. చావులూ, ఏడు పులూ మామూలువే... పేకాట ఒకటి నిత్య నూతనమైంది అన్నట్లు ఏకాగ్రతతో ముగ్గురూ ఆడుతున్నారు. పొడవాటి అతను మాత్రం ఒకే ఆనందానికి ఎందుకు కట్టుబడి ఉండాలని భావించినట్లు బీడీ కూడా తాగుతున్నాడు. బీడీని బీడీలాగే



ఎందుకు అనుభవించాలన్నట్లు గంజా యిలా భావిస్తూ, అనుభవిస్తూ, అనందిస్తు న్నాడు. జీవితం రసవత్తరంగా లేదు అని ఏడ్చేవాళ్లకు వాళ్ల చేతకాని తనాన్ని ఎత్తి చూపుతున్న జ్ఞానిలా తోస్తున్నాడు.

ద్వారం దాటి శ్మశానంలోకి అడుగుపెట్టంగానే ఎవరు చూడకుండా అభిమన్యు చేయితట్టి, రహస్యం చెబుతు న్నట్లు, "ఏం కంగారు పెట్టుకోమాక, నీరూ రని చోట గెట్టిగావుండే పొడి నేలలో లో తుగా పాతిపెడతాలే," అన్నాడు ముస లాడు సాటి మానవుడి కష్టంలో చేతనైన విధంగా సాయపడకపోతే జీవిత సార్థక్యం ఏంటి అని తెలుసుకున్న మనిషిలా.

ట్యూబులైటు వెలుతురులో వాడి కన్ను వేసిన పూవు... కాదు... పువ్వేసిన కన్నును చూశాడు అభిమన్యు. "సృష్టిలో ఎన్నిరకాల క్రూరత్వాలున్నాయి," అబ్బురప డ్డాడు. వాడి తల మధ్య ఏమీ మిగల లేదు. చుట్టూ మాత్రం ఏమీలేనిదానికి కంచెవేసినట్లు, బంకతో అంటించిన దూది పింజల్లాంటి జుత్తు, గాలికి ఎగిరిపోవాలనే వృథా ప్రయత్నం చేస్తూ.

ఎడమవైపు మూడు చితులు కాలుతు న్నాయి, ఎవడి ధర్మం వాడు చెయ్యాలని ఎవరికీ అక్కర లేని పాఠం చెబుతున్నట్లు.

ఒక మూలకు దారితీశారు. ఒకడు వెళ్లి రెండు గునపాలు తెచ్చాడు. ఒక వ్యక్తి తవ్వటం మొదులుపెట్టాడు. రెండవ వ్యక్తి రెండో గునపం ముసలాడి వైపు విసిరి తవ్వమన్నాడు.

"ముందు నువు తొవ్వు, తర్వాత
నే తొవ్వుతా."

"అందుకే దేవుడు నీ కన్ను...(బూతు మాట)..." అన్నాడు ఆ వ్యక్తి కోపంగా.

మౌనంగా రెండో గునపం తీసుకుని తవ్వటం మొదలుపెట్టి, ఆవ్యక్తి మాటలు ఇప్పుడు వినిపించినట్లుగా ముసలాడు అన్నాడు-

"నా కన్నేకాదు, నా రూపాన్నీ, మూడో ఏటే నా అమ్మాబాబుల్నీ, నాకొడుకునీ ఆ దేవుడే...(బూతుమాట)"

"ఊరుకోరా ముసలాడా, ఆ తాగుబోతు నాయాల్తో ఏటిరా? "

"దేవుడ్నెందుకురా ఆడిపోసుకుంటావ్? ఆ దేవుడే ఇంత ముసలాడివైనా సంప కుండా బతనిస్తన్నాడు, ఆ దేవుడే సంపా యించే కోడల్ని..."

ఈ సారి తవ్వుతున్న వ్యక్తి గునపం ఎత్తి, రెండవ వ్యక్తి తలకి గురిపెట్టి, "ఆ దేవుడే ఇప్పుడు నిన్నట్టికెల్లి పోతాడు నోరు మూయకపోతే," అన్నాడు. ఆ దెబ్బతో అతగాడు వికవికా నవ్వి సహచరుడు చెప్పి నట్లు చేశాడు కాసేపు.

"ఏం. తవ్వుతావులే ఈ వయసులో, ఇయ్యి," అంటూ ఆ వ్యక్తి ముసలాడి దగ్గి రనుంచి గునపం లాక్కోబొయ్యాడు.

"మూడేల్లదాకా రిచ్చాతొక్కిన కాళ్లూ సేతులూ ఇయి."

ఒకవైపు నుంచి ముసలాడు, రెండోవైపు నించి మిగతా ఇద్దరిలో ఒకడు తవ్వేరు, మరణ మృదంగాల్లా ధ్వనిస్తూ.

"ఇక సాల్లే", అంటూ గునపం పక్కనే పడేశాడు ముసలాడు రొప్పుతూ.

"శవం పైకే ఉండిపోతుంది, మరో అర అడుగు తవ్వండి," నారాయణరావు అన్నాడు.

"మేం మరిళ్లకెల్లద్దేటి బాబూ? అయినా సరిపోద్ది. కొంత సూసుకునే తవ్వినం."

"పోన్లేరా ఇంకొంచెం తవ్వుదాం, మన బంగారమేం పోద్ది. ఆలీశం అవుద్ది అంతే గదా," ఖాళీగా కూర్చున్న వ్యక్తి అన్నాడు. ముసలాడు తన గునపం ఆ వ్యక్తికిచ్చాడు. పొడి నేలలోకి వాళ్ల చెమట బిందువులు ఇంకుతున్నాయి.

అయిదు నిముషాలు మౌనవ్రతం పాటించినట్లు ఎవరూ నోరెత్తలేదు. ఉమ్మే సేటప్పుడు కాండ్రించే ముసలాడి కంఠం,

రాయికి తగిలినపుడు గునపం చేసే చప్పుళ్లు. పదడుగుల దూరంలో క్రింద పడుకోబెట్టి వున్న చిరంజీవి శవం. తల్లి పాత చీర కప్పిన తమ్ముడ్ని చూస్తూ గొంతు కూర్చున్నాడు. పుట్టలో నుంచి వెలుపలికి పడగవిప్పిన పాములాంటి బాధ.

తవ్వటం అయిపోయింది.

"శవాన్ని మీరు దించుకుంటారా, మేమే దించమా? "

కుర్రాడి మెడక్రింద చేయి వేసి, రెండవ చేతిని నడుం క్రిందికి పోనిచ్చి ఎత్తి నేల తల్లి వడిలోకి జార్చాడు నారాయణరావు. ముసలాడు తన మొరటు చేత్తో వాడి తలని లోపలికి అదిమాడు. అభిమన్యు గుండెలో ఎక్కడో కలుక్కుమంది. ప్రాణం లేకపోవచ్చు బాధ తెలీక పోవచ్చు ముద్దులొలుకుతూ వచ్చిన మూడు నాలుగేళ్ల పసి, మానవ శరీరానికి తగిన గౌరవం ఇవ్వద్దూ? గోతి మీదికి దాపురించిన చెట్టు ఏదో తత్త్వం చెప్పాలన్నట్లు దేన్నో రాల్చింది. అది ఏంటో చూశాడు అభిమన్యు- ఎండుటాకు, పండుటాకు కాదు చిగురు. అది వాడి పొట్టమీద పడింది. ధ్యాన ముద్రలోవున్న బుద్ధుడి పసిమొహంలా వుంది వాడి మొహం. ఈ నేలలో నాటుతున్న ఈ పసిడి విత్తనం మరోచోట మొక్కగా మొలుస్తుందా? మొలిచినా, ఎక్కడో?

"మట్టి తోసెయమా? "

పిడికెడు తీసి వాడి గుండెమీద నెమ్మదిగా పడేట్లు జారవిడిచాడు నారాయణ రావు.

"నువ్వూ వెయ్యి."

అభిమన్యు అటు తిరిగి నిలుచుని ఉన్నాడు. వేయనని అడ్డంగా తల తిప్పాడు.

వాడిని పూడ్చేశారు. రెండు నిముషాల తర్వాత వాళ్లంతా పని పూర్తయిన చప్పుళ్లు చేసినపుడు ఇటు తిరిగాడు అభిమన్యు. గొయ్యి లేదు. వాడూ లేడు. నేల చదునయింది, వాడ్ని మింగి ఏమీ తెలీనట్లు. భూమి గుండెలలో దాచుకుంది వాడి శరీరాన్ని, జ్ఞాపకాలను మీ గుండెలకే వదిలి పెడుతున్నానని. ఇక కనపడడు, వినపడడు.

**ముసలాడు తన మొరటు చేత్తో వాడి తలని లోపలికి అదిమాడు. అభిమన్యు గుండెలో ఎక్కడో కలుక్కుమంది. ప్రాణం లేకపోవచ్చు, బాధ తెలీక పోవచ్చు. ముద్దులొలుకుతూ వచ్చిన పసి, మానవ శరీరానికి తగిన గౌరవం ఇవ్వద్దూ?**

అంతా బయటికి నడుస్తున్నారు నిశ్శబ్దంగా, భారంగా, నడక మరచిన వాడిలా నడుస్తున్నాడు అభిమన్యు. బరువైన శిలువను భుజానికి ఎత్తినట్లుంది, ఇపుడు బరువు దించుకున్న తర్వాత.

లోపలి నుంచి బయటికి రాంగానే జేబులోకి చేయి పోనిచ్చి డబ్బులు మొత్తం బైటికి తీసి నారాయణరావు చేతిలో పోశాడు అభిమన్యు. అతను లెక్కబెడుతున్నాడు. అది సరిపోతుందో లేదో నారాయణరావుకే తెలియాలి. అతను తనతో ఎంత తెచ్చాడో, తేలేదో తెలియదు. సరిపోకపోతే?

"అవిటాడు బాబూ నా మనవడు. ఆడికో రూపాయివ్వండి ముందు," ముసలాడు ముఖంలోకి లోకంలోని దైన్యాన్నంతా చిటికలో పోగేశాడు.

లెక్కపెడుతున్న దాంట్లోంచి తీసి నారాయణరావు ఆ కుర్రాడికి ఒక రూపాయి ఇచ్చాడు. ముసలాడి ముఖంలో సంతోషం చోటు చేసుకుంది క్షణకాలం. దాని ఖరీదు రూపాయే.

తనిచ్చినది సరిపోయినట్లు లేదు. నారాయణరావు జేబులోకి చేయి దూర్చి ఒక నోటు లాగి మొత్తం కలిపి ముసలాడికి చ్చాడు. వాడు దాన్ని లెక్క పెట్టాడు.

"పొడి నేల్లో, గట్టి సోట, ఈ రాత్రేల అంత గొయ్యి తీసినం. ఈ ఏలకి తొంగుండే ఓల్లం. మరో అయిదిప్పించండి."

"నూవడిగిందానికి మరో అయిదు కలిపే ఇచ్చానువై. చూశావ్‌గదా మా దగ్గర ఉన్నదంతా కలిపి ఇచ్చాం," దాపరికం లేకుండా అన్నాడు.

"ముసలాడి ముఖంలో రంగు మారింది.

"సావు దగ్గిర కూడా పై..." సణుక్కుంటూ వెళ్లిపోవటం మొదలుపెట్టాడు.

సందు మొదటికొచ్చారు. చీకట్లో, మొక్కల్లో, తుప్పల్లో, జిల్లేడు చెట్లల్లో, రాళ్లల్లో రప్పల్లో- దేని గురించో దేవులాడుతున్న మానవకారాలు. "సుఖాన్ని" ఇచ్చేవి, పొందేవి.

కాలం ఎంతయిందో? ఇంటిదగ్గరి వాతావరణం ఎలా భరించటం? ఈ రాత్రంతా నారాయణరావు తనతో ఉంటే బాగుండు. అతనికి ఇదొకటే పనా.

తమ జీవితంలో ఏముందనో పాలు పంచుకోటానికి అంత ఆలస్యంగా వచ్చాడు. ఏమీ లేదని తెలుసుకున్న క్షణమే వెనుదిరిగిపోయాడు వాడు.

తల్లీతండ్రీ ఒక రాత్రి చేసిన తప్పుకు ఎంత కఠినమైన శిక్ష!

నారాయణరావు అభిమన్యును వదిలి రిక్షాల దగ్గిరకెళ్లి ఎక్కడికెళ్లాలో చెప్పి, ఎంత కావాలి అని ప్రశ్నిస్తున్నాడు, వాడు భూమండలం కావాలంటే రాసేయబోతున్నట్లు.

అసలు, వెళ్లిపోయినవాడి గురించి ఈ దుఃఖం అక్కరలేదు. తమ జీవితంలాంటి జీవితపు ఉచ్చు నుంచి తప్పించుకున్నవాడిని గురించి బాధ అక్కరలేదు. నిష్క్రమించిన వాడు వదిలిన (తమ జీవితం, ఇల్లు ఇరుకువే అయినా) ఖాళీ భరించలేక పడుతున్న వేదన. తమను తాము చూసుకుని పడే జాలి.

తిరిగి ఎప్పటికైనా రావలసిన ఆ చోటును వదిలి నారాయణరావు తోడుగా రిక్షా ఎక్కాడు అభిమన్యు. ఇప్పుడా మెట్ట మీద తుమ్మెదలు లేకపోయినా అది తుమ్మెదలమెట్టే.

**"కాపురమొచ్చిన కన్నిపాపాయి**
**ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయాడు."**

(బసవరాజు అప్పారావు)




**తె**ల్లవారుజామున కాని నిద్రపట్టదు. చాలా కాలంగా జరుగుతున్న సాధారణ విషయం. చీకటి దిగులు పుట్టిస్తుంది. గడవని కాలం బాధిస్తుంది. ఈ రాత్రి, రెండు, మూడు గంటల నిద్రా ఉండదేమో అనుకుని మంచం మీద దుంగలా అటూ ఇటూ దొర్లుతుంటాడు. దొర్లుతుంటేనన్నా కాలం గడిచి తెల్లవారుతుందన్న ఆశవల్ల, నిద్రపోకుండా శరీరాన్ని ఒకే స్థితిలో ఉంచటం సాధ్యపడకపోవటంవల్ల. విసిగి, లేచి గదిలో పచార్లు చేస్తూ గడుపుతాడు, అంగలతో కాలాన్ని దాటి అవతలికి చేరటానికన్నట్లు. అలాంటి ప్రతి సమయంలోనూ "పెళ్లి చేసుకుందాం" అనుకుంటాడు; ఆ నిర్ణయానికి నిద్రకూ ఏదో అవినాభావ

సంబంధం ఉన్నట్లు, పెళ్లి అని ఊరిస్తే నిద్ర తనను ఒళ్లోకి తీసుకుంటుందన్న భావం ఏదో ఉన్నట్లు. వింతగా ఒక్కోసారి అలా అనుకోగానే నిద్ర దరిచేరుతుంది.

ఎంతో కాలంగా మానసిక అస్థిరత, ఊగిసలాట. ఎన్నోసార్లు 'నాకు జీవితంలో ఏం కావాలి?' అని ప్రశ్నించుకున్నాడు. ఈ ప్రశ్నకు సమాధానం దొరికింది - సుఖం, శాంతి. ఆ రెండూ ఎక్కడ దొరుకుతాయి, ఎలా దొరుకుతాయి? దీనికి సమాధానం దొరకలేదు.

నిశ్శబ్దం, చీకటి, ఒంటరితనం చెట్టాపట్టా లేసుకునే ప్రాణ స్నేహితులు. ఆ మూడూ ఏకమై తను ఉమ్మడి శత్రువన్నట్లు వేధి స్తాయి. జ్ఞాపకాలు ఒదులుతాయా? వాటి బాకీ కాని బాకీని వసూలు చేసుకుంటు న్నట్లు అవీ కలత పెట్టి డిప్రషన్‌లోకి దింపుతాయి.

మంచం మీదినించి లేచిపోయి- "ఈ చిత్రహింసను భరించలేను, భరించలేను, భరించలేను", అని సణుగుతాడు మంత్రో చ్చారణలా. మంత్రాలకు ఎలాంటి చింతకా యలు రాలవు. కలిగితే, రాలుతాయన్న ఆశ మాత్రం కలుగుతుంది ఆ మంత్రోచ్చా రణ వల్ల. పచార్లు చేసి చేసి కాళ్లు పీకుతు న్నపుడు తిరిగి పండుకుంటాడు వెల్లకిల్లా, శవంలా, తనకు తను నిద్ర నటిస్తూ. "రాత్రి సమయం పగటికి రెండింతల్లా ఉందే విడ్డూరంగా?"

బాధామయమైనదే అయినా గతం సంఘటనా పూరితంగా ఉండేది. అది కుటుంబ జీవితం. ఒంటరితనం, నిద్రలేమీ లేనిది. అబ్బాయ్, గత జీవితం లాంటిది మళ్లీ కావాలా? మౌనమే సమాధానం. ప్రస్తుత లోపం, జరగటానికి ఏ సంఘ టనా మిగలకపోవటమేమో. జీవితంలో ఏదో ఒక ఏడుపు ఉండాలన్న సిద్ధాంతం ఏదో ఉన్నట్లుంది. ప్రస్తుతం ఉన్నది ఒక రకం ఏడుపు. బాధించే సముద్రమంత కాలం; కంటికి కానరాని సముద్రం. ఎంత సేపు ఈదితే అవతలకి చేరతాడు? మరో వ్యక్తితోనో, వ్యాపకంతోనో కాలం గడుస్తుం దేమో అనుకున్నాడు. ఆ ప్రయోగం విఫల మయింది. వాటిని పనికిరాని తెప్పల్లా వదిలివేశాడు. జనారణ్యంలో ఒంటరి పయనమే తనకు శ్రేయస్కరం, "నా మన స్తత్వానికి" సరిపడేది అనుకున్నాడు. వ్యక్తులు విసుగూ, కోపం కలిగిస్తూ వచ్చారు. వ్యాపకాలు అర్థరహితంగా తోచాయి. తన ఏడుపు తనకు వచ్చిన ట్లుగా ఏడ్చుకోటం నయం, కొత్త చికాకులు తలకెత్తుకోకుండా అని అనుకుంటూ ఉంటాడు. ఏ నిర్ణయమూ, ఏ అభిప్రాయము ఒక ఒడ్డుకు చేరి స్థిరంగా ఉండవు. లంగరూ, తెరచాప కొరవడిన పడవలవి.

నవారు ఉయ్యాలలా వదులైన మంచంలో పడుకునో, పట్టా క్రిందికి సాగిన పడక కుర్చీలో వాలో పైకప్పు చూస్తూ (మైఖెలేంజెలో తన చిత్రకళను తాను పరికిస్తున్నట్లు) గడుపుతాడు గంట లకు గంటలు. ఇరవై నాలుగు గంటలు రెండు వందలా నలభై గంటలలా అనిపి స్తాయి. కాలంతో పోటీ పడితే నత్త గెలు స్తుంది. కాళ్లు లేని కాలం దేకటం కూడా రానట్లు నిలిచి(?)పోతుంది.

అసలు కాలం గడవాలి అని ఎందుకను కోవాలి? పది రోజులో, నెలో, సంవత్స రమో "అతి వేగంగా" పరుగెత్తిందే అను కుందాం - తర్వాత లభించేది, లాభించేది ఏముంది? లభించాలని దేన్నీ కోరుకో వటం లేదు ఒక్కటి తప్ప. కాలపు ఆవలి వడ్డున ఏ పచ్చికబయళ్లు, రమ్య దృశ్యాలు, వింతలు, బాధారాహిత్యం, సుఖం, శాంతి ఉన్నాయని! కాలం గడిస్తే బ్రతుకు అంచుకు చేరి జారిపోవచ్చు. ఒక పాట ఆట పాడుకునేవాళ్లు చిన్నప్పుడు. "ఎంతెంత దూరం?" ఒకడడుగుతాడు.

"చాలా చాలా దూరం!" ఇంకొకడంటాడు. "అక్కడేముంది? " ఇలా సాగుతుంది.

సాధారణంగా అర్ధరాత్రి దాటిన తర్వాత నిద్ర మంచానికి అడుగు దూరంలో నిలబడుతుంది. పక్కవాళ్ల గోడ గడియారం- తనను శిలువ వేసినందుకో, కాలం గడుస్తున్నందుకో, గడవనందుకో- కాలాన్ని పన్నెండు సార్లు చావమోదుతుంది నిశ్శబ్దం సాక్షిగా. ఆ తర్వాత విసిగి, అలసి ఊరుకుండిపోతుంది. పావుగంట గడుస్తుంది. ఆ ఇల్లుగలాయన స్కూటరుమీద వస్తాడు. మూడుసార్లు స్కూటరు బజర్ నొక్కుతాడు. ఇంజను ఆపుతాడు. కాలింగ్ బెల్లు మూడుసార్లు మ్రోగిస్తాడు. అపుడు ఆయన భార్య "ఎవరూ? " అని రాగం తీస్తూ ప్రశ్నిస్తుంది. "కాంచనా, నేనే", అంటాడు. అర్ధరాత్రి అంకాళ్లమ్మ సేవ. ఆ తంతులో ఏదీ పొల్లు పోకూడదు. పోతే తలుపులు తెరుచుకోవేమో. విరామమెరుగని నగ్న నృత్యం చేస్తుంది కాంచన ఆ ఇంట్లో ఘల్లుమంటు, అది లక్ష్మీదేవి బందీఖానా. ముఖ్యంగా రాత్రిపూట ఆ ఇల్లు అలీబాబా కథలోని దొంగలగుహ. కాంచనగారి మామగారున్నాడు. ఆయన "ఎవర్రా ఆ బీరువా తీసేది? " అని పలువరిస్తుంటాడు. కొందరి పలువరింతలు కూడా వాళ్లు కోరుకునేవిధంగా, ఉపయోగపడేవిధంగా వస్తాయి. పసిడికి మనుషులే కాదు, ఇతరములైనవీ బానిసలే.

పై దినవారీ నాటిక అయిన తర్వాత, ముసలాడు పలవరించి లఘుశంకకు లేచి ఆ పని గోడకు ఆనుకుని పారే మురికికాలువలో శబ్దం చేస్తూ కానిస్తున్నపుడు కళ్లు మూతలు పడతాయి. అలానూ నిద్ర దరిచేరకపోతే, "కాసేపట్లో సూర్యోదయం అయిపోయేట్లుంది" అనుకుంటూ చీకటిని చూసి నిట్టూరుస్తాడు. "పోనీ కనీసం పగలు ఆరంభమవుతుంది మరికొంత సేపట్లో", అని సూర్యోదయానికై ఎదురుచూపులు చూస్తున్నపుడు కళ్లను మూస్తుంది నిద్ర, ఏడిపించింది చాలు అన్నట్లు.

నిద్రలేస్తాడు.

టయిం ఎంతయ్యిందో తెలీదు. ఆఫీసు వేళ మాత్రం అయివుండదని తెలుసు. ఆఫీసుకు వెళ్లటమనే అవసరం లేకపోతే కాలంతో పనే వుండదు. చలికాలమైతే దుప్పటి గొంతుదాకా లాక్కుని వెచ్చగా, హాయిగా మరికొంతసేపు పడుకుండిపోతే పోతుంది అనుకుంటాడు.

కానీ పడుకోలేడు. లేవనూ లేడు. ఊం అని మూలుగుతాడు. అది ఏ శారీరక బాధనో వ్యక్తం చేసేది కాదు. నిస్పృహని వ్యక్తం చేసేది కావచ్చును. అశక్తతను వ్యక్తం చేసేది కావచ్చును. ఎవరికి వ్యక్తం చేసేది? ఎవరి ముందన్నా వ్యక్తం చేస్తే వాళ్లు చేసే, చేయగల సాయం ఏముంటుంది? ప్రస్తుతం తనకై తను వ్యక్తం చేసేది తనను తను ఓదార్చుకోవటానికి!

ఒకానొకప్పుడు అది మరొక వ్యక్తిని ఉద్దేశించడానికి ఉపయోగపడేది. ఓదార్పు గురించి కాదు. నిద్ర లేచాను అని ప్రకటించడానికి. ఆ ప్రకటన కాని ప్రకటన వినంగానే "కాఫీ తెమ్మంటావా, నాయనా? " అని, తన సమాధానానికి ఎదురుచూడకుండా తెచ్చి ఇచ్చి "ఇక లేచిపో, నాయనా మళ్ళీ ఆలస్యం అయిపోతుంది నీకు," మేలుకొల్పు పాడేది తల్లి. కొడుకు వివాహం తదుపరి చావుకు ముహూర్తం పెట్టుకుంది. చూచింది, వేచింది. చూచింది చాల్లే అని చావు పిలుచుకెళ్ళింది. ఆమె పోయి అప్పుడే సంవత్సరం గడిచింది. ఆమె వయసు ఏం మీరిందని? తమ్ముడు ఏ వయసు మీరిందని పోయాడూ!

మొత్తమ్మీద కళ్లు తెరచి లేవటానికి ఉపక్రమించే ముందు రాత్రి మంచం దగ్గిరగా పెట్టుకున్న బల్లమీది ఆంగ్ల దినపత్రిక తీసి

వెల్లకిలా తిరిగి కళ్లకు దగ్గరగా ఉంచుకుని ప్రింటు వాసన పీలుస్తూ చదువుతాడు, నిన్న చదవకుండా మిగిలిపోయిన వార్తలు. లేచి టేబులు దగ్గరకెళితేనే గాని కళ్లజోడు దొరకదు. అది యోజనాల దూరంవున్నట్టనిపిస్తుంది. తనలో యోజనాల దూరం నడచిన బడలిక, కళ్లజోడు తన దగ్గిర బల్లమీద ఉంచుకుంటే చెయ్యో, కాలో తగిలి క్రింద పడి పగిలి ఊరుకుంటుంది. గతంలో అలానే జరిగింది. "గంట సరిపోతుంది ఆఫీసుకు" అనుకుంటూ అర గంట ముందు ఉపక్రమిస్తాడు. రోజూ ఆలస్యం, తొందర.

నిన్నరాత్రి-

రాత్రంతా ఒకటే ఆలోచన. అర్థరాత్రి కాంచన భర్త ఆగమనానికి ముందే నిద్రపట్టింది. అరగంట నిద్రలో గడిపి ఉంటాడు. పసిడి కుటుంబపు తంతు పూర్తయిపోయిుంటుంది. కిటికీలోంచి పిల్లి దూకుతూ దాంట్లో పెట్టిన అద్దం క్రిందపడేసింది. ఉలిక్కిపడి లేచి, గాభరాపడ్డాడు- ఏదో ప్రళయం వచ్చినట్లు, జనం కకావికలైపోతున్నట్లు, తనూ ప్రాణాలు కాపాడుకోవడానికి కాళ్లకు బుద్ధిచెప్పాలన్నట్లు. పిల్లి అరిచింది. తను చేసిన ఘనకార్యమే అది అన్నట్లు. ఈ లోకంలోకి వచ్చాడు. అద్దం పగిలి ఉంటుందని అర్థమయింది. "రేపు పొద్దునే ఇది జ్ఞాపకం పెట్టుకోవాలి. మరచిపోయి, నిద్రమాపులో కాలేసేనంటే ఇంతే సంగతులు, చిత్తగించవలెను". ఆ తర్వాత తనను అవమానించినట్లు నిద్ర రానంది, మారాము చేసింది. "చావు!" అన్నాడు. "నేను చస్తే, నేను లేక మీరంతా చస్తారు" అనింది. "నీవు ఉండీ రాకుండా చంపుతున్నావ్, నీ ఉంటేనేం చస్తేనేం' అన్నాడు.

**"అట్లాంటి పని చేయకూడదు. కానీ జీవితం ఎలా ఏడిపిస్తే అలానే ఏడిపించనీ, ఎక్కడికి తీసుకెళితే అక్కడికే తీసుకెళ్లనీ. అనుభవిస్తున్న ఈ జీవితమే మేలు కొత్త జీవితము కంటెన్," అని సర్ది చెప్పుకొని నిద్రకుపక్రమించాడు.**

కాంచన ఇంట్లో పాత గడియారం పన్నెండుసార్లు [illegible]మంది. ఆ తర్వాతి ఆనవాయితీలన్నీ జరిగిపోయినాయి. నిద్ర మారాము చాలించలేదు. "పోనీ ఆ పని చేస్తేపోతుంది" అనుకున్నాడు. వెంటనే, "అట్లాంటి పని చేయకూడదు. కానీ జీవితం ఎలా ఏడిపిస్తే అలానే ఏడిపించనీ, ఎక్కడికి తీసుకెళితే అక్కడికే తీసుకెళ్లనీ. అనుభవిస్తున్న ఈ జీవితమే మేలు కొత్త జీవితము కంటెన్," అని సర్ది చెప్పుకొని నిద్రకుపక్రమించాడు. అది కాసేపు పట్టి, వెంటనే ఎవరో తట్టి లేపినట్లు మెళకువ వచ్చింది. తలుపు తీసుకుని వెళ్ళి వీధి మెట్ల మీద కూర్చున్నాడు. చరమాంకంలోని పాలిపోయిన వెన్నెల. కాలువ కంపు. తనకున్న రోగంతోనే అదీ బాధపడుతోందేమో. వీధి శునకం కాస్తంత దూరంలో కూర్చుని మొరుగుతోంది లోపలికి పొమ్మన్నట్లు, రాత్రికి తాను రాజున్నన్నట్లు. కంపు బాధ, కుక్క అరుపులు భరించలేక లోపలికొచ్చాడు. అప్పుడూ గదినిండా చీకటి, నిశ్శబ్దం, ఒంటరితనం, ఒక జీవితపు బరువును ఒక రాత్రి మోసి వున్నప్పటి అలసట. ఒళ్లు విరుచుకుంటున్న జ్ఞాపకాలు.

"రేపు ఆ పనిమీద వుంటా" అనుకున్నాడు. అరగంటకు నిద్రపట్టింది, అతను పెళ్లి నిర్ణయం తీసుకోవటం కొరకే ఇంతవరకూ వేధించినట్లు.

ప్రొద్దునే నిద్రలేచాడు. ప్రక్క బల్ల మీది పేపరు తీశాడు. రాత్రికిచ్చిన మాట నిలబెట్టుకోదలచినట్లు, రాజకీయపు రొచ్చు కంపులోకి, హత్యల్లోకి, అత్యాచారాల్లోకి, నాయ

కుల పత్రికా ప్రకటనల్లోకి, ప్రత్యర్థుల ప్రతి విమర్శల్లోకి, క్రీడలలోకి తలదూర్చకుండా నేరుగా వివాహ ప్రకటనలోకి చూపుసారించాడు.

ఎమ్మే చదువుకున్న, సిటీ కాలేజీలో పని చేస్తున్న 29 సంవత్సరాల హరిత గోత్రపు అయ్యర్ల అమ్మాయికి వరుడు కావలెను.

158 సెం.మీ. పొడవున్న, ఫస్టుక్లాసు పట్టభద్రురాలైన నాయర్లమ్మాయికి "మంచి" సంబంధం కావాలి. బరువు బాధ్యతలుండకూడదు.

అమెరికా వరుడికి అర్జంటుగా వధువు కావాలి. పెళ్లి నెలరోజుల్లో ముగించుకొని వచ్చిన చోటుకి తిరుగు ప్రయాణం కట్టాలి. భారతదేశంలోనే మంచి ఆదాయం తెచ్చే పొలాలు, గిలాలు; అమెరికాలో డాలర్లు, గీలర్లు తెచ్చే ఉద్యోగం, సద్యోగం వున్నాయి. వధువుకు 39 సం॥ ఉన్నా అభ్యంతరం లేదు.

గుమ్మం ముందు అలికిడయింది. పక్క పోర్షన్లో ఆమె పిల్లలను బడికి సాగనంపుతున్నట్లుంది. పేపరు పక్కన పెట్టేశాడు. ఒకవేళ పిల్లలు లోపలికొచ్చి తను చేస్తున్న పని చూస్తారేమోనన్నట్లు. వాళ్ళు వెళ్లిపోయిన తర్వాత ఆమె గడియ వేసి వెనక్కు వెళుతున్నట్లుంది. నెల రోజుల క్రితమే ఆ కుటుంబం ఇక్కడ చేరారు. మరో నెలలో ఇంకొక ఇంటికి మారుతారు. "తెలిసినవాళ్లెవరో ఈ కొంపను చూచి పెట్టారండి. పై ఊరు నుంచి వస్తున్నాం కదా, మరోమార్గం లేక చేరాం" అంది. ఆమె ఇంట్లో చేరిన రోజే. పిల్లల చేత "అంకుల్‌కి నమస్తే చెప్పండ్రా", అని నమస్కారం పెట్టించింది ఒకనాటి రేడియో అక్కయ్యలా. భర్త మాట్లాడుతున్నప్పుడు చేతులు పిసుక్కుంటుంటాడు. 'తమతో మాట్లాడటానికి కూడా నేను తగను, తమతో మాట్లాడటమనే క్షమించరాని తప్పిదానికి నేను సిగ్గుపడుతున్నాను, బోలెడు పశ్చాత్తాపపడుతున్నాను' అన్నట్లుంటుంది మాట్లాడినంతసేపు అతని ధోరణి. ఆమె ధోరణి పాపం, పుణ్యాం, సిగ్గు, పశ్చాత్తాపాలెలా ఉంటాయో తెలీనట్లుంటుంది. వాళ్లిద్దరూ గుణాల మార్పిడి చేసుకున్నారా అనిపించేట్లుంటుంది. ఇద్దరిదీ అందమైన జంట. వాళ్లది ఆదర్శ కుటుంబం; వివాహాన్ని కుటుంబ వ్యవస్థని వ్యతిరేకించే వాళ్లకు చూపించటానికి.

> **కాలేజీలో పనిచేస్తున్న 29 సంవత్సరాల హరిత గోత్రపు అయ్యర్ల అమ్మాయికి వరుడు కావలెను. 158 సెం.మీ. పొడవున్న, ఫస్టుక్లాసు పట్టభద్రురాలైన నాయర్లమ్మాయికి "మంచి" సంబంధం కావాలి. బరువు బాధ్యతలుండకూడదు.**

పక్కన పెట్టిన పేపరు మరొకసారి తీసి మరో రెండు సంబంధాలు చూసి క్రింద పడేశాడు. తనకు ఎలాంటి సంబంధం కావాలో తనకే తెలీదు. మరి ఎందుకు చూస్తున్నట్లు. మరో మానవాకారం ఉంటే ఒంటరితనం నుంచి, రాత్రుల బారినుంచి తప్పించుకోవచ్చు. ఆశలు, అత్యాశలు, వేరే కోర్కెలూ లేవు. దూరపు బంధువు వెంకటాచలపతిగారని ఒకాయన ఉన్నాడు. ఎపుడు తారసపడ్డా, "అబ్బాయ్! బెండకాయ, బ్రహ్మచారి ముదరకూడదురా. నీవు ఊఁ అంటే 'మంచి' పిల్లను తెస్తా, పెళ్లి చేసుకుని సుఖంగా ఉండు" అని పోరుతుంటాడు. ఆయనతో "ఊఁ" అంటే సరిపోతుంది. పేపర్ల ద్వారా సంబంధం కుదరటం కష్టం.

మంచం మీదినించి లేచి జాగ్రత్తగా అడుగులువేస్తూ వెళ్లి, మూలనున్న చీపురు అందుకొని అద్దం ముక్కలన్నీ ఒక మూలకు తోశాడు. కాలకృత్యాలు మొదలు

పెట్టాడు. ఆర్థికంగా పరిస్థితి కాస్త మెరుగయింది. అన్ని సౌకర్యాలున్న, శుభ్రమైన పరిసరాల ఇంటికి మారాలనుకుంటున్నాడు. బద్ధకం అడ్డొస్తోంది. ఈ మధ్యతరగతి మురికివాడలోనూ ధనవంతులున్నారు, ఆధునిక సదుపాయాల భవంతులున్నాయి. తరాలుగా వస్తున్న ఇళ్లు కాబట్టి ఆర్థిక, సాంఘిక స్థాయిలు పెరిగినా ఈ ప్రాంతాన్ని అట్టిపెట్టుకునే ఎక్కువ మంది ఉండిపోతున్నారు. ఇదే ఇంట్లో మరో రెండు కుటుంబాల వారున్నారు. అంత దగ్గిర దగ్గిరగా వసించటం వల్ల అయి వుంటుంది వాళ్ల మధ్య పొత్తు లేదు. తనున్న భాగానికి సంబంధించిన స్నానాల గదికి వెళ్లాలంటే బావి మీదుగా వెళ్లాలి. దానికి మరొకరి స్నానాల గది దారి. దానికి అటుపక్క తలుపులేసుకుని ముసలి, ముతక ఒక్కోసారి బావి దగ్గిరే స్నానం కానిస్తుంటారు. పూర్తి సదుపాయాలు కావాలంటే ఈ ఇల్లు కూల్చి కొత్తది కడితేనే గాని సాధ్యపడదు.

అభిమన్యు వెళ్లేసరికి బావి ముందరి స్నానాల గది తలుపులు దగ్గిరగా వేసివున్నాయి. ఈవేళకి అందరి స్నానాలు ముగుస్తాయి. బాగా పొద్దెక్కిపోయింది. కార్యాలయానికి ఆలస్యం అయిపోయేట్లుంది. వెంకటాచలపతిగారు ఊళ్లో వున్నారో లేదో కనుక్కోవాలి ఫోను చేసి. తలుపుమీద చేయి వేసి తోశాడు. తేలిక తలుపది. గట్టిగా తోసినట్లున్నాడు బార్లా తెరుచుకుంది. తలుపు తోస్తున్నపుడు అవతలివైపు నీళ్ల శబ్దం, అలికిడి గమనించ లేదు.

పొరపాటు జరిగిపోయింది. ముందుకు వెళ్లిపోవాలో, తలుపు మూసి వెనక్కు వచ్చేయాలో నిర్ణయించుకోలేకపోయాడు. అలాగే నిలుచుండిపోయాడు. కళ్లుమూసి ఉంచాలో తెరిచి ఉంచాలో అర్థం కాలేదు. ఆ దృశ్యాన్ని చాలా కొద్ది క్షణాలు చూశాడు. ఆ క్షణాల కాలంలో చూచినది యుగాల కాలం చూచినంతగా, స్పష్టంగా అతని మస్తిష్కంలో ముద్రవేసింది. అది వింత దృశ్యం కాదు. అది మానవ శరీరమేగాని వింత ప్రాణిదికాదు. అనుకోకుండా జరిగిన ఆ సంఘటనకు అవాక్కయ్యాడు.

ముప్పై అయిదు సంవత్సరాల ఇద్దరు పిల్లల తల్లిది అందమైన ముఖం. తల మీది నుంచి నీరు ధారగా కారుతోంది. బావి నుంచి తోడుకుని బాల్చీతో నెత్తిమీద వొంపుకున్న నీరు. భుజాలు, వీపు ఆక్రమించిన నల్లజలపాతం లాంటి జుత్తు. స్ఫుటంగా, వికారంగా కనిపించే, సైకిలు టైర్లు చుట్టినట్లున్న ముడతల నడుము-కొవ్వు దాచుకుని సాగి వేలాడుతున్న కడుపు. అస్తవ్యస్తపు కటిభాగం.

ఆమె అతన్ని చూసి పక్కనున్న చీర మీదికి లాక్కుని కూర్చుండిపోయింది. "క్షమించండి, పొరపాటు జరిగింది" అని తలుపు మూసి ఇంట్లోకి వచ్చేశాడు. కాళ్లు వణికాయి. కుర్చీలో కూర్చుని భజగోవిందం జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

నారీస్తన భర నాభీ ప్రదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏత న్మాంస వసాది వికారం
మనసి విచింతయ వారం వారం

ఆరోజు సాయంత్రం మెయిన్ రోడ్డంతా తిరుగుతున్నాడు జీవితభాగస్వామి తప్పిపోయినట్లు. నడ్డి విరుచుకుని బాన కడుపులు వేసుకుని కాళ్లు ఎడమ చేసి ఈసురోమని నడిచేవాళ్లు. పిల్లల కోళ్లలాంటి తల్లులు. భార్యలకు నౌకర్లలా వాళ్లకు వెనకో ముందో నడిచే భర్తలు. చంటిపిల్లల చీమిడి ముక్కులు తుడిచే తల్లిదండ్రులు. రోడ్డంతా వీళ్లతోనే నిండిపోయిందేంటి ఈరోజు. తనకు ఏదన్నా సందేశం ఇవ్వటానికి అందరూ తరలివచ్చారా?

ఆరోజు ప్రొద్దున వెంకటాచలపతిగారికి ఫోను చెయ్యాల్సింది, చెయ్యలేదు.

రాత్రి నిద్రకు ఉపక్రమించబోయాడు. ఆ శ్లోకం గుర్తుకొస్తోంది, ఆదర్శ జంటలోని ఆమె శరీర చిత్రం చెరగలేదు. గతంలో జీవితపు కష్టాల, నష్టాల ఒక వృత్తం పూర్త యిపోయింది. మరొకదాన్ని కొత్తగా మొద లుపెట్టగల ధైర్యం, ఓపిక తనలో ఉన్నట్లు కనబడటం లేదు.

పెళ్లి ప్రతిపాదన మానుకున్నాడు. నెత్తి మీది నుంచి బరువు దించినట్లయింది. నిద్రపట్టింది.




విక్టోరియా మహారాణి చాలా ఠీవిగా నిలబడి ఉంది. తన ప్రజలను మందలిస్తు న్నట్లు, వాళ్లకు ఏవో ఆదేశాలిస్తున్నట్లుగా కూడా వుంది. రాణి కాబట్టి నెత్తిమీద కిరీటం ఉంది. ఆమె ఝాన్సీరాణి కాదు కావున ఆమె దగ్గర కత్తి లేదు. కత్తెం దుకూ? తన ప్రాణాలకు ముప్పున్నపుడు కదా. తనను రక్షించటానికి సైన్యం లేన పుడు కదా. "రవి అస్తమించని" సామ్రాజ్య రాజులు, రాణులు ఠీవిగా కాక దీనంగా ఉంటారా? ఠీవినంతా పాలకులు, దైన్యా న్నంతా పాలితులు పంచుకుంటారు.

ఈ ప్రాంతంలోనే ఆంగ్లేయులు కోట కట్టుకున్నారు ఒకప్పుడు. దేశవాళీ శత్రువు లనించే కాక అప్పటి ఫ్రెంచ్, డచ్ శాత్రవుల నుంచి రక్షణకు కోటలు అవ సరం. పైవాళ్లయితేనేం మన పాలకులు కదా అని భక్తిశ్రద్ధలతో ఎ.వి.జగ్గారావు అనే జమీందారు 1904 సంవత్సరంలో దాన్ని ప్రతిష్ఠించాడు. తెల్లవాడంటే మనకు ఇష్టం ఉండొచ్చు లేకపోవచ్చు, అది వేరే విషయం. విగ్రహం మాత్రం చక్కనిది.

నగరపు ఈ భాగం మొదట ఏర్పడింది. విదేశ పాలన నాటి కలెక్టర్ ఆఫీసు ఇక్కడే ఉన్న ఒక కట్టడంలో 1815 దాకా ఉండేది. దాని సమీపంలో న్యాయస్థానం. దక్షిణం దిక్కున సముద్రానికి కూతవేటు దూరంలో కోటను తలపింప చేసేట్లుండే రాతి కట్టడం 1847వ సంవత్సరంలో ఆరంభించిన సెయింట్ అలోషియస్ పాఠశాల భవనం. ఆ భవన సముదాయంలో రోమన్ కాథ లిక్ ఛాపెల్ వుంది. అలనాడు కట్టబడిన అతిపెద్ద గోథిక్‌శైలి రాతికట్టడాల్లో ఇది ఒకటి. రెండవది నేటి కలెక్టరు కార్యాలయ భవనం. ఇది 1865లో మొదలుపెట్టి 1914కి పూర్తిచేశారు.

దీన్ని లయ, సమతుల్యాలు పాటించి నిర్మించారట. దాని నిర్మాణంలో అవసర మైన స్టీలు ఇంగ్లాండు నుంచి రప్పించారు.

రోజూలాగే దొరసాని విక్టోరియా విగ్రహం దగ్గిర నిలబడ్డాడు. కాసేపటి తర్వాత ఆమె ఏదో ఆదేశం జారీచేసినట్లు అక్కడి నుండి పాదయాత్ర మొదలుపె ట్టాడు. ఇక్కడి నుండి సెయింట్ ఆంటోనీ బడిదాకా వెళతాడు. ఇక్కడి నుంచి అక్క డికి ఏదో వార్త చేరవేయటానికన్నట్లు. అక్కడ వెనక్కు మళ్ళుతాడు, జనసము ద్రాన్ని ఈదుతూ ఇల్లు చేరటానికి. మెయిన్ రోడ్డు ఈనినట్లుండే జనసందో హాన్ని చూడటం, వాళ్లను రాచుకుంటూ పూసుకుంటూ నడవటం ఒక్కోసారి వెగటు కలిగిస్తుంది. వెగటుదనమంటే ఏ మూలో ఇష్టమున్నట్లుంది. మనిషికి రెండే ప్రత్యామ్నాయాలు. ఒంటరిగా నాలుగు గో డల సమాధిలో గడపటం లేక తోటి మను ష్యులు గిట్టకపోయినా వాళ్ల మధ్య కాలం వెళ్లబుచ్చటం. ఒకటి విసుగనిపించినపుడు

రెండోది చేయటం కన్నా గత్యంతరం లేదు. "మనిషి సంఘ జీవి. సాటి మనుషులతో జీవనాన్ని పంచుకోలేనివాడు మానవాళికి పైస్థాయి వాడైనా అయి వుండాలి. దిగువవాడైనా అయి వుండాలి మృగమో, దేవుడో" అరిస్టాటిల్ అన్నాడట. తను మానవ లక్షణాలుగల మృగం, లేదంటే మృగలక్షణం గల మానవుడు. మానవ సమాజంలో ఇమడలేని తన స్థాయి నిస్సందేహంగా దిగువది.

తిరిగి తిరిగి ప్రొద్దుగడవక హిందూ రీడింగ్ రూం ఎదురుగావున్న చర్చి ముందు నిలబడ్డాడు. రీడింగ్ రూమ్ బాల్కనీలో రాజ్యాలను పందెం కాసినంత గాంభీర్యంతో కొందరు చదరంగం ఆడుతున్నారు. కొందరు బాల్కనీలోకి పత్రికలు తెచ్చుకుని ఒక కన్ను రోడ్డు మీద కూడా వేసి చదువుకుంటున్నారు. మరికొందరు బాల్కనీ రెయిలింగ్ మీద వాలి జనాన్ని ఆసక్తిగా చూస్తున్నారు. చర్చిలోకి నల్ల బౌండ్ల పుస్తకాలతో ప్రభువును కొలవటానికి వెళుతున్నారు. కార్మిక సంఘ భవనం ముందు ఎర్ర జెండాలు, బ్యానర్లు పట్టుకుని యాజమాన్యమనే పశువును రెచ్చగొట్టి వశం చేసుకోదలచుకున్నట్లు గుమిగూడుతున్నారు. ఆ పక్కనే ఉన్న బంగారం కొట్టు నిండా కిటకిటలాడుతున్న జనం. ఎన్ని వ్యాపకాలు! ఎన్ని పనులు! కాలం వాళ్లకు ఒక సమస్య కాదు. వాళ్లు ఎంచుకున్న వ్యాపకాలలో వాళ్లకెంతో ఆనందం కలుగుతున్నట్లుంది. ఎంతో ఆసక్తితో పనులలో నిమగ్నమై ఉన్నారు. వాళ్ల వాళ్ల ఉనికిని గురించి కాని, అశక్తతను గురించి కాని ఏ ప్రశ్నా వేదిస్తున్నట్లు లేదు. వెన్నంటి వేధించే జ్ఞాపకాలు ఉన్నట్లు కనబడటంలేదు. వాళ్లకు ఏదీ అర్థరహితం అనిపించదు. వాళ్ల కళ్లు, మనసు, హృదయం కొంతకాలం పాటన్నా అద్దెకు దొరికితే?

ఉన్నట్లుండి, అనాలోచితంగా, ఏదో పూనినట్లు రోడ్డు దాటాడు. హిందూ రీడింగ్ రూం రాతిమెట్లెక్కి, ఆర్చ్ దాటి, వరండా చేరి, ఎడమవైపు మేడమెట్లు ఎక్కటం మొదలుపెట్టాడు. బాల్కనీ చేరాడు. వాళ్లకు దొరికే ఆనందం తనకెందుకు దొరకదు? వాళ్ళు చేతనైనవాళ్లు. తను చేతకాని వాడూనా? . ఆ సామూహికానందంలో తనూ పాలుపంచుకుంటాడు ఒక హక్కు లాగా.

**"మనిషి సంఘజీవి. సాటి మనుషులతో జీవనాన్ని పంచుకోలేనివాడు మానవాళికి పైస్థాయి వాడైనా అయి వుండాలి. దిగువవాడైనా అయి వుండాలి మృగమో, దేవుడో" అరిస్టాటిల్ అన్నాడట. తను మానవ లక్షణాలుగల మృగం.**

రెండు బల్లల దగ్గిర ఇద్దరేసి కూర్చుని చతురంగ బలాలు నడుపుతున్నారు సేనా నాయకుల్లా. ఒక బల్ల దగ్గిర నిలబడ్డాడు. మూడో వ్యక్తి ఒకడి భుజం మీది నుంచి వంగి సూచనలు, సలహాలు ఇస్తున్నాడు. రెండవ ఆటగాడి దగ్గిరగా నిలబడ్డాడు అభిమన్యు. మూడో బల్ల ఖాళీగా ఉంది. సలహాదారుడు అభిమన్యు కేసి ఏదో మాట్లాడబోతున్నట్లు మూడు నాలుగు సార్లు చూశాడు. అభిమన్యు అతనివైపు చూడక పోవటం వల్ల, ఆటను దీక్షగా చూస్తుండటం వల్ల అతను నోరు మెదపలేదు. అభిమన్యు అతని ప్రయత్నాలు చివరకు గమనించాడు. అతని చూపుతో తన చూపు కలిపాడు.

"ఆడదామా, మాస్టారూ? "

"నాకంతగా రాదు"

"నాకూ ఆట అంతంత మాత్రంగానే వచ్చు. పేకాటకు మనుషులు దొరుకుతారు

కాని చదరంగానికి దొరకరు" అవతల వరండావైపు తల ఎగరేసి అన్నాడతను.

అతను నిజానికి అభిమన్యు కన్నా మంచి ఆటగాడే. ఆటలో నిమగ్నమవుతాడు. దాన్ని తపస్సుగా భావిస్తాడు. అతను ఆడుతున్నప్పుడు చూసేవాళ్లకు ఆ ఆట గెలుపు ఓటములు అతని జీవన మరణ సమస్యలా తోస్తుంది. ఆఫీసు అవగానే హిందూ రీడింగ్ రూంకి వచ్చి ఆటలో తల దూరుస్తాడు. ఏ ఎత్తూ ఉదాసీనంగా వేయడు. అతని పేరు చిదంబరం. వయసు యాభై ఉంటుందేమో. గడ్డం, మీసాలు, తల చింపిరిగా ఉంటాయి. ఎపుడన్నా చింపిరి తలకు కొబ్బరి చవురు పూసి అంట దువ్వుకుని వస్తాడు. "చిదంబరం, కొత్త సంచికలా ఉంటాడు. "చిదంబరం మంచి బాలుడు, దోమనైనా చంపడు' అనిపిస్తాడు. "గాంధీగారికి అహింస మీద పాఠాలు చెప్పగల పంతులులా ఉన్నారండి ఈ రోజు. పావులకు ప్రాణహాని లేనట్లేనా ఈ రోజు" అంటాడు అభిమన్యు. "పావులను చంపకుండా గ్రాండ్ మాస్టర్ల గ్రాండ్ మాస్టర్లు కూడా చదరంగం ఆడతారు కదండి" అని పావులు చంపేటప్పటి నవ్వు నవ్వుతాడు. "అయినా ఒక ఆటలో చచ్చిన పావులు రెండో ఆటలో బతుకుతాయి గదా"



అతనితో ఆట అవతలి వాడి ఓపికకు అగ్నిపరీక్ష. ఓపెనింగ్ గురించి ఆలోచించినంతగా జీవితంలో దేని గురించి ఆలోచించలేదని, ఒక్కొక్క ఓపెనింగ్‌కి ఒక్కొక్క వెంట్రుక నెరిసి వుంటుందని అంటాడు. అతి సమీప భవిష్యత్తులో ఓపెనింగులకి నెరవటానికి నెత్తిమీద నల్లజుత్తు దొరకదు. సాధారణంగా నల్లపావులతో ఆడతాడు. అది అతనికి 'కలిసొచ్చిన' రంగట. తన ఆట స్థితి బాగుంటే తనలో తనే నవ్వుకుంటాడు పెదవులు లోపలికి మడిచి. అతని వాలకం మొదట్లో వింతగొలిపింది. మొదటి పదిరోజులూ అతనే ప్రతి ఆట గెలిచాడు. పదకొండో రోజు ఎలాగైతేనేం రెండు ఆటలు అభిమన్యు గెలిచాడు. ఆ రెండుసార్లు చిదంబరానికి ముచ్చెమటలు పోశాయి. పిచ్చివాడు

ముఖంలో ద్యోతకమవుతుంది. చిదంబరేశ్వరుడి ఇంద్ర జాలంలో చిక్కుకుపోయిన తనకు, తన జీవితానికి అత నితో ఆటకు సరిహద్దు రేఖ



తనతో ఆడుతున్నాడో, తను పిచ్చివాడు కాబట్టి అతనితో ఆడుతున్నాడో.

అతనికి పావులు చంపడమంటే పైశా చిక ఆనందం. మృగయావేటలో జంతువు లను చంపుతున్నప్పటిది. ఇక్కడ చంపటా నికి వాడే ఆయుధాలు కేవలం మూడు వేళ్లు. ఏనుగు, శకటం, గుర్రంలాంటి పె ద్దబలాలను చంపుతున్నప్పుడు మొహం దేదీప్యమానంగా వెలిగిపోతుంది. మంత్రి దొరికాడో ఉక్కిరి బిక్కిరి అయిపోతాడు. ఇక జన్మ చాలించవచ్చు అన్న సంతృప్తి లేదు అనిపించటం మొదలయింది.

కొత్తల్లో అతని హావభావాలు పట్టించు కోలేదు. మనిషికొక తెగులు మహిలో సుమతీ అని సరిపెట్టుకున్నాడు. పైగా చిదంబరం అపరిచితుడు. వయసులో పెద్దవాడు. తల నెరిసినవాడు. ఓటములు ఎక్కువ కావటం, అతని తీరు తెన్నులు బాగా పరిచితాలవటంతో- ఎక్కువ పరి చయం ద్వేషానికి దారితీస్తుందన్నట్లు

(Familiarity breeds contempt)- అతనంటే ఏహ్యాభావం చోటుచేసుకుంది. ఇలాంటి ఆటలు అవతలి వాడి అహాన్ని దెబ్బతీసి స్వీయ ఆధిక్యతను ప్రదర్శించుకోవటానికి సులువైన అవకాశాలు.

ఆటలు ముగిసి, ఇంటికొచ్చి తొమ్మిదిగంటలప్పుడు భోంచేసి పడుకుంటున్నపుడు ఆటల్లో తన భావోద్రేకాలు అర్థరహితంగా తోస్తాయి. సిగ్గు వేస్తుంది. "పూర్ ఫెలో - ఆ విధంగా బలపం కట్టుకుని అక్కడా ఇక్కడా తిరిగే బదులు ఒక చోట కూర్చుంటే కాలక్షేపం అవుతోంది. గంటలు నిముషాల్లా దాటి పోతున్నాయి. ఈ ఓటమి తన అహాన్ని ఎందుకు బాధించి ఉక్రోషం కలిగించాలి. అవమానమేమిటి? జీవితంలో అలల్లైన ఓటములకు తన అహం దెబ్బతినలేదే. అడటం సరదా గురించే కాని ఉద్రేకాలు పెంచుకోటానికి కాదు కదా" తనకు తను హితబోధ చేసుకుంటాడు. తనను తను చూసి నవ్వుకుంటాడు. తనను తను చూసి సిగ్గుపడతాడు. అవన్నీ అయిన తర్వాత నిద్రకు ఉపక్రమిస్తాడు.

**ఈ ఓటమి తన అహాన్ని ఎందుకు బాధించి ఉక్రోషం కలిగించాలి. అవమానమేమిటి? జీవితంలో అలలైన ఓటములకు తన అహం దెబ్బతినలేదే. అడటం సరదా గురించే కాని ఉద్రేకాలు పెంచుకోటానికి కాదు కదా" తనకు తను హితబోధ చేసుకుంటాడు.**

ఏ రోజుకారోజు ఆట సమయానికి కుక్కతోక తీరే. తను చిదంబరం చేతిలో కీలు బొమ్మ.

ఒక రోజు - ఈ రోజు ఏమైనా ఆడకూడదు అని కుడిచేతిని ఎడమ చేతిలో ఉంచి ఒట్టుపెట్టుకున్నాడు. మనసు అసలే చికాకుగా ఉంది. ఆదివారం ప్రొద్దుటి నించి ఖాళీగా, బద్దకంగా గడిపాడు. సాయంత్రం అవగానే మెయిన్‌రోడ్డు చేరి తిరిగి, పాత పోస్టాఫీసు నుంచి వస్తూ రీడింగ్ రూం దాటుతున్నాడు. అటుపక్క చూడలేదు. చూస్తే బాల్కనీ అయస్కాంతంలా ఆకర్షిస్తుంది. చిదంబరం తన ఆనందానికి తనను పావుగా వాడుకుంటున్నాడా? తనకూ ఏదో ఆనందం దొరుకుతోంది.

అయినా తప్పించుకోలేక పోయినాడు. దొంగలా దొరికి పోయాడు. చప్పట్లు, పేరుపెట్టి పిలవటం వినిపించాయి. చిదంబరం కాక ఇంకెవరవుతారు? తల ఎత్తి చూశాడు. రెండు చేతులూ గాల్లోకి విసురుతున్నాడు, పందెంకాసిన గుర్రాన్ని రమ్మని పిచ్చిగా పిలిచేటప్పుడు విసిరే విధంగా. అది తను చూసిన తర్వాత పైకి రమ్మని సైగ చేశాడు. అభిమన్యు తల అడ్డంగా తిప్పాడు. అతను దీనంగా మొహంపెట్టాడు తనను ఎవరో దోచుకున్నట్లు. 'ఫర్వాలేదు పావుగంట ఆడి వెళ్లి పోదాం' అని అరిచి చెప్పాడు సైగలు మాని. పావుగంటలో ఎన్ని ఆటలు ఆడగలడోమరి. పావుగంటలో పావులని మాత్రం మింగవచ్చు. అయినా ఇదికదా ముఖ్యం. అభిమన్యు కాళ్లకి బంధాలు పడ్డాయి ముందుకు వెళ్లటానికి మాత్రం. నిద్రలో నడిచేవాడిలా నడిచాడు. ఏదో పూనింది.

దిక్కు మార్చాడు, రోడ్డుదాటాడు.

అటువైపు వెళితే చావు తథ్యం అని తెలిసీ కసాయివాడి వైపు ఆకర్షితమైన గొర్రెలా, ఆవులిస్తున్న ప్రవేశ ద్వారంలో నించి లోపలికి చూస్తూ బరువుగా మెట్లెక్కుతున్నాడు.

పురాణం పంతులు గారు దేవుడి దగ్గర కుందీ వెలిగిస్తున్నారు. శ్రోతలు కొందరు కూర్చుని ఉన్నారు. ఒకదాని మీదికి ఒకటి ఎక్కించిన పుస్తకాల పాత బీరువాలు. పై బీరువా పుస్తకాలు స్టూలు వేసుకుంటేగాని అందవు. ఆ పుస్తకాలు మనుషులకన్నా

పురుగులకు ఎక్కువగా ఉపయోగ పడుతు న్నాయి. ఆధునికతను దరికి రానీకుండా 'పాతివ్రత్యాన్ని' కాపాడుకుంటున్న భవనం. లోపల ఓ గంట గడిపి బయటికి వస్తే వంద సంవత్సరాల దూరపు గతం నించి వర్తమానంలోకి ఉన్నట్లుండి వచ్చిన ట్లుంటుంది. గోడలకు పూర్వీకుల ఛాయా చిత్రాలు. వారి ముఖకవళికలు ఇప్పుడు వచ్చిన మార్పులను గర్హిస్తున్నట్లుంటాయి, విచారిస్తున్నట్లు కూడా వుంటాయి.

"మా రోజుల్లోనైతే..." అని ఎత్తుకోబో తున్నట్లుంటారు. ఈ రీడింగ్ రూం గతంలో కూలిపోయేట్టుండే చిన్నకట్టడం. సర్ గోడె నారాయణ గజపతిరావు అనే జమీందారు, ఎదురుగా చర్చి ఉండటం చూసి హిందూమతాన్ని ప్రోత్సహించే నిమిత్తం 1917లో ప్రస్తుత రాతి కట్టడం నిర్మింపచేశారు.

బాల్కనీ చేరేసరికి ఇరుసైన్యాలని సమా యత్తపరచి ఆవురావురుమంటూ ఎదురుతె న్నులు చూస్తున్నాడు. "ఆలస్యం అయినం దున ఆకలి మరీ ఎక్కువయినట్లుంది. పావులనేగాక నన్నూ తినేసేటట్లున్నాడు ఈ దుర్మార్గుడు" అభిమన్యు అనుకు న్నాడు.

'మీరు వెళ్లిపోతే నా గతేం కావాలనుకు న్నారు? మిమ్మల్నే నమ్ముకున్న వాడినే. అరగంట నించి ఎదురు చూస్తున్నా అభి మన్యు నామస్మరణ చేస్తూ."

"తలనొప్పిగా, విసుగ్గా వుంటే..."

"వయసులో అవన్నీ సహజమైనవే. పెళ్లి చేసుకోండి.. అన్నీపోతాయ్"

"పెళ్లి తలనొప్పి తెచ్చే వ్యవహారం అని విన్నా కాని, అమృతాంజన సమానం అని వినలేదు."

"స్వానుభవంతో చెబుతున్నా. సరైన మనిషి దొరక్కపోతే అమృతాంజనం కూడా పనిచెయ్యదు. అది మాత్రం నిజం"

"పెళ్లి చేసుకుంటే చదరంగం ఆడుకోటా నికి మీకు నేను దొరకను"

## ఎవరు తింటేనేం?



ఉషశ్రీగారింట్లో దంపుడు బియ్యం వాడే వారు. ఆ బియ్యం అన్ని దుకాణాల్లో దొరికేవి కావు. విజయవాడలో విజయాటాకీస్ దగ్గర ఓ దుకాణంలో లభించేవి. ఓరోజు ఓ రిక్షావాడు 'అయ్యగారు పంపారమ్మా' అంటూ ఓ బస్తా బియ్యం ఇంట్లో దింపి వెళ్లాడు.

ఆయన ఇంటికి వచ్చాక కూతుళ్లు 'నాన్నా! ఆ రిక్షా అతను తెలిసిన వాడేనా? బస్తా బియ్యం నమ్మకంగా పంపావు..' అన్నారు.

దానికాయన 'తెలియడం ఎందుకమ్మా? నమ్మకంగా పట్టుకొస్తే మనం తింటాం. లేక పోతే అతనింట్లోవాళ్లు తింటారు. ఎవరైనా తిండానికేగా?' అన్నారు తేలికగా. తోటిమను షుల్ని నమ్మకపోతే ఎవర్ని నమ్ముతామనేది ఆయన వాదన.

[redacted]

"మిమ్మల్ని కొద్దిరోజులు వదులుకోవటం అనే త్యాగం చేస్తా. ఆ పిదప మీ ఇంటికే తయారవుతా. ఆటతోపాటు టీ సౌకర్యం కూడా ఉంటుంది. టీలో ముంచుకుని పావులు తినొచ్చు"

"ఇదేంటి? రవి తూర్పున అస్తమిస్తు న్నాడా?"

"దిక్కులేని వాడిని, దిక్కులుకూడా తెలి యని వాడిని. నాకెలా తెలుస్తుంది? రోజూ మీరు దెబ్బలాడుతున్నారుగా నల్ల పావుల మీద ఆ మక్కువేంటి అని. మార్పు గురించి ఈ రోజు తెల్లపావులతో ఆడతా. ఎప్పుడూ డిఫెన్సివ్‌గా ఎందుకుం డాలి. ఈ రోజు అఫెన్సివ్‌గా ఉంటా... ఇదిగో నా మొదటి ఎత్తు 'మీరు ఎత్తు

ఎత్తేసరికి క్షవరం చేసుకుని వచ్చిన గడ్డానికి వెంట్రుకలు మొలుస్తున్నాయని, నెత్తి మీద సాలెపురుగు గూడు అల్లుకుని సెటిలయిపోతుందని' ఎత్తి పొడుస్తుంటారు గదా"

"రాత్రంతా ఈ ఓపెనింగ్ ఆలోచించి ఉంటారు. ఒట్టెయ్యండి, కాదని"

"అబ్బే లేదు. మంచం తాకితే నిద్ర, గురక ఒకదాని తర్వాత మరొకటి తరుముకుంటూ వస్తాయి. ముసలితనం వైపు అంగలేస్తున్నా కదా," పావును చంపేటప్పటి నవ్వు నవ్వాడు నవ మోహనాంగుడు.

మొదటి ఆట అభిమన్యుకు అనుకూలంగా నడుస్తోంది.

"బాబోయ్! ఈ రోజు వెర్రిగా ఆడేస్తున్నారే. మీకు తలనొప్పి వచ్చినప్పుడు మీతో ఆడకూడదన్నమాట. సారూ! ఇదిగో పద్మవ్యూహం పన్నేను, ప్రవేశించండి"

"నన్ను కావాలని ప్రవేశించి పరమపదించ మంటారా? "

"మీరు ప్రవేశించకపోయినా నిజానికి అది మీ చుట్టూ ఏర్పడిపోయి వుంది. దాంట్లో ప్రవేశించటం మానటం మీ చేతుల్లో లేదు."

"అయితే నాకు మరణం తథ్యం."

'పోరాడండి వీరస్వర్గం దక్కుతుంది కనీసం"

"స్వర్గం ఉందో లేదో ఎవడికి తెలుసు. తెలియని దాని గురించి చావటం ఎందుకు? "

"పోరాడకపోయినా శత్రువు కనికరించి వదిలిపెట్టడు"

"చావు ఎలాగూ తప్పనపుడు పోరాటం వృథా శ్రమ"

"మీరు వీరాభిమన్యు కాదా? "

"నేతి బీరకాయని"

ఏనుగు లాభంలో ఉన్నాడు అభిమన్యు. చిదంబరం రాజీనామా చెయ్యాల్సిన ఆట. కానీ ఇరువురూ ఎప్పుడోకాని ఆ పని చెయ్యరు, ఒకరి ఏమరిపాటు మీద మరొకరు ఆశ పెట్టుకుని.

మోచేతిని బల్లమీద ఆనించి, అరచేతిలో గడ్డాన్ని వుంచి ఆలోచిస్తున్నాడు చిదంబరం. కణతల వెంబటి చెమటల ధారలు. అతన్ని బాధించటం ఎందుకు స్వచ్ఛందంగా ఓడిపోదామనుకుని, మానుకున్నాడు పున్నమి కొకసారి గెలిచే ఆట ఎందుకు ఓడటం అని.

అనాలోచితంగా, శని ఆవహించినట్లు ఏనుగును కదిపాడు. గుర్రం నెత్తిమీద చూపుడు వేలుతో తట్టాడు చిదంబరం. అర అంగుళం పొడవుంది గోరు. దాన్నిండా మకిలి. గుర్రానెత్తి ఒక గడిలో పెట్టాడు. పెదవులు మడిచాడు. "గురువుగారూ, రాజును చూసుకోండి," అనటానికి ఒకసారి పెదవులు విప్పాడు. ఏనుగుకు రాజుకు ఫోర్కు పడింది. ఏనుగును భక్షించాడు సింహంలా. తర్వాత పులయిపోయాడు. చెస్ బోర్డంతా రక్తసిక్తమయింది. కొద్దినిముషాలలో చిదంబరం గెలిచాడు, దక్కడానికి సామ్రాజ్యం లేదుకాని.

మరో ఆట మొదలుపెట్టారు. అరగంటలో అయిపోయింది. అభిమన్యు ఓడిపోయాడు. మూడో ఆట మొదలయింది. మూసిన చిదంబరం పెదవులు అలానే ఉండిపోయాయి పక్షవాతం వచ్చినట్లు. అభిమన్యుకు తలనొప్పిగా ఉంది. యాంత్రికంగా ఆడుతున్నాడు. ఈ ఆటతో కట్టేద్దామని ఉంది. మరో పక్క గెలిచేంతవరకు ఎన్ని ఆటలైనా ఆడుతూ పోవాలని వుంది. చిదంబరం రక్తం రుచిమరిగాడు. మంత్రిని ట్రాప్ చేశాడు చిదంబరం. మనసు లగ్నం చేయలేకుండా ఉన్నాడు అభిమన్యు. లేచి పోదామంటే అశక్తత, ఏదో కసి, పట్టుదల. మంత్రిని మింగేశాడు చిదంబరం. ఆట కొనసాగించటం వృథా. అయినా కొనసాగిస్తున్నాడు అభిమన్యు. ఎలాంటి హింసకు

పాల్పడకుండా ఆట కట్టివేయవచ్చు. కాని అనవసరంగా అందిన పావును అందినట్లు చంపి పక్కన పడేస్తున్నాడు చిదంబరం. అది ఫార్స్, చెస్సో ఇద్దరికీ అర్థం కావటం లేదు.

కోపం కట్టలు తెంచుకుంది. ఉక్రోషం వెల్లువైపారింది. కుర్చీలో నించి తేలుకుట్టి నట్లు లేచిపోయాడు. ఆ ఉద్రేకానికి అర్థం లేదు. ఆ ఓటముల వలన జరిగే నష్టం లేదు. విజయాల వలన అవతల వ్యక్తికి ఒరిగేది లేదు. విచక్షణా జ్ఞానం నశిం చింది అభిమన్యుకి.

"ఛీ ఛీ, మీతో ఆడటం కంటే బుద్ధి తక్కువ మరొకటి లేదు," అన్నాడు.

"అభిమన్యుగారూ, అభిమన్యుగారూ! ఉద్రేకపడకండి. ఇది కేవలం కాలక్షేపానికి ఆడుకుంటున్నది" బ్రతిమిలాడుతూ చిదం బరం అభిమన్యు చేతులు పట్టుకోబో యాడు. అతను విదిలించి కొట్టాడు. బోర్డు మీది పిక్కలను చిందర వందర చేశాడు. మెదడుల వ్యాయామ స్థలం కాస్తా రణరం గంగా సమాప్తమయింది.

వరుసగా రెండు రోజులు రీడింగ్ రూం వైపు అభిమన్యు వెళ్లలేదు.




చదరంగం ముచ్చట ఆ విధంగా ముగి సిన మరుసటిరోజు బీచ్‌రోడుమీదుగా సెయింట్ అలోషియస్ స్కూలు దాకా నడిచి అక్కడ మలుపు తిరిగి పోస్టాఫీసు కూడలికి వెళ్లి, గోడెవారి వీధిపట్టి ఇంటికి చేర నిశ్చయించాడు. ఆ దారి పట్టటం ద్వారా మెయిన్ రోడ్డు, హిందూ రీడింగ్ రూమును తప్పించవచ్చు. ఎన్నిరోజులు అటుపక్క వెళ్లకుండా ఉండటం సాధ్యపడు తుందో తెలీదు. దొంగలా మొహం చాటె య్యటమేంటి?

బ్రాహ్మణ అగ్రహారం మీదుగా బీచ్‌రోడ్డు చేరాడు. చేపల కంపుతో ముక్కు పగిలిపో తోంది. బీచ్ పొడవూ చేపల రేవు ఆక్ర మించింది. సాగర దృశ్యం కానరాదు. కడుపుకింత తిండి ముఖ్యం తర్వాతే మిగ తావన్నీ.

పాతపట్నానికి చేరువగా ఉండేది సముద్రం. ముందుకొస్తూ తీరాన్ని కాస్త కాస్త తింటుండేది. పాత బీచ్‌రోడ్డును మూడొంతులు తినేసింది, ముఖ్యంగా పాతలైట్ హౌస్, మెరీనా హోటల్ ప్రాంతంలో. మినర్వా టాకీసు ప్రాంతంలో కాస్త దూరంగా ఉండేది. ఆకాశం, సము ద్రాలను దూరపు డాల్ఫిన్ కొండను చూస్తుండే వాడు ఇసుకలో కూర్చుని. ఇసు కలో ఆరెస్సెస్ కుర్రాళ్లు కవాతులు చేస్తుం డేవాళ్లు. ఇసుకలో అలసట తీర్చుకునే చేపల పడవలు. ఆరేసిన వలలు, చేపలు. ప్రకృతి అందాలతో పనిలేని జాలర్లు తెగి పోయిన వలలు బాగు చేసుకుంటుండే వాళ్లు గోచీలు పెట్టుకుని, నిగనిగలాడే నల్లటి శరీరాలతో. సముద్రపు అంచు పొడువునా వంపులు తిరిగిన ఇసుకమేట. దానిమీదికి అనుక్షణం ఉరకలు తీసి వెనక్కు పోయే నురగల అలలు. ఇసుక లేపుతూ పరిగెత్తే పిల్లలు.

యారాడ కొండకు ఉత్తరంగా ఆనుకుని ఉప్పుటేరు పారి సముద్రంలో చేరిపోయేది ఆదిలో. దాన్ని త్రవ్వి లోతు, వెడల్పుచేసి నావలు లోపలికి, బయటికి తెచ్చే వీలు కలుగజేశారు ఆంగ్లేయులు. ఆ ఎంట్రన్స్ ఛానల్‌కి కాస్త ఇవతలగా లోతులేని

నీటిలో జగ్‌సేవక్ అనే ఓడ కూరుకుపోయి వుండేది. 1965 నుంచి తొమ్మిదేళ్ల పాటు దాన్ని పైకి తీయలేక వదిలేశారు. అది జగానికి చేసే సేవ అటుంచి దాన్ని పగులకొట్టి తీసి వేయటానికి నెదర్లాండు నుంచి నిపుణులను తీసుకురావలసి వచ్చింది. ఆ ఒంటరి, కాళ్లు తెగిన ఏనుగు లాంటి ఓడను చూస్తుండే వాళ్లు జనం ఒడ్డునుంచి. దీనికన్నా ముప్పయి మూడు సంవత్సరాలకు పూర్వం, డాల్ఫిన్ నోస్ కొండ ముందు దక్షిణం వైపు నుంచి ఎంట్రెన్స్ ఛానల్‌లోకి వచ్చే ఇసుకను నివారించటానికి జేనస్, విల్లెస్‌డన్ అనే రెండు నౌకలను కొని కాంక్రీటు దిమ్మెలతో నింపి, నౌకలకు కన్నంపెట్టి గోడలా (బ్రేక్‌వాటర్) ఉండేట్లు ముంచేశారు. ఆ ఆలోచన చేసి దాన్ని అమలుచేసింది డబ్ల్యు.సి. యాష్ , డి.బి. రాటెన్‌బరీ అనే ఇద్దరు బ్రిటిష్ ఇంజనీర్లు. 1933లో జరిగిన అద్భుతమైన ఇంజినీరింగ్ ఫీట్. ఊహించుకుంటే ఒళ్లు పులకరిస్తుంది.

ఛానల్ ఒడ్డునుంచి నడిచివెళ్లి వెంకటేశ్వరుడి గుడి ఎక్కి దక్షిణంవైపు చూస్తే సుందర దృశ్యాలు కనిపించేవి. యారాడ జనాన్ని అటూ ఇటూ చేరవేసే దేశవాళీ పడవ, యారాడకు, పట్టణానికి రాజీ కుదిర్చే ప్రయత్నంలో ఉన్నట్లు కనిపిస్తూ. ఆ మనుషులు అంత లోతు ఛానల్లో మునిగిపోవటం ఎంత తేలికైన పని! ఏ క్షణాన్నైనా జరుగుతుందేమో అనిపించేది. చావుకు బతుకుకు ఒక క్షణకాలమే సరిహద్దు.

ఇటు వైపు వచ్చి ఉత్తర దిశగా చూస్తే రాస్‌హిల్, దర్గాహిల్. అవి కలిసి పోయి వున్నట్లు కనబడతాయి కాస్త దూరానికి. ఆ రెండింటిని వేరుచేసే త్రోవవుంది. ఒకదాని మీద చర్చిరెండవ దాని మీద దర్గా.

అభిమన్యు నడిచి వచ్చి ఎయిర్ రెయిడ్ ప్రొటెక్షన్ షెల్టరు దగ్గర నిలబడ్డాడు. దాని మీద 'తొడపాము' అని తారుతో రాసి ఉంది. దాని అర్థం తెలీదు, ఆకతాయిలు రాశారేమో. లోపల పందులున్నాయి. అవి ఒకదానిలో ఒకటి ఒదిగి భయపడుతూనూ, విచారంగానూ ఉన్నాయి బయట బాంబులు పడుతున్నట్లు. ఇది రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో కట్టినది. 1942వ సంవత్సరం ఏప్రిల్ నెల మొదటి వారంలో జపానువాళ్లు, డిసెంబరు 1939లో ఏర్పాటయిన రాయల్ నేవీవారి నావల్ బేస్‌ను ధ్వంసం చేయటానికి బాంబుల వర్షం కురిపించారు. ఎనిమిది మంది చనిపోయారు. సెయింట్ అలోషియస్ స్కూలువాళ్లకు దొరికిన 250 పౌండ్ల బాంబుషెల్‌ని నేటికీ దాచివుంచారు.

కుడివైపు తిరిగి సెయింట్ అలోషియస్ స్కూలు ముందు నుంచి నడిచి పాత పోస్టాఫీసు దాపుకి వచ్చాడు. అక్కడ అయిదు నిముషాలు నిలబడ్డాడు. చీకట్లు అరంభమవుతున్నాయి. తిరిగి నడక మొదలు పెట్టాడు. గోడేవారి వీధిని పడదామా, 'చక్కని' రాజమార్గం మెయిన్ రోడ్డులోనే దర్జాగా నడుద్దామా? ఇప్పటి దాకా చిదంబరం తన గురించి ఎదురు చూస్తుండక పోవచ్చు సంధ్య చీకట్లో అతను తనను గుర్తుపట్టలేక పోవచ్చు రీడింగ్ రూంను ఆనుకుని ఉన్న ఫుట్‌పాత్ మీద నడిస్తే బాల్కనీలో ఉండే చిదంబరానికి తను కనపడక పోవచ్చు వన్ టౌను పోలీసు స్టేషను పక్కనుంచి మెయిన్ రోడ్డును ఎదురీదటం మొదలు పెట్టాడు. రీడింగ్ రూం క్షేమంగా దాటాడు. కొత్త రోడ్డులోకి మలుపు తిరిగాడు. చిదంబరం బారి నుంచి ఈ రోజుకు రక్షణ దొరికింది. తను ఊరు దక్షిణం వైపు ఎందుకు వెళ్లాలి? ఈ దాగుడు మూతలు ఆడాలి!

తన భుజం మీద వెనుక నించి ఎవరిదో చెయ్యిపడింది. చిదంబరందా? తనను

వెదుక్కుంటూ తన ఇంటి వైపు వస్తున్నాడా? తనేం దొంగతనం చేయలేదు. అతని దగ్గిర అప్పు చెయ్యలేదు. అతనడిగితే, 'ఇక చదరంగానికి, మీకు రాం, రాం. నన్ను ఒదిలేయండి మహాశయా!' అని చెబుదాం అనుకున్నాడు. "చెయ్యి భుజం మీద ఎవరేశారా అనికూడా వెనక్కి తిరిగి చూసుకోకుండా ఆ ఆలోచనేంటి మహాశయా? " అన్నాడా వ్యక్తి. వెనక్కి తిరిగాడు. చిదంబరం కాదు. ఫణీంద్ర. లాల్చీ పంచెల్లో ఉన్నాడు పూల రంగడిలా.

"మీ చేతికి మల్లెపూల దండ ఒకటే తక్కువ," అన్నాడు అభిమన్యు.

"పూలదండకేం భాగ్యం, రూపాయిస్తే రెండు మూరలు దొరకుతుంది. చేతికి, నడుముకీ కూడా కట్టుకోవచ్చు" అన్నాడు.

తను ఉన్న వీధికి రెండు సందుల అవతల అతని ఇల్లు. అతను మందు ప్రియుడు. దానికి కొసరులా జర్దా కిల్లీ బుగ్గనుంటుంది. పెదవుల మధ్యో, వేళ్ల మధ్యో సిగరెట్ ఉంటుంది (నేను అగ్నిని ఆరాధిస్తాను, అభిమన్యు!). పేకాట ఒక ప్రాణం. కళ్లు ఎప్పుడూ ఆర్ద్రంగా, ఎర్రగా ఉంటాయి (నాది దయార్ద్ర హృదయం, అభిమన్యు!). అదీ ఒక వ్యసనంలా చిరునవ్వు పెదవులను వదలదు. ప్రభుత్వోద్యోగం చేస్తున్నాడు. జీతం వ్యసనాలకు సరిపోతుంది. ఇంటి మీద ఏడెనిమిదొందల అద్దె వస్తుంది. దాంతో వాళ్లమ్మ ఇల్లు నడుపుతోంది. మరో ఇల్లు అమ్మేశారు.

"అప్పుడే ఇంటి వైపు నడుస్తున్నారేంటి? ఊరు నిదుర పోకుండా యువకులు ఇంటికి చేరరాదు."

"నాకు ఇంటా బయటా కూడా చేయాల్సిన రాచకార్యాలు లేవు. మీ నియమం నాకు వర్తించదు. ఎవరో కవి అన్నట్లు నేను పుట్టుకతో వృద్ధుడిని."

"చెయ్యాలేగాని పనులకు కొదవా? రాత్రి పన్నెండవ్వందే ఇంటి గుమ్మం తొక్కకూడదన్నది ఫణీంద్ర సిద్ధాంతం. రోజుకు ఇరవై నాలుగు గంటలు కాక కనీసం ముప్పయ్యారు ఉండాలని నా భావన. ప్రతి అనుభవాన్నీ మనిషి పొంది ఆనందించాలంటే రెండువందల సంవత్సరాల ఆయుర్దాయం అవసరం అనిపిస్తుంది."

**రాత్రి పన్నెండవ్వందే ఇంటి గుమ్మం తొక్కకూడదన్నది ఫణీంద్ర సిద్ధాంతం. ప్రతి అనుభవాన్నీ మనిషి పొంది ఆనందించాలంటే రెండువందల సంవత్సరాల ఆయుర్దాయం అవసరం అనిపిస్తుంది.**

"ప్రస్తుతం ఉన్న ఆయుర్దాయం ఎవరి కన్నా దానం చేయటానికో, కనీసం అమ్మేసుకోటానికో అవకాశం ఉన్నా చాలు. ఏమైనా మీలో లస్ట్ ఫర్ లైఫ్ వుంది. అదృష్టవంతులు."

"ఛీ! అదృష్టం మీద నాకు అట్టే నమ్మకం లేదు. మన బతుకుని మనకు కావలసిన విధంగా మలుచుకోగలం అన్న దాని మీద నాకు నమ్మకం మెండు."

"ఏదో పని మీద వెళుతున్నారు. వెళ్లిరండి."

"పనా పాడా. ఉందనుకుంటే ఉంది. లేదనుకుంటే లేదు. రండి అలా వెళదాం, నాకు తోడుగా కూడా ఉంటారు."

ముక్కుపొడుం డబ్బా తీసి చిటికెడు పట్టుకుని ఆ కన్నంలోకి ఈ కన్నంలోకి కూరాడు. నషాళానికి అంటేట్లు పీల్చి మహాద్వైక ఆనందం పొందాడు, ఈ జీవితం ఈ అనుభవంతో చాలించినా నష్టం లేదన్నట్లు. తుమ్ము వచ్చే హాయిని అరక్షణం పొందాడు. అది రాక కించిత్ ఆశాభంగం చెందాడు.

అభిమన్యు వాలకం చూసి నవ్వి- "కొత్త అలవాటు.. అలవాట్లకేం కొదవ? " అన్నా

# యముడి పరారీ

ఉషశ్రీ శ్రీమతికి ఒకసారి తీవ్రవమైన గుండెనొప్పి వచ్చింది. ఆ తీవ్రత చూసి అందరూ బెంబేలు పడిపోయారు. ఎలాగై తేనేం? అదృష్టవశాత్తూ ఆమె తిరిగి కోలుకున్నారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ ఉషశ్రీ- 'సాక్షాత్తు యమధర్మరాజు వచ్చి కూడా ఈవిడ పరిస్థితి చూసి భయపడి పారిపోయాడు.. అంటే అప్పుడు నొప్పి తీవ్రత అంతగా ఉందన్నమాట' అనేవారాయన చమత్కారంగా.



డు. డబ్బీ లాల్చీ జేబులో తలదాల్చుకుంది.

అభిమన్యు నడుం చుట్టూ చెయ్యి పోనిచ్చి, స్వల్పంగా తోస్తూ నడిపించాడు ఫణి.

"ఎక్కడికి? "

"స్వర్గానికి! రారా? నరకమే చాలా మీకు? "

అతను దారిలో మాట్లాడిన దాన్ని బట్టి ఎక్కడికి దారి తీస్తున్నాడో ఊహించటానికి ప్రయత్నించాడు. దారి పొడవునా మూడు కిళ్లి కొట్ల దగ్గర ఆగి వాళ్లను ఆప్యాయంగా పలకరించాడు ఫణీంద్ర. అక్కడ బ్రాకెట్టు ఆడే రోజులు రమ్యుగా ఉండేవట. థ్రిల్ లేక పోతే జీవితం డల్‌గా ఉంటుందట. "రోజులన్నీ ఒకేలా ఉండవనుకోండి. ఉండకూడదు కూడా. సారా దుకాణాలు నిర్వహిస్తూ మట్కాను మాత్రం రూపు మాపిన ఈ ప్రభుత్వాల హిపోక్రసీని ఏ బూతులతో తిట్టాలి? "

నడుస్తూ నడుస్తూ ఫణీంద్ర నిలబడి పోయి, జేబులోని పర్సు తీసి డబ్బులు లెక్కబెట్టుకుని సంతృప్తిగా తలూపి "సరిపోతుంది" అన్నాడు.

అతని తండ్రి యాభై ఎనిమిది సంవత్సరాలు బతికాడు, ఒక్క సంవత్సరం ఎక్కువ, తక్కువ కాకుండా. అంతా లెక్కల మనిషి. తినే తిండి దగ్గర కూడా లెక్క. ఇన్ని ముద్దలు అంటే అన్నే ముద్దలు. ఇన్ని అట్లు, ఇన్ని ఇడ్లీలు, ఇన్ని పూరీలు, ముక్క ఎక్కువవటానికి, తక్కువవటానికి ఒప్పుకునే వాడు కాదు. ఒక సంస్థ గణాంక విభాగంలో పనిచేసేవాడు. ఇట్లా పదవీ విరమణ చేశాడు, అట్లా పోయాడు. లెక్కలతో సంబంధం లేని జీవితం నిరర్థకంగా భావించి ఉండొచ్చు.

ఆయన బ్రతికి ఉన్నప్పుడు బేరంపెట్టే ఉంచారు. ఒక ఇల్లు, తాను అనుకున్న అంకెకు వెయ్యి రూపాయులు తక్కువ ఇస్తామని అవతలి వాళ్లు అంటుండటం వల్ల ఆయన అమ్మకం అటకెక్కించి ఉంచాడు. ఆయన పోగానే ఫణి వెయ్యి రూపాయలు తక్కువకే అమ్మిపారేశాడు. అది అమ్మి వచ్చిన దాంతో చిన్న ఇల్లు కొనుక్కుని మిగిలింది బ్యాంకులో ఉంచుకుని అవసరమైనపుడు వాడుకుందామని పెద్దాయన ఆలోచన. ఇల్లు అమ్మేశాడు కాని మరో ఇల్లు కొనే ఆలోచనలో లేడు చిన్నాయన. మిగిలింది చాలు. "పెద్దవాళ్లు తలపెట్టినవన్నీ నెరవేర్చటం మనకు సాధ్యమా? "

స్టేడియం ఎదురుగా ఉంటూ వచ్చిన అమ్యూజ్‌మెంటు పార్కులో కాలక్షేపం చేస్తుండే వాడు. స్కిల్ గేమ్స్ ఆడుతుండే వాడు. ఒకే రోజున అయిదువేలు పోగొట్టుకున్నాడు. ('పోతే పోయాయి కాని, అను

భవించిన థ్రిల్, ఆనందాలకు వెల కట్టలేం కదా!')

"ఆ రోజులు ఎంతో బాగుండేవి. చేతి నిండా డబ్బు. ఇప్పుడో? నెలరోజులాగితే గాని ఆ ముష్టిజీతం రాదు? " బ్యాంకులో పైసా లేదు. ఆఫ్షన్ బ్యాంకునించి అయిదు వేలు ఓవర్‌డ్రాఫ్ట్ తీసుకున్నాడు. మరో కాబూలీ ఎలాంటి పత్రం లేకుండానే రెండు వేలిచ్చాడు - ఫణి జల్సాలు, చిరునవ్వులు, మాటకారితనం, చొరవ చూసి ముచ్చటపడి. పైగా ఆస్తిపాస్తులున్న మనిషిలా కనబడ్డాడు. ఫణిలాంటి వాడికి అప్పు ఇవ్వటమనేది స్వీయగౌరవాన్ని పెంచేదిగా భావించాడు వడ్డీ ఇవ్వకపోవటం, తనతో అసలు పరిచయం లేనట్లుగా తలతిప్పుకుని పోతుండటం చూసి, భయపడి, బాకీ తీర్చేయమని అడిగాడు. నాలుగు నెలల వడ్డీ బాకీల విషయం 'గుర్తు' చేశాడు. "చూస్తా, చూస్తా" అని తప్పుకు తిరుగుతున్నాడు.

ఆ కాబూలీ ఫణి ఇంటికి వెళ్లాడు. ఫణి దొరకలేదు. తర్వాత అతన్ని వెతుకుతూ ఫణి వెళ్లాడు. బాకీ తీర్చటానికి కాదు.

"పరువుగా బతికే వాళ్ల ఇళ్లకు అలా రావటమేమిటి? నాపరువు తీశావు. దానికి విలువ కడితే నువ్వేనాకు బాకీ ఉంటావు. మా దేశం, మా రాష్ట్రం, మా ఊరు వచ్చి మామీద బ్రతుకుతూ ఈ దౌర్జన్యం ఏంటి? " ఉద్రేక పడ్డాడు ఫణి.

తన దేశం నుంచి ఫణి వెళ్లగొట్టేస్తాడేమోనన్న భయం కలిగింది ఖాన్‌కి. క్షమించమని అడిగాడు. తప్పయిపోయిందని ఒప్పుకున్నాడు. వడ్డీల మీద బ్రతకటం గురించే కదా అంత దూరం నుంచి వచ్చింది. మీ లాంటి వాళ్లు కనికరించి బాకీలు తీర్చకపోతే ఆకలితో చావటమే గదా మాగతి అని మొరపెట్టుకున్నాడు. జరిగిన నష్టం 'క్షమించండి' అన్న ఒక్క మాటతో పోతుందా అని అడిగాడు ఫణి. పోదని వెంటనే ఒప్పుకున్నాడు కాబూలీ. నష్టపరిహారంగా అసలులో అయిదొందలు కొట్టేస్తానన్నాడు. వడ్డీ పూర్తిగా మాఫీ చేస్తానన్నాడు. "సాయంత్రం ఇద్దరం కలిసి మందుపుచ్చుకుందాం" అని ఆహ్వానించాడు. కోపోద్రేకాలు సర్దుకున్నాయి.

బంగారం కొట్ల దగ్గరికి వచ్చారు. ఒక కిళ్లీ కొట్టు దగ్గర ఆగి 'సౌఖ్యమేనా? ' అని పరామర్శించాడు ఫణి. "సౌఖ్యమంటే వాళ్లది," అతను బంగారుకొట్లకేసి చూపించాడు చేయి. "చూడు నాయనా! చిన్నప్పుడు చందమామ అన్న పిల్లల పుస్తకంలో ఒక నీతి కథ చదువుకున్నా. నీతి ఏమిటంటే- మనకు లేదు అని ఏడిస్తే ఒక కన్ను, అవతలివాడికి ఉంది అని ఏడిస్తే రెండో కన్నూ పోతాయి. మనకు మూడో కన్ను లేదు. "స్వామీజీలా హస్తం ఎత్తిచూపిస్తూ అన్నాడు ఫణి. "కాషాయగుడ్డలు ఏసుకో, మంచి వ్యాపారం చేసుకోవచ్చు " కిళ్లీ కొట్టు అతను అన్నాడు. కసాయి కొట్లో చచ్చిన పందిలా వేలాడుతున్న అరటి గెలలో నుంచి రెండు అరటి పళ్లులాగి ఒకటి అభిమన్యుకిచ్చి తనొకటి తీసుకున్నాడు. తనే మూతతీసి చేయిలోపలికి పోనిచ్చి రెండు వేరుశనగ ఉండలు సీసాలోనించి లాగి అభిమన్యుకి ఇవ్వబోయాడు. తీసుకోలేదు. "తినాలి, శక్తి లేకపోతే ఏ పని చెయ్యగలం? అధిక శక్తికి ఈ కామేశ్వర రావు కిళ్లీ కొట్లోని వేరుశనగ ఉండలు అద్భుత ఔషదం." రెండు ఉండలూ తనే భక్షించాడు. రెండు సోడాలు కొట్టించాడు. తాగి, ఘాటు లేదని వ్యాఖ్యానించాడు. "సోడా గ్యాసు నీకు ఆనదులే," అన్నాడు కామేశ్వరరావు. డబ్బులిచ్చాడు. కొంత బకాయి.

"నీవు బకాయిలు చెయ్యటానికి పుట్టావో? పోయిన జన్మలోని నీ బకాయిలను వసూలు చేసుకోటానికి పుట్టావో అర్థంకావటం లేదు" అన్నాడు కామేశ్వర రావు.

"అది అర్థం కావటానికి నీ బుర్ర సరిపో దులే" అని కిళ్లీ కొట్టునుంచి కదిలాడు. అతివేగంగా నడుస్తున్నాడు ఫణి. వేరుశ నగ వుండలు అధికశక్తి ఇచ్చినట్లున్నాయి.

"నేను వెనక్కు పోతాను, ఫణి" ఉన్న ట్టుండి ఆగిపోయి అన్నాడు ద్వైదీ భావంతో.

"ఇంతవరకు వచ్చి వెనక్కుపోవట మేంటి? మనం ఉత్తములం. ఒక పని తలపెట్టిన తర్వాత దాని అంతు చూడాలి" నడక వేగం హెచ్చిస్తూ అన్నాడు.

శివాలయం వీధిలోకి మళ్లారు. గుడి ముందు చెప్పులు వదిలి అక్కడే నిలబడి భక్తి శ్రద్ధలతో నమస్కరించాడు కళ్లుమూ సుకుని. "నీలాంటి వాడికి దేవుడక్కర లేదు. నా లాంటి వాడికి అవసరం" అన్నాడు ఫణి చెప్పులు తొడుక్కుంటూ. ఫణి ప్రతి సోమవారం శివాలయానికి వెళ్లి భక్తి శ్రద్ధలతో పూజ చేస్తాడు.

కొంచెంసేపు నేరుగా వెళ్లి, కూడలిలో నిలబడ్డారు. కాలువలు దుర్గంధం వెదజ ల్లుతున్నాయి. జేబురుమాల తీసి ముక్కు మూసుకున్నాడు అభిమన్యు. ఫణి నవ్వాడు ఒక బుగ్గతో, సగం నోటితో.

"ఏం? "

"ఇన్నాళ్లు ఈ నగర శిథిల భాగంలో కాపురమున్నారు గదా. అలవాటు పళ్లేదా? మరోచోటుకి పోతే మురికి కంపు ముక్కుకు తగలకపోతే తోచదు. జీవితాన్ని సమగ్రంగా ప్రేమించాలి. కంపు, ఇంపులతో సహా"

"ఇంతకూ ఇక్కడ ఎందుకు ఆగినట్లు? "

"నాలో ఇంకా కాస్త సిగ్గూ, బిడియం మిగిలి ఉండటం చేత"

"సిగ్గూ, బిడియాల ప్రమేయం వున్న ఏ పని చెయ్యబోతున్నాం? "

సమాధానం చెప్పకుండా నలువైపులా చూశాడు ఫణి.

"తెలిసినా వాళ్లు ఎవరైనా చూస్తారేమో నని భయం... సోల్జర్‌పేటలో ఒక ప్రౌఢ ఉండేది. ఎప్పుడు వెళ్లినా అక్కున చేర్చు కుని ఆదరించేది. డబ్బులున్నా లేకపో యినా ఫరవా వుండేది కాదు. కావలసిం దల్లా శరీరంలో కోరిక. ప్రౌఢలు, ప్రౌఢ లుగా మిగిలిపోరు ఎన్నేళ్లు గడిచినా. మనం యువకులుగా ఉండిపోము. మేక్ హే, వైల్ ది సన్ షైన్స్. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి."

"ఫణీంద్ర, నేను సెలవు తీసుకుంటా"

"మీకు ఇష్టం లేకపోతే, కనీసం నాకు తోడుగా రావచ్చుగా," చెయ్యిపట్టుకుని బల వంతం చేశాడు.

ఏదో ఉత్సుకత కూడా తోడయి అభి మన్యు కాదనలేక పోయాడు. ఫణి విచ్చల విడితనం అతన్ని అబ్బురపరిచింది.

ఒక సన్నటి సందులోకి అడుగుపె ట్టారు. సగానికి పెద్ద కాలువ. కొద్ది గజాల దూరం నడిచారు. ఒక ఇంటి ముందు తెల్ల బనీను, లుంగీలో ఒక మనిషి నిల బడి వున్నాడు. బీడీ తాగుతున్నాడు. గొంతు అమర్యాదగా ధ్వనించింది. అడు క్కుతినే వాళ్లను చూచే చూపుతోను, దొంగలా అన్న అనుమానంగానూ చూ శాడు. అతగాడు భయపడుతున్నది నిజా నికి పోలీసులకి. అలాగని ఈరోజు రోజంతా వ్యాపారం కట్టేసుకోలేరు. భయపడుతూ అలా బతకటానికి చూస్తు న్నారు.

"ఉన్నారా? " ఫణి నెమ్మదిగా అడిగాడు ఆ వ్యక్తి వెన్నెల నీడను చూస్తూ.

"ఉన్నారు కాని... సెప్పలేం... రెయిడ వుద్దేమో. వన్టౌన్లో జీపు రెడీగా ఉంచి నారు."

"మేమొచ్చేటప్పుడు చూశాం. ఏ జీపు లేదు. మరోపని మీద మరోచోటికి కెళ్లివుం టుంది."

"కొత్తేటి? పోలీసోడి సంగతి మీకు తెల్దు."




# బడుద్ధాయ్ దొంగలు

అమెరికాలో నేరాలు అధికం. వాటిలో ఎక్కువ భాగం, బేంక్ లేదా దుకాణానికి వెళ్ళి బెదిరించి నగదు దోచుకోవడం. ఈ తరహా నేరాలు నిత్యం అక్కడ వేల సంఖ్యలో జరుగుతుంటాయి.

అయితే కొందరు దొంగలు తమ 'బడుద్ధాయితనం' వల్ల ఇట్టే చిక్కిపోతుంటారు. కాలిఫోర్నియా రాష్ట్రంలోని మోడెస్టో అనే చిన్న ఊళ్ళో ఓ బేంక్‌లోకి వెళ్ళిన స్టీవెన్ రిచర్డ్ కింగ్ అనే దొంగ తన బొటనవేలు, ఇతర వేళ్ళమీద కర్చీఫ్ వేసుకుని దాన్ని తుపాకీలా చూపించి కేషియర్‌ని అడిగి డబ్బుని తీసుకున్నాడు. అయితే ఆ నగదు అందుకోవడానికి ఆ చేతినే ఉపయోగించడంతో అతని దగ్గర తుపాకీ లేదని గ్రహించి పట్టుకున్నారు.




కాలిఫోర్నియాలోని ఓక్‌లాండ్ అనే మరో చిన్న ఊళ్ళో బేంక్ దొంగతనం చేసిన ఓ దొంగ బయటకి వచ్చి తను ఎక్కిపారిపోవాలనుకున్న కారుని స్టార్ట్ చేయాడానికి ప్రయత్నించసాగాడు. అయితే అందులో పెట్రోల్ అయిపోయింది. ఆ దొంగ రిచర్డ్ గమనించలేదు. ఈలోగా పోలీసులు ఆ దొంగని పట్టుకున్నారు.

టోపీకా అనే ఊళ్ళోని ఓ దుకాణంలోకి ఓ దొంగ వెళ్ళి తుపాకీ చూపించి కేష్‌బాక్స్ లోని డబ్బు తీసుకున్నాడు. అయితే అది చాలా తక్కువ మొత్తం కాబట్టి అతనా దుకాణం యజమానిని కట్టేసి తనే ఆ దుకాణంలో మూడు గంటలపాటు ఉండి సరుకు అమ్మి డబ్బు తీసుకోసాగాడు.

గుండె జబ్బుగల తన భర్త లంచ్‌కి ఇంటికి రాకపోవడంతో అతనికేమైందో చూడమని పక్క షాపు వాళ్ళకి అతని భార్య ఫోన్ చేసింది. వాళ్ళు జరిగింది గ్రహించి పోలీసులకి ఫోన్ చేసారు. ఆ దుకాణం యజమానిగా వ్యవహరిస్తూ 50% డిస్కౌంట్‌లో షాపులోని వస్తువుల్ని అమ్ముతున్న ఆ దొంగని వాళ్ళు అరెస్ట్ చేసారు.

మరో దొంగ కూడా తన 'బడుద్ధాయి తనం' వల్లనే పోలీసులకి తనే దొంగనని రుజువుని అందించాడు. లాస్‌ఏంజెల్స్ పోలీసులు అనుమానం మీద ఓ దొంగని అరెస్ట్ చేసి, అలాంటి మరి కొందరితో అతన్ని కలిపి, సాక్షులని రప్పించారు. వాళ్ళంతా ఒక్కొక్కరు సాక్షుల ముందుకి వచ్చి 'మర్యాదగా డబ్బివ్వు. లేదా గుండు గుండెల్లోంచి దూసుకెళ్తుంది' అని ఆ దొంగ అన్నట్లు అనమన్నారు. వెంటనే మన దొంగగారు 'నేనన్న మాటలు అవికావు' అని నాలిక్కరచుకున్నాడు.

అయితే ఒక్కోసారి అదృష్టం దొంగల పక్షమవుతుండటం కూడా కద్దు. న్యూయార్క్‌లోని ఓ దుకాణంలోకి అర్ధరాత్రి దొంగతనానికి వచ్చిన వారు అన్ని వస్తువులని అలా ఉంచి బర్గ్లర్ అలారంని దొంగిలించారు!

మరో సందర్భంలో ఓ దొంగ ఎవరూలేని ఓ ఐశ్వర్యవంతురాలి ఇంట్లోకి ప్రవేశించాడు. ఆ సమయంలో ఆమె యూరప్ వెళ్ళింది. పోలీసులు ఆ ఇంటిని చుట్టుముట్టి 'లొంగిపో' అని అరుస్తూ ఆ ఇంట్లోకి పావుగంటకో టియర్ గ్యాస్ షెల్‌ని ప్రయోగించసాగారు. అయితే పోలీసుల వెనక గుంపులోంచి 'లొంగిపో' అని అరిచే వ్యక్తుల్లోని ఒకడు ఆ దొంగే అని వాడు పారిపోయాక పోలీసులకి తెలిసింది.

మరో తెలివి హీనుడైన దొంగ, తనని ఎవరూ గుర్తుపట్టకూడదని, కళ్ల దగ్గర చిల్లులు చేసిన బ్రౌన్ రంగు పేపర్ బేగ్‌ని మొహానికి తొడుక్కొని వచ్చి తుపాకి చూపించి డబ్బడిగాడు. బేంక్ కాషియర్ డబ్బు ఇవ్వగానే ఆ సొమ్ముని వేసుకోవడానికి ఆ పేపర్ బాగ్‌ని తొలగించాడు. అతను ఎవరో అంతా ఇట్టే గుర్తించారు.

పేపర్‌బోయ్!



"నీకే కొత్తలా వుంది. అలా భయపడు తున్నావేంటి? ఈ మధ్య వచ్చావా? " అన్నాడు ఫణి 'కొత్త' అనిపించుకోవటం అవమానం అనిపించి.

"మాకేం డబ్బులు సేదా? మీ మంచి గురించి కూడా కదా ఆలోసించేది. మాకి యన్నీ అలవాటే. అయినా జాగర్తలు తీసు కోవాలి గదా," అతను ఖాతరు లేనట్లే మాట్లాడాడు.

"సరేలే బలవంతమేం లేదు. ఊరు గొడ్డుపోలేదు. పోతాం" ఖాతరు లేనట్లు సమాధానం చెప్పాడు ఫణి.

"మీ ఇష్టం. బేగీ వచ్చేయాల. రోజులు బాగా లేవు," మెత్తబడి అన్నాడా వ్యక్తి. పట్టువిడుపులు తప్పవు బ్రతకాలంటే.

అతను ఇంటి తలుపు తట్టాడు. దాని చుట్టూ ఎత్తు ప్రహరీగోడ, లోపల ఏ నవా బుదో జనానా ఉన్నట్లు. గోడ మీద గాజు పెంకులున్నాయి, లోపల జనానాయేకాక ఖజానాగూడా ఉన్నట్లు.

"ఎవరదీ? " కాస్త ఆందోళన, నెమ్మదిగా



ఒక ముసలాడు (వాడు ముసలాడని తర్వాత తెలిసింది) ప్రశ్నించాడు.

"సివ్వాద్రినే లేరా"

తలుపు తెరుచుకుంది. ఫణి, అభిమన్యు లోపలికెళ్లంగానే తలుపు మూసేశారు. ఆ ఇంటి లోపలి ఆవరణ చూడగానే "ఇక్కడ చంపేసి పాతిపెట్టిన నేరస్థుడు ఏ చట్టానికీ, పోలీసుకీ దొరకడు" అనిపించింది అభిమన్యుకి. లైట్లు వెలిగించలేదు ఎందుకో. ఎంత వెన్నెలైనా లైట్లు అవసరమే కదా. కొవ్వొత్తులు వెలిగించారెవరో. కరెంటు పోయివుంటుంది.

నడివయస్సులో ఉన్నట్లు కనిపిస్తున్న ఇద్దరాడవాళ్లు నిలబడి నిర్వికారంగా చూస్తున్నారు. వాళ్లిద్దరూ-సింహాద్రి, ముసలాడు ఫణిని, అభిమన్యుని లోపలికి తీసుకెళ్లారు. లోపలి వరండాలో మరో ఇద్దరు స్త్రీలున్నారు. ఆ వరండాకు ఒక ప్రక్క ఇరుకైన గదులున్నాయి. ఖాళీ మిగలకుండా ఒక్కొక్క అరలాంటి గదిలో ఒక మంచం ఉంది. కొవ్వొత్తుల వెలుగులో నలుగురు ఆడవాళ్లు కనిపిస్తున్నారు. "చీకట్లో చిందులాటలాగుంది,' ' సణిగాడు ఫణివాళ్లు వినకుండా.

"ఈ నలుగుర్ని సూసుకోండి. నచ్చకపోతే మరికొందర్ని అట్టుకొస్తా," సింహాద్రి.

పెదవి విరిచి తల అడ్డుగా ఊపాడు ఫణీంద్ర. "ధన్వంతరి కూడా కాపాడలేడు మనల్ని వాళ్లతో వెళ్లామంటే," అభిమన్యు చెవిలో అన్నాడు.

"ఏటి? " సింహాద్రి.

"నీ సంగతి కాదులే."

"మీరు నానిత్తే కుదరదు. అవతల పోలీసోడితో వ్యవహారం," సింహాద్రి అన్నాడు.

"వీళ్లొద్దు." ప్రహరీగోడ తలుపు తీసి తల అటూ, ఇటూ తిప్పి చూసి ఇంటి పక్క కమ్మలింటికి వెళ్లాడు సింహాద్రి. "సరుకు" గోదాములో దాచినట్లు క్షణాల్లో అయిదారుగురు వచ్చారు చప్పుడు కాకుండా. ఒకర్తె వయసు ఎక్కువే అయినా లంగా, జాకెట్టులో వుంది. ఇద్దరు పీలగా క్షయరోగుల్లా ఉన్నారు. ఒకస్త్రీ పొడవుగా, నల్లగా, మిలమిలలాడుతున్న కళ్లతో, మెరిసే ముక్కుపుడకతో నల్లరాతి గ్రామదేవతలా, శిక్షించబోతున్నట్లుంది. వారి వైఖరి అభిమన్యుకు

## ఒక 'టీ'

ఆకాశవాణి సాహిత్యవిభాగానికి ఉషశ్రీ అధిపతిగా ఉండేరోజుల్లో రేడియోలో ప్రసంగం ఇస్తామని ఎందరో వెంటపడుతుండేవారు. అలా ఒకరోజున ఒకాయన ఆకాశవాణి కేంద్రానికి వచ్చి, 'గురువుగారూ నాకు ఏదో ఒకటి ఇప్పించండి' అంటూ వేపుకు తినడం మొదలెట్టాడు.

వెంటనే ఆయన ప్యూన్‌తో టీ తెప్పించి 'ఏదో ఒకటి' అంటున్నావ్‌గదా? ఈ 'టీ' తాగివెళ్లు' అన్నారు కళ్లతోనే నవ్వుతూ.

ఆ ప్రాక్టికల్ జోక్‌కు అతను కూడా నవ్వుకుంటూ వెళ్లిపోయాడు.



చమటలు పట్టించింది. వింతలోకం చూస్తున్నట్లుంది. వీళ్లు ఏ వింతలోకపు మనుషులో; ఆ లోకంతో చిరపరిచయం ఉంది కాబట్టి ఫణికి ఏదీ వింతగా లేదు. వ్యాపార శైలిలో ఉన్నాడు. మానవ మాంస వ్యాపార శైలి. అతన్ని చూస్తుంటే అభిమన్యుకు అబ్బురంగా ఉంది. అందరూ వరండాలో వరసగా నిలబడ్డారు స్వయంవరానికి వచ్చిన రాకుమార్తెలలా. ఫణి రాకుమారుడిలా వాళ్లలో ఒకరిని ఎంపిక చేసుకుంటాడు, నచ్చితే. అతిజాగ్రత్తగా, వాళ్లతో కాపురం చేయబోతున్నట్లు పరికిస్తున్నాడు.

"తొందరగా కానియ్యాల, పో..."

"నెత్తిమీద ఎంట్రుక నించి, కాలి గోటి దాకా చూస్తా కూర్చుంటే ఎలా బాబూ..."

రెండు కొవ్వొత్తులు తెచ్చి వాళ్ల మొహాలు, శరీరాలు బాగా కనబడేలా పట్టుకున్నాడు ముసలాడు. వెలుతురు, నీడలు సయ్యాటలాడుతున్నాయి, గోడ మీద గాలికి, కొవ్వొత్తుల వెలుగు నాలుకలు కదులుతుంటే. వాళ్లలో ఇద్దరు మేడమ్ టుస్సాడ్ మ్యూజియంలోని మైనపు బొమ్మల్లా ఉన్నారు. కదలికలు ఉడిగి; రెప్పలూ వేయటం లేదు దేవతల్లాగానో, మరణించిన వాళ్లలాగానో. ముఖకవళికలు భయంకరంగా ఉన్నాయి. ఏదో అన్యాయానికి ప్రతి చర్యలా ఒకర్తెది. బానకడుపు పొంగి పొర్లుతున్న మాంసపు ద్రవంలా బెత్తెడు బొడ్డు. కనీసం దాచుకునే ప్రయత్నం కూడా చేయటంలా- నచ్చితే నచ్చుతాను లేకపోతే లేదు, విటులకేం కొదవా అని ప్రశ్నిస్తున్నట్లు. పొడవాటి ఆడమనిషి నీడ పైకప్పుకు తగులుతోంది. ఆమె పొడవాటి ముక్కు, నీడలో ఇబ్బడిగా కనిపించటమేకాక 'పొడుస్తా' అన్నట్లు భయపెడుతోంది. ఆ వాతావరణంలో శృంగారం ఏది? పచ్చికామం ఉంది.

"తొందరగా సెప్పండి. పెల్లిసూపుల్లా ఎంతసేపు?" పొడవాటి మనిషి కాస్త రౌద్రంగా అంది, ఉత్కంఠ భరించలేకో అవమానం అనిపించో. కడుపు గురించి వ్యభిచరిస్తోంది కాని ఆమె మనిషే కదా. ఆమె వినయానికి కస్టమర్లు వేరే వెల కట్టారు. స్త్రీకి ఒక భోగ్య వస్తువుగానే విలువ. ఆమె కూడా విటుల నుంచి డబ్బు మాత్రం ఆశిస్తుంది. అదే కడుపు నింపేది.

"అల్లా మనిషి ఫరవాలేదు కదా?" ఫణి అన్నాడు ఒక మనిషిని చూపించి. ఆమె వెంటనే ఒక గది గుమ్మం దగ్గరకి నడిచి, "ఆలోచించుకొని చెప్పండి, లోపలికి అడుగేసిన తర్వాత వద్దంటే కుదర్దు," అని నియమం పెట్టింది. "ఇక్కడ రూల్సు ఎక్కువగా ఉన్నాయే," ఫణి అన్నాడు.

అభిమన్యుకు అంతా ఒక కలలా ఉంది. భయంతో, సిగ్గుతో నరాలు తెగేలా ఉన్నాయి.

"ఏమంటారు, అభిమన్యూ? "

"మీకు కావాలంటే వెళ్లండి. నా కొద్దు," అని వెనక్కు తిరిగాడు గుమ్మం అటుందని. అది ఎడమవైపుంది.

"అక్కర నేకపోతే... అప్పనంగా తోలు బొమ్మలాట సూడ్డానికొచ్చావా బాబూ, తోలుబొమ్మ లాట? " పెద్ద కడుపు మనిషి అనింది.

"ఆయన బయపడతాడని ఈన తోడొచ్చాడులే, తోడు. ఆయన కంటే ముందు ఈనకు పట్టుకుంది బయం," సన్నపాటి మనిషి అంది.

"ఇంకెంత సేపు...? "

"ఊరికే ఒళ్లు అప్పగించబోతున్నట్లు తొందర పెడుతున్నారేంటి? పోనీలే పోలీసోడి భయంతో మొక్కుబడి ఎందుకు తీర్చుకోవటం. పైగా మావాడు కంగారుపడుతున్నాడు, కొత్త. మరో రోజు వస్తాం."

"అది ముందే చూసుకోవాలయా? " ఇలాంటి వాళ్లని చాలా మందిని చూచిన ఒకామె పళ్లు బిగించి అంది. కళ్లు సోడా బుడ్డి గోలీకాయల్లా ముందుకు ఉబ్బుకొచ్చాయి.

"ముందే సెప్పా దబాయించాడీ బాబు," సింహాద్రి కసిగా అన్నాడు.

"బుద్ధి పొరపాటై ఈ పాటి కొంపలు దొరకవనుకుని వచ్చాం," కోపంగా అన్నాడు ఫణి.

"ఏం అనుకోకండి బాబు. ఆల్లమాటలు పట్టించుకోకండి. పోలీసోల్లతో బెడద కదా.. ఆ కంగార్లో ఉన్నాం. నెత్రోజుల వలా ఇద్దరికి పోలీసోళ్లు గుండు కొట్టించి, కోర్టుకు ఈడ్చి వారం రోజులు మూసేసినారు" అనునయంగా అన్నాడు ముసలాడు. కస్టమర్లని అవమానిస్తే మళ్లీ మళ్లీ రారు. మళ్లీమళ్లీ రాకపోతే వ్యాపారం సజావుగా సాగదు.

రోడ్డెక్కారు. హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు అభిమన్యు. అదంతా చాలా తేలిగ్గా తీసుకున్నాడు ఫణి. ఈల వేస్తూ నడుస్తున్నాడు, వెన్నెల నీడలు చూస్తూ. అవి వెన్నెలకు కళంకాలుగా ఉన్నాయి. చందమామకే కళంకం ఉంది. కళంకం అందం కళంకంది.

"కర్రిది, పొడవుగా ఉంది కదా ముక్కుపుడక పెట్టుకుని - అది బాగుంది. అయితే అలాంటి గడుసోళ్లతో అసలుపనపుడు ఇబ్బందులుంటాయి. గ్రామదేవతలా ఉంది కదా, శపిస్తుందేమో అన్న శంక కూడా పీడించింది. అయినా బాగేమిటి, ఓగేమిటీ అయిదు నిముషాలపనికి. మనమేం కాపురం ఉండబోతున్నామా ఆ లంజలతో... తెగింపు కావాల్సార్ తెగింపు; చిన్నపనికైనా పెద్దపనికైనా, మంచిపనికైనా చెడ్డపనికైనా. ఓకే, మరో చోట చూద్దాం ఊరు గొడ్డుపోయిందా? పేటకొక దుకాణం. కొన్నిపేటల్లో వీధికొకటి. నాగరికత లక్షణాలు మనుషుల కోరికలు, అవసరాలు పెరిగే కొద్దీ అవితీరే మార్గాలూ పెరుగుతాయి."

ఇది ఫణీస్ 'లా ఆఫ్ ఇలాస్టిసిటి'.

"వద్దండి బాబూ, పోదాం. ఇందులో మీకు ఏం సుఖం దొరుకుతుందో నాకర్థం కావటంలేదు. ఏరోగమో తగులుకుంటే? "

"కొత్తకదా, భయం చేత మీకలా అనిపిస్తుంది. సహజం. మిమ్మల్ని తప్పుపట్టను... ఇందులో సుఖం ఉందనుకుంటే ఉంది, లేదనుకుంటే లేదు. లేదనుకోండి! నేను సుఖాన్ని వెదుకుతున్నాను అని మీకు చెప్పలా. మీలా భరించటం చేతకాక దేహ బాధ తీర్చుకుంటున్నా అనుకోండి, ఇబ్బంది లేదు. రోగాలంటారా? వ్యసనాలు లేని వాళ్లు ఆరోగ్యంగా ఉన్నారా? "

"భయం, కొత్తదనం కూడా కారణాలే, కాదనను. అవి అసలు కారణాలు..."

"పోనీలేండి. మీ కారణాలు మీవి. అవి సరైన కారణాలు కాదని నేను భావించ వచ్చు. అది వేరే విషయం. మీ కారణాలు మీరు కలిగి ఉండటానికి మీకు హక్కు వుంది. మరో విషయం: నా మనసును కాస్త పీడిస్తూ వచ్చింది. దానికి నేను విలువ ఇవ్వవచ్చు, ఇవ్వకపోవచ్చు - మీ బ్రహ్మచర్యాత్వాన్ని దగ్గిరుండి ఎందుకు పాడుచేయించాలి? తాచెడ్డ కోతి వనమెల్ల చెరచె అంటారు. నేను కోతిని కాదు కాబట్టి నేను చెడ్డా మరొకరిని చెరచరాదు. ఓ పని చేయండి. గోదావరి టింబరు డిపో దగ్గర నిలబడి ఉండండి. పావుగం టలో వచ్చేస్తా. హోటల్లో భోంచేసి ఎవరి ఇళ్లకు వాళ్లు పోవచ్చు. మా ముసలామె కూడా ఇంటిదగ్గిర లేదు."

"నేనింటికి పోతా. మీ పని పూర్తి చేసు కుని మీరొచ్చెయ్యండి."

"కాస్త తోడుగా ఉండమన్నా. అదీ చేయ లేరన్నమాట. మీరుపుట్టి మీ స్వార్థం పుట్టిందా, స్వార్థం పుట్టి మీరు పుట్టారా?"

ఒకరు ఇంటికీ, ఇంకొకరు ఒక సందు లోకీ వెళ్లారు; ఒకరు పట్టని నిద్రకు ఉపక్ర మించటానికి, ఇంకొకరు 'దేహ బాధ' తీర్చు కోటానికి. ఎవరి ఇబ్బందులు/బాధలు వాళ్లవి.




**మూ**డోరోజు రీడింగ్ రూంకి వెళ్లాడు అభిమన్యు. చిదంబరం ఎంతో ఆప్యా యంగా పలుకరించాడు. ప్రాడిగల్ సన్ ఇంటికి తిరిగి వచ్చినట్లు ఆదరించాడు. ఎడబాటు ఇద్దరినీ చేరువ చేసింది. ఎడ బాట్లు అవసరం. "నా మీద కోపం పోయిందా, అభిమన్యుగారు?" ప్రేయసిని అడిగినట్లు అడిగాడు.

"ఛా! కోపంలేదు, పాడులేదు. ఆరోజు ఒంట్లో బాగాలేదు. దానివలన ఉద్రేకప డ్డాను."

"ఈరోజు మీకు ఒంట్లో బాగుంటేనే ఆడదాం, లేకపోతే మానేద్దాం... ఏం పర్లేదు. ఈ రెండురోజులు మీ గురించే ఎదురు చూస్తూ కూర్చున్నా. నా జీవి తాంతం, మీ జీవితాంతం కూడా ఎదురు చూస్తా."

ఒక ఆటలో ఏనుగు దొరికినా చంప కుండా వదిలేశాడు చిదంబరం మంచి మనసుతో. ఎంత త్యాగం! ఒక మంచి ఎత్తు వేసుకోమని తానే అభిమన్యుకి చెప్పాడు. అతన్ని ఒక ఆట గెలిపించాడు.

రోజూ ఆరుకల్లా రీడింగ్‌రూంకి వెళ్లటం, చదరంగం ఆడటం, చిదంబరం పావులను చంపేటప్పటి ఆనందాన్ని గమనిస్తుండటం మానలేని అలవాటుగా మారింది. సంయ మన శక్తిసాధనకు అది ఒక మార్గంగా కూడా ఎన్నుకున్నాడు. తన ఆ ఒక రోజు ఉద్రేకపు పనికి తాను ఈ పరిహారం చెల్లిం చాలి అని కూడా భావించాడు. స్వార్థాన్ని మాత్రం కాదనగలడా? కాలక్షేపం, ఒంటరి తనంనించి పారిపోవటం. తను ఈ రకపు మాదక పదార్థానికి అలవాటు పడ్డాడా అన్న ప్రశ్న వేసుకున్నాడు.

ఎప్పుడూ జరగనిది ఒకరోజు చిదం బరం రీడింగ్‌రూంకి రాలేదు. రోజూ అతను అభిమన్యు గురించి ఎదురు చూస్తూ కూర్చునేవాడు, మరెవ్వరితోటి ఆడకుండా. ఆరోజు అభిమన్యు అతని గురించి ఎదురు చూస్తూ బాల్కనీలోనించి రెండువైపులా ప్రవహించే ఏరులాంటి రోడ్డు రాకపోకలను చూస్తున్నాడు. అర

గంట గడిచినా చిదంబరం రాలేదు. ప్రతి క్షణం భారంగా, వెలితిగా గడుస్తోంది. పొందవలసిన ఆనందం పొందకుండా కాలం 'వృథా' అవుతున్నట్లనిపిస్తోంది. చిదంబరం మీద కాస్త కోపం కూడా వచ్చింది. రోడ్డుమీద వెళ్లే జనంలో చిదంబరం తల గురించి కళ్లు అంగుళం అంగుళం వెదుకుతున్నాయి. ఏడున్నర దాకా వేచివుండి మెట్లుదిగాడు.

రెండోరోజు, మూడోరోజు అలాగే గడిచాయి. ఈరోజు చిదంబరం రాకపోతే చదరంగపర్వం ముగించేద్దాం అనుకున్నాడు. చిదంబరం రానంతమాత్రాన, చిదంబరం లేనంతమాత్రాన చదరంగం ఆడటం ఎందుకు మానేయాలో అర్థంకాలేదు. చిదంబరంతో గడపటం ముఖ్యమా, చదరంగం ఆడటం ముఖ్యమా. చదరంగం ఆడటానికి ఎవరో ఒక మనిషి దొరుకుతాడు. ఎవరితోనో ఆడే చదరంగం అక్కరలేదు. చిదంబరం, చదరంగం జంటగా కావాలి. చిదంబరం లేని చదరంగం, చదరంగం లేని చిదంబరం అక్కరలేదు. చిదంబరం, చదరంగాల సంయోగంలో కలిగే "మహత్తర" అనుభవం కావాలి. అలాంటపుడు మరికొంత కాలం ఆ అనుభవం పునఃప్రారంభం కావటానికి ఎదురు చూడకుండా, "పర్వం ముగిద్దాం" అని ఎందుకనుకుంటున్నాడు? ఆ అనుభవంలో ఏదో మార్బిడిటి ఉన్నట్లు తోచటం వల్ల దానంతట అది ఏదో విధంగా ముగియాలని కూడా మనసులో ఓ మూల ఉంది. కాగల కార్యాలు గంధర్వులే తీర్చాలి, తనవల్లకాదు.

పేకాట బల్లల దగ్గిరకెళ్లాడు. అప్పుడప్పుడు చిదంబరం స్నేహితుడు ఒకాయన వచ్చి పేకాడి డబ్బులు పోగొట్టుకుని "వచ్చిన పని అయిపోయింది" అని చిదంబరంతో చెప్పి వెళ్లిపోతాడు. ఆయన ఉన్నాడు. చిదంబరాన్ని చూసిన ఆనందం కలిగింది. అభిమన్యు నోరు విప్పబోతుంటే ఆయనే క్రీగంట చూసి పలకరించాడు, ఉష్ట్రపక్షిలా తల పేకముక్కల్లో దూర్చి.

"చూసొచ్చారా? " యాథాలాపంగా అడిగాడు అయిపోయిన ఆట మిగతావాళ్లకు చూపుతూ.

"చూసొస్తున్నాను. నాల్రోజుల నుండి చిదంబరంగారు రావటంలేదు".

"అయితే మీకు తెలీదన్నమాట".

"మీరనేది అర్థంకావటంలేదు, వేదాంతం గారూ!"

"చిదంబరానికి పక్షవాతం వచ్చింది. కె. జి. హెచ్. లో ఉన్నాడు. నాల్రోజులయింది".

"పంచు, పంచు" అన్నారెవరో. పక్షవాతాలు మామూలు విషయాలే అవి రానివాళ్లకు. వాటి ముచ్చట్లకంటే ముఖ్యమయినవి ఉంటాయి - పేకాటల్లాంటివి.

వేదాంతం కూడా అభిమన్యుని పట్టించుకోవటం, మాట్లాడటం మానేసి ముఖ్యమయిన పనిలో నిమగ్నమయ్యాడు. మెట్లు దిగాడు. అగమ్యగోచరంగా ఉంది. అతనికి తెలియకుండానే కాలేజీ డౌనుకు నడిచాడు. అక్కడ నిలబడిపోయాడు. పదమూడో నెంబరు బస్సొచ్చింది. అది రమ్మన్నట్లు ఎక్కి కూర్చున్నాడు. కింగ్ జార్జి హాస్పిటల్ దగ్గిర దిగాడు. ఏ వార్డులో చిదంబరాన్ని చేర్చింది కనుక్కోలేదని గుర్తొచ్చింది. ఇన్‌పేషెంట్ గేటు దాటుతున్నాడు.

1913-14 సంవత్సరంలో కట్టిన రాతికట్టడాల సముదాయం. మిగతా పురాతన భవనాల్లాగే ఎత్తు ప్రదేశంలో, సముద్రానికి దగ్గిరగా కట్టారు. పోర్టికో, ఆర్చ్‌డ్ ద్వారాలు, విశాలమైన ఎత్తుగదులు. గాలీ వెలుతురులు ధారాళంగా వచ్చేలా కట్టారు. ఒకనాటి అంత విశాలమైన ఈ ప్రదేశం జనం తాకిడి కారణంగా కుంచించుకుపోయినట్లుంటుంది. జాలారిపేట, రెల్లువీధి, చేపలరేవు దాటి దూరంగా, ఎత్తుగా ఎగిరి

పడుతుండే ఆస్మటిక్‌వృక్షం. దాన్ని డాల్ఫిన్ నోస్ లైట్‌హౌస్ వైద్యుడిలా పరీక్షిస్తుంటుంది. లైట్‌హౌస్ ఫ్లాష్ "పరీక్ష అయిపోయింది, ఏ జబ్బూ లేదు లేచి కూచ్చో" అంటున్నట్లు మెరిసి తిరిగిపోతుంది. వదలని ఆ హైపోకాండ్రియాక్ బాధపడలేక తిరిగి పరీక్ష, ఫ్లాష్. రోగ నిర్ధారణ చేయలేని అసమర్థతతో పాతపాటే వైద్యుడు పాడుతున్నాడని రోగికి అనుమాన రోగం.

అవి లేకపోతే తన ఉనికే అనవసరం అన్న విషయం మరచి, రోగాలూ రొష్టుల నుంచి కారులో పారిపోతున్నాడొక వైద్యుడు. రంగస్థలం మీద తన పాత్ర దిగ్విజయంగా నిర్వర్తించి, వేషం మార్చుకుని సంతోషంగా ఇంటికి వెడుతున్న నటి లాంటి నర్సు, స్కూటరు వెనక సీటు మీద భుజం మీదినించి వ్రేలాడుతున్న తోలు సంచితో. ముతక ఖద్దరు లాల్చీ పంచల్లోని మనిషి ఆస్పత్రికి సంబంధించిన ప్రతి వ్యక్తిని, వస్తువును జూలోని జంతువులలాగానూ, మ్యూజియంలోని వస్తువులలాగానూ చూచి ఆశ్చర్యపడుతున్నాడు. ఓవరాల్ భుజం మీద వేసుకుని, పుస్తకాలు చేత్తో పట్టుకుని గంభీరమైన నడకను సాధన చేస్తున్నట్లు నడిచివెళుతున్న రేపటి వైద్యుడు. ఆ రోగమేదో నాకొచ్చినా బాగుండు, ఈ యాతన ఎవరు పడతారు అని అనుకుంటున్నట్లు వంగిపోయి, ప్లాస్టిక్కు బుట్టలో ఫ్లాస్కు వగైరాలు పెట్టుకొని లోపలికెళుతున్న యాభయ్యేళ్ల స్త్రీ.

ఎడమచేతివైపు మెట్లు దిగి, ఒక్కొక్క వార్డులో కనుక్కుని వెళదాం అనుకున్నాడు. రెండు వార్డుల్లో ఆ పోలికలు, పేరు, జబ్బు గల రోగి లేడని చెప్పారు. మూడో దాంట్లోకి అడుగుపెట్టాడు. నవ్వు మొహంతో, వెడల్పాటి నుదురుమీద ఎర్రటి పెద్ద బొట్టుతో ఒక నర్సు ఎదురయింది. ఆహ్వానం పలుకబోతున్నట్లు. ఆమెను వాకబు చేశాడు. లోపలికి తీసుకెళ్లి దూరం నుంచి చూపింది.

ఒక పడక మీద తెల్లటి దుప్పటి తలమీదనించి కప్పి ఉన్న రోగి ఉన్నాడు. అతన్నే పెద్దబొట్టు నర్సు చూపించింది. పక్కనే స్టూలు మీద నడిమి వయస్సు స్త్రీ కూర్చుని ఉంది, మౌనంగా వార్డంతా పరికిస్తూ.. అల్లకల్లోమైన నీటిమీద లేచిపడుతున్న పడవలో నిర్వికారంగా చుట్టూ చూస్తూ ఉన్న మనిషిలా. మొహం అప్పుడే కడిగినట్లుంది.

**తెల్లటి దుప్పటి తలమీదనించి కప్పి ఉన్న రోగి ఉన్నాడు. పక్కనే స్టూలు మీద నడిమి వయస్సు స్త్రీ. మౌనంగా వార్డంతా పరికిస్తూ.. అల్లకల్లోమైన నీటి మీద లేచిపడుతున్న పడవలో నిర్వికారంగా చుట్టూ చూస్తూ ఉన్న మనిషిలా.**

వేలుముడి వేసుకుంది. ఉంగరాల జుత్తు అవడంవల్ల కణతల దగ్గర మొండిగా రేగి ముఖం మీదికి ఎగురుతోంది.

"చిదంబరంగారని చిన వాల్టేరులో ఉంటున్నారు.."

"అc అవునండి."

అతని తలమీదినుంచి కొంచెంగా దుప్పటి తొలగించింది

"ఒద్దులెండి. నిద్రపోతున్నారేమో కూడా. లేపకండి"

దుప్పటి లాగంగానే ఒకసారి ఎడమ కన్ను ఎత్తి కొద్దిక్షణాలు చూసి మూసుకున్నాడు. అతన్ని గుర్తుపట్టాడో లేదో కాని ఆ కన్ను చూచిన కొద్దిక్షణాల్లో అర్థమైంది.

"వారిని గుర్తుపట్టారా?" అడిగిందామె ఎలాగూ అతను కళ్లు తెరిచాడు కాబట్టి. అతని నోటి వెంట ఏ శబ్దం వెలువడలేదు. ఏ శరీర భాగంలోనూ కదలిక లేదు. మదిలో ఏ భావం మెదులుతోందో తెలియదు.

"పలకరించి ఇబ్బంది పెట్టకండి,"

అంటూ చిదంబరం ఛాతీ ఉండేచోట, దుప్పటిమీద చేయి వేశాడు ఆప్యాయంగా. గొంతు పూడుకుపోయింది. పరిచయం అతికొద్ది నెలలది. ఇద్దరి మధ్య చదరంగమే బంధం.

"నాపేరు అభిమన్యు. చిదంబరంగారి మిత్రుడ్ని. ఈమధ్యే పరిచయం. రీడింగ్ రూంలో చదరంగం ఆడుతుంటాం"

"ఆయనకు చదరంగం ఆరోప్రాణం"

"నేను రోజూ సాయంత్రం వస్తాను. ఏదైనా నా వల్ల సాయం అవసరమైతే చెప్పండి".

మరో రెండు మూడు నిముషాలు కూర్చుని వార్డంతా కలయచూస్తూ గడిపాడు. రేపు వస్తానని వచ్చేశాడు. అన్నట్లుగానే వెళ్లాడు. చిదంబరం నిద్రలో ఉన్నట్టున్నాడు, కాని మేలుకునే ఉన్నాడు. దుప్పటి తలమీదనుంచి కాక గొంతు దాకా కప్పివుంది. నోరు ఒక పక్కకి లాగేసినా ప్రశాంతమైన ముఖం. కన్నుకూ స్థానచలనం కలిగింది, పిల్లవాడు తను కుదురుగా సృష్టించిన చిత్రాన్ని తనే పసితనపు చిలిపితనంతో వికృతం చేసినట్లు. ఏ శక్తి ఏ క్రూరమైన ఆలోచనతో ఆ పనిచేసినట్లు. దేనికీ ఒకటే సమాధానం 'కర్మ'. కుడివైపుదే చెయ్యి పడిపోయింది. పావులను ఆ చేత్తో కదపలేడు, చంపలేడు. అలా చేస్తున్నపుడు కుడివైపు నోటి కొసతో నవ్వలేడు. జాలితలచి వదిలేసినట్లు ఎడమ అంగాలు పనిచేస్తున్నాయి కుడివైపు చేసే పన్లన్నీ ఇప్పుడు ఎడమవైపునుంచి చేసుకోటానికి. కానీ నడిచి రీడింగ్‌రూంకి రాలేడు. నేనే మీ ఇంటికి వస్తానని భరోసా ఇవ్వాలని ఉంది.

చూపులో అభిమన్యుని గుర్తించిన సూచన క్షణకాలం తళుక్కుమంది. తర్వాత దుఃఖం చోటు చేసుకుంది. అభిమన్యు గుండె నీరవుతోంది ఆ దుఃఖపు కళ్లను, అవి అమరిన ముఖాన్ని చూస్తుంటే. కష్ట సమయానా ఆత్మీయుడిని చూచినప్పటి దుఃఖం. తను నిజానికి ఆత్మీయుడు కాదే! ఏం మాట్లాడాలి? ఏమని ధైర్యం చెప్పాలి? అవి ఖాళీగా ధ్వనిస్తాయి. ధైర్యం చెబితే వచ్చేంత తేలికా, మాటవినే బుద్ధిమంతురాలా. ఆమె పక్కకు తిరిగింది. ఆమె పక్కలు ఎగిసిపడుతున్నాయి. అతని కన్నీరు తుడిచాడు - తనను హింసించిన వాడి కన్నీరు, హింసలోనూ ఆనందం ఇచ్చిన వాడి కన్నీరు. "మీరు త్వరలో కోలుకుంటారు. ఏం పర్లేదు. మళ్లీ చదరంగం ఆడదాం త్వరలో" అతను కళ్లు మూసుకున్నాడు. వెళ్లటానికి నిలబడ్డాడు అభిమన్యు.

"చిన్న సహాయం కావాలండీ", మొహమాటంగా అడిగిందామె.

"చెప్పండి" అన్నాడు. కాస్తయినా సహాయపడగలిగితే సంతోషం.

"ఇంటి దగ్గర నుంచి తెచ్చిన బట్టలు పాడయ్యాయి. ఆయన బట్టలు రెండు జతలు తెచ్చి పెట్టగలరా? అలాగే కొంత డబ్బు, మా అమ్మాయి ఉంది ఇంటి దగ్గర"

ఏడో నెంబరు బస్సు దిగిన తర్వాత ఇంటికి ఎలా చేరాలో చెప్పింది.

"మావారి మేనల్లుడు వస్తానన్నాడు. ఎందుకో ఇంకా రాలేదు. అందుకే మీకు శ్రమ ఇవ్వాల్సి వస్తోంది".

కలెక్టరాఫీసు బస్సుస్టాపు దగ్గిర నిలబడ్డాడు. పావుగంటకు జనాన్ని ఈడ్చుకుంటూ వచ్చింది. కొందరు మనుషులు రాలిపోయారు. బస్సుకు అభిమన్యు వ్రేలాడాడు.

ఇరవై నిముషాల తర్వాత చేతులొది లేసి పడిపోకుండా నేలకు కాళ్లు ఆనించాడు. నాలుగడుగులు వెనుకకు నడిచాడు. తుప్పుపట్టిన గేట్లు. ఎడమ రెక్కమీద వంకర తెలుగు అక్షరాలతో నేమ్ బోర్డు. వెడల్పు త్రోవ. లోపల చాలా ఇళ్లున్నాయి; పాత పెంకుటిళ్లు, కొత్త కాంక్రీటు

శ్లాబు కట్టడాలు. గేటు మొదలు ఆ ఇళ్ల దాకా విశాలమైన స్థలం. పసరు వాసన వేస్తూ పిచ్చి మొక్కలు. ఒకవైపు యూకలిప్టస్, కుంకుడు, నేరేడు, బాదం చెట్లు, వాటి కింద అవి రాల్చిన ఎండుటాకులు. వాటి మీద నించి పిల్లవాడిలా చప్పుడు చేస్తూ నడిచి వెళ్లి రాతి మెట్లు ఎక్కాడు. ఆ పక్క నించి పదేళ్ల కుర్రాడు వెళుతుంటే వాడిని తనకు కావలసిన ఇల్లు ఏదో అడిగి తెలుసుకున్నాడు. తలుపులు చేరవేసి ఉన్నాయి. తొంగిచూస్తే వరండా. అన్ని పోర్షన్లకీ సంబంధించింది. ఆ ఇళ్లకూ ఇదే దారి. నాలుగిళ్ల చావడి. తలుపు తోశాడు. బరువుగా తెరుచుకున్నాయి. పాత చెక్క, ఇనుప బద్దీలు. నడవా దాటి కుడిపక్క తిరిగాడు. ఒక గుమ్మం ముందు నిలబడి పిలిచాడు. లోపల గదిలో ఎక్కడో లైటు వెలుగుతోంది. అక్కడే ఇంట్లో వాళ్లు ఉండి వుండాలి. ముందు గదిలో మూలగా మంచం వేసినట్లు లీలగా తెలుస్తోంది. మనిషా, పరుపు చుట్టా దానిమీద?

కళ్లు చికిలించి చూశాడు. మంచం కిర్రుమంది. ఆ మనిషి నిలబడింది. పవిట సవరించుకుంటోంది. బయటికి వచ్చింది. వరండాలో స్విచ్ వేసింది. ఆమె గుమ్మం దగ్గిరగా నిలబడి వుంది.

"చిదంబరంగారి ఇల్లే కదండి."

"అవునండి. ఆయన ప్రస్తుతం లేరు."

"ఆస్పత్రి నుంచే వస్తున్నా. మీ అమ్మగారు పంపేరు. మీ నాన్నగారి స్నేహితుడిని."

రెండు వైపులా చెక్కలు కొట్టిన కుర్చీని కాస్త ముందుకు లాగి కూర్చోమంది.

"మా నాన్నగారికి ఎలా ఉంది?"

"ఫర్లేదు. మనుషులను గుర్తు పడుతున్నారు. తొందరలో మామూలు మనిషిగా చూడగలం."

పాతిక సంవత్సరాల వయసుంటుంది. తల్లిపోలికలు ఎక్కువగా ఉన్నాయి. రింగుల జుత్తును మధ్య పాపిట తీసి రెండు జడలుగా అల్లుకుంది. పడుకోవటం వలన లంగా, ఓణీ నలిగి ఉన్నాయి. జుత్తు చెదిరి ఉంగరాలు మొహం మీదికి వస్తున్నాయి. దోసగింజ బొట్టుపెట్టింది. పొడవుముక్కు, దొప్పకళ్లు. పొడవాటి కనుబొమలు. చిన్ననోరు. ఉలితో చెక్కిన చెక్కిళ్లు. దొప్పలనిండా దిగులు. కదలికలలో, మాటల్లో లాలిత్యం. మధ్యవయసు గాంభీర్యం.

"కూర్చోండి. మంచినీళ్లు తెస్తాను."

"అవసరం లేదు. మళ్లీ వెళ్లటం ఆలస్యం అవుతుంది. మీ నాన్నగారి బట్టలు రెండు జతలు, యాభై రూపాయలు తెమ్మని చెప్పారు."

ఆమె ఏదో అనబోయింది.

"...ఇంతకుముందు ఉన్నవి పాడయినాయట."

లోపలికి వెళ్లటానికి అటుపక్క తిరిగింది. గాజులు చప్పుడు చేశాయి. లవలాకులు కదిలాయి. అయిదు నిముషాల్లో వచ్చింది ఒక సంచీతో.

"సాయంత్రం మా బావ రాలేదు. నేను బయలుదేరాలా అన్న ఆలోచనలో ఉంటుండగా మీరొచ్చారు" డబ్బులూ, సంచీ ఇస్తూ అంది.

బస్టాపు చేరంగానే బస్సు వచ్చింది. ఇరవై నిముషాల్లో ఆస్పత్రి చేరాడు. ఆమె నర్సుతో ఏదో మాట్లాడుతోంది.

"బాగా ఆలస్యమైపోతుంది మీకు. మీరటు వెళ్లారు మావారి మేనల్లుడొచ్చాడు."

రోగులను చూడటానికి వచ్చిన జనం వెళ్లిపోయారు. వాళ్లను కనిపెట్టుకుని ఉండవలసిన వాళ్లు మాత్రం ఉన్నారు.

వస్తానని చెప్పి ఇంటికి బయలుదేరాడు.

తర్వాత రెండు రోజులు వెళ్లలేదు. మూడోరోజు.. ముందు వెళదామనుకుని తర్వాత ఎందుకో విరమించుకున్నాడు.

రీడింగ్ రూంకెళ్లాడు. పేపర్లు తిరగేశాడు. సినిమా పత్రికలు తీసుకుని తారల ఇంట ర్వ్యూలు దీక్షగా చదివాడు. బాల్కనీలోకొచ్చాడు. ఒక జంట చదరంగం ఆడు తోంది. ఇద్దరు ముగ్గురు రోడ్డుమీది జన సందోహాన్ని చూస్తున్నారు. రోడ్డు కనబ డేలా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. బస్సులు వెళ్లినపుడల్లా బాల్కనీ కంపి స్తోంది. ప్రక్కన కార్మిక భవనం నుంచి ఆవేశపు కంఠాలు వినవస్తున్నాయి. ఎన్నో జీవిత సమస్యలు. కాలం గడవటానికేమో; అవి వేదన కలిగిస్తేనేం గాక. కుట్టే దోమ ల్లాగా, చెవిలో జోరీగల్లాగా. వాటిని తోలు కుంటూ, కుట్టినచోట బాదుకుంటుండగా కాలం అవతలివడ్డుకు చేరిపోతాం.

చదరంగం ఆడేవాళ్లలో ఒక వ్యక్తి లేచి పోయాడు. రెండో అతని కుతి తీరినట్లు లేదు. "వస్తారా?" అడిగాడు. ఆడాలని అనిపించటంలేదు. దానిమీద "మోజు" మాయమై పోయింది. చిదంబరం గురించి పుట్టి చిదంబరంతోనే ఆది ముగిసినట్లు. ఆ ప్రహసనం తను అనుభవిస్తున్న జీవి తంలో ఒక అవసరాన్ని తీర్చేది. అది శాశ్వతంగా తనకు "ఉపయోగపడేది" కాదు. ఏ అనుభవమైనా అంతేనేమో. చిదంబరం ఇపుడు మెట్లెక్కి వస్తే?

ఆడనని అర్థం వచ్చేట్లు తల అడ్డంగా తిప్పాడు రోడ్డుమీది నుంచి కళ్లు విప్ప కుండా.

"చిదంబరంతో తప్ప ఆయన ఎవరితో ఆడడు," అభిమన్యును అడిగిన వ్యక్తి ఆడి వెళ్లి పోతున్నతనితో నవ్వుతూ అన్నాడు.

"చిదంబరం తిరిగి వచ్చినా చదరంగం ఆడను. ఆ స్వేచ్ఛ నాకుంది." వెళ్లి కూర్చుని ఉన్నతని దగ్గిర శరీరం శరీరం తాకేట్లు నిలబడి కోపంగా అన్నాడు అభి మన్యు. నిజంగా స్వేచ్ఛ వుందా?

చిందరవందరగా ఉన్న పావులను చూస్తూ నవ్వుతూనే ఉన్నాడతను, నవ్వే సమాధానంగా. తమాయించుకుని తన కుర్చీలో కూర్చున్నాడు ముందుకు వెళ్లి. అవతలి వాడిని వెధవ క్రింద ఎలా జమ కడదామా అని ఉంటుంటుంది. దద్దమ్మ క్రింద జమకట్టి చూసి నవ్వదగిన వాడిగా పరిగణించటంలో మరో అంశం కూడా ఇమిడి వుంది; "నీకన్నా అధికుడ్ని" అన్న భావం. అయితే తను అంత ఉద్రేకపడా ల్సిన విషయంలా అనిపించలేదు, జరగా ల్సింది జరిగిపోయిన తర్వాత. లేచి రోడ్డు మీదికి వచ్చేశాడు. ప్రవాహంలో పూచికపు ల్లలా కొట్టుకుపోతున్నాడు. అది హాయిగా ఉంది, నిత్యనూతనంగా ఉంది. ఏ సమస్యా ఉండదు. ఉద్రేకాలుండవు. తోటి జనమే తనను నడిపిస్తారు.

చిదంబరాన్ని అధికంగా గుర్తుకు తెచ్చు కుంటున్నట్లు, అతనితో లేని అనుబంధాన్ని తెచ్చి పెట్టుకుంటున్నట్లు గ్రహించాడు. చిదంబరం కళ్లలో దుఃఖం, బాధకు తనలో కలిగిన భావోద్రేకం ఇరువురి మధ్య వున్న అనుబంధ సూచన కాదు. సాధారణ పరిచయం ఉన్న ఏ వ్యక్తిని ఆ స్థితిలో చూసినా తన స్పందన అలాగే ఉండేది. అతని గురించి అతిగా ఆలో చించి మథనపడటం కృత్రిమంగాను, అర్థ రహితంగాను వుంది; అతనితో ఆడుతూ వచ్చిన ఆట సంబంధమైన మార్చిడిటి ఈ 'సంబంధం' లోనూ కొనసాగుతూ.

కానీ... కానీ... చిదంబరం కూతుర్ని చూసిన క్షణం నించి లేని బంధాన్ని ఆ కు టుంబంతో ఏర్పరచుకోటానికి మనసు ఆయత్తపడుతున్నట్లు అనుమానం కలుగు తోంది. దాన్ని ప్రక్కకు తోసిపుచ్చాడు. ఆస్పత్రికెళ్లి రెండు రోజులు గడిచిపో యాయి. "ఏదన్నా సహాయం అవసర మైతే..." అని అన్న మనిషి రెండు రోజులు ఎగనామం పెట్టాడు. అది ఉత్తర కుమార ప్రతిజ్ఞలా మిగిలిపోయింది.

సహాయం ఏదన్నా అవసరమయితే



వాళ్లకు మేనల్లుడే దిక్కులా ఉన్నాడు. తనను వాళ్లు అడిగిన సాయమూ లేదు, చేసిందీ లేదు. నిజానికి తను ఏం సహాయం చేయగలడు? చేయగల స్థితిలో ఉన్నాడా? ఇంటికెళ్లి బట్టలు తెచ్చిచ్చి చేయి దులుపుకొని రెండ్రోజులు ఆస్పత్రి దగ్గర గైర్‌హాజరయ్యాడు. అక్కడికి వెళ్లటం వల్ల వాళ్లకు ఒరిగేది ఏమీ లేదు. అయిదు నిమిషాలు నిలబడటం, జాలిగొలిపే ఆ ఇద్దర్నీ చూడటం, ఏదో మాట్లాడాలి కాబట్టి మాట్లాడటం, 'వస్తానండి', అని చెప్పి వచ్చేయటం. తను తనకు తెలియకుండా ఆడే నాటకం.

ఆస్పత్రి చేరాడు. వార్డు దగ్గిరకు చేరంగానే కాళ్లు మొరాయించాయి. ఎడమవైపు దిగే బదులు సరాసరి వెళ్లి పానగల్ భవనానికి కాస్త పైకి నడిచి ఎడమగా నిలుచున్నాడు. పిల్లల వార్డు మేడ మీది నించి నర్సు ఎవరి గురించో క్రిందికి వంగి వంగి చూస్తోంది. పై లాన్ మీద కుర్రాళ్లు కూర్చుని కబుర్లాడుకుంటున్నారు. సముద్రంకంటే ఎత్తుగా ఉంటుందీ చోటు. శాండ్‌హిల్‌లో కొంత భాగం. చేపల రేవులో అసంఖ్యాకమైన చేపల మరపడవలు. వెలుపలి రేవు గురించి కట్టిన కాంక్రీటు బ్లాకుల గోడలు(బ్రేక్ వాటర్స్): చమురు నౌకలు నిలువటానికి సంకెన్( ముంచేసిన) షిప్ బ్రేక్‌వాటర్‌కి ఆవల నిర్మితమైన మూరింగ్. చచ్చిన గొడ్డు లాంటి సముద్రం. ఆకాశానికి ఏదో మొర పెట్టుకుంటున్నది.

ఎంతసేపని ఇలా నిలబడి ఉండిపోవటం, ఆస్పత్రికి విహారార్థం వచ్చినట్లు. చిదంబరం ఇంటికెళ్లి వచ్చిన తర్వాత తనలో ఒక మార్పు వచ్చినట్లుంది. అంతకు ముందు అన్నిసార్లూ ఆస్పత్రికి, తర్వాత ఇంటికి సంకోచరహితంగా వెళ్లాడు. ఇపుడు ఏదో అపరాధ భావం తెచ్చిన సంకోచం కాళ్లకు బంధం వేస్తోంది. పరిచయం పెరగాలన్న కోరిక పుట్టకుండా జాగ్రత్త పడుతున్నాడు, కనీసం వాళ్ల కష్టకాలం దాటిపోయేంత వరకు.

రోడ్డుదిగి కొద్ది గజాల దూరం నడిచి వార్డు చేరాడు. ఇద్దరు కొత్త నర్సులు. తొమ్మిదో నెంబరు పడక దగ్గిర కెళితే చిదంబరం లేడు, ఆమె లేదు. పడక మార్చారేమో. నర్సుల దగ్గిరకొచ్చాడు.

"తొమ్మిదో నెంబరు బెడ్ పేషంట్‌ని ఎక్కడికి మార్చారో చెబుతారా? "

మీసాలు లేక పోవటం, పొడవు జుత్తు ఉండటం మినహాయిస్తే హిట్లరుకు తోబుట్టువులా ఉంది. అభిమన్యుని యూదుడ్ని చూసినట్లు చూసి సమాధానం ఇవ్వలేదు. రోగులకు సేవలు అందిస్తూ వచ్చే పోయే వాళ్ల ప్రశ్నలకు సమాధానం ఇవ్వటం ఆమె తలకు మించిన భారమైవుంటుంది. రెండో నర్సు సమాధానం చెప్పింది ముక్తసరిగా, తన సీనియర్ తీసుకోవలసిన శ్రమ తను తీసుకుంటూ.

"రెండు రోజుల క్రితం ఆయన చనిపోయాడు"

"రెండు రోజుల క్రితమంటే చిదంబరం ఇంటికి వెళ్లిన రోజు. ఆస్పత్రి నుంచి వెలుపలికి వచ్చాడు. అంగవైకల్యంతోనైనా బతికి బట్ట కడతాడు అన్న నమ్మకంతోటే చిదంబరం కూతురుకు భరోసా ఇచ్చాడు తనకేదో అన్నీ తెలుసు, ప్రతిదీ తన చేతిలోనే ఉందనట్లు. అవి కేవలం ఆమెకు ధైర్యం కలిగించే ఉద్దేశంతో అన్న మాటలు కాదు. గేటు ముందే ఏం చెయ్యాలో తోచక నిలబడి పోయాడు. చిన వాల్తేరు వెళ్లి, వాళ్లింటికి వెళ్లాలనిపిస్తే వెళ్లొచ్చు లేకపోతే మానేసి వెనక్కు తిరిగి ఇంటికెళ్లిపోవచ్చు. చిన వాల్తేరు వెళ్లాడు.

గేటు ముందు నిలబడ్డాడు. దానికి వ్రేలాడుతున్న చెక్కముక్క మీది పేరును శ్రద్ధగా చదవటానికి ప్రయత్నించాడు. అది చదవటానికి ప్రయత్నం, శ్రద్ధ అక్కర

లేకపోయినా, గేటు దాటిముందుకు నడిచాడు. వరండా దాటి కుడివైపు అతి కష్టం మీద అడుగులు పడ్డాయి. ఆగిపోయాయి క్షణానికే, సీసపు దిమ్మెలు కాళ్లకు కట్టినట్లు.

ముందు గదిలో ఎవరో మనుషులున్నారు. పరామర్శకు వచ్చిన వాళ్లయి వుంటారు. బంధువులో, స్నేహితులో అయివుంటారు. వాళ్ల మధ్యలో వాళ్లతో పరిచయం లేని తను ఇముడుతాడా? ఏం పరామర్శ చేయగలడు? చిదంబరం శవమన్నా ఉంటే చూచి పోవటానికి వెళ్లవచ్చును. ముందుకు అడుగుపడలేదు. అర నిమిషం నిలబడ్డాడు, కనీసం ఎవరన్నా లోపలి మనుషులు తనను చూడటం తటస్థిస్తే లోపలికి వెళ్లచ్చని. అలా జరగలేదు. తన జీవితానికి నిజమైన సంబంధం లేని వాళ్ల ప్రపంచంలోకి తను అడుగిడటం అసంగతంగా అనిపించింది. వాళ్లతో అలాంటి సంబంధం లేనందుకు ఏదో దిగులు కలిగింది. తన నెవరో వెలివేసిన ఒంటరితనం బాధించటం మొదలయింది. వెనక్కునడిచాడు. ప్రహరీ దగ్గరి కుంకుడు చెట్టు కాయలు, ఎండుటాకులు రాలుస్తోంది. ఆ చోటుతో తనకు గల బాంధవ్యాన్ని చాటి చెబుతున్నట్లు. వాటి మీద కసిగా అడుగులు వేసి ఇసుకలోకి తొక్కేస్తున్నాడు. నెత్తిమీద ఒక ఆకు ఆప్యాయంగా రాలింది. జేబులో ఉంచుకున్నాడు. గాలిలేక యూకలిప్టస్ స్తబ్ధుగా ఉంది. పిచ్చి మొక్కల్లో చుంచెలుక దారీ తెన్నూ కానక తిరుగుతోంది. ఒకసారి బాధగా అరిచింది. అభిమన్యు అడుగులు పడి చప్పుడు చేస్తున్న ఎండుటాకుల శబ్దాలకు సందిగ్ధత వదిలి ప్రాణరక్షణ ధ్యేయంగా పారిపోయింది, ఒక దిక్కును ఎంపిక చేసుకుని.

సముద్రం వైపు నడిచాడు. బీచ్ పొడవునా జంట రోడ్లు- ఒకదానికొకటి తోడుగా పయనిస్తూ. రిలే రన్నర్లలా సూర్యుడి నుంచి వెలుగు దివిటీలు తీసుకున్న విద్యుద్దీపాలు. విచారం లాంటి రాత్రికి చోటు లేదు. హోటల్ పక్కన సిమెంటు బల్ల మీద కూర్చున్నాడు. బాగా రాత్రి అయ్యేదాకా, చంద్రుడు నిర్భయంగా, నిస్సంకోచంగా ప్రకాశించేదాకా ఉండి తొమ్మిది గంటలప్పుడు ఇల్లు చేరాడు. బట్టలు కూడా విప్పుకోకుండా, కాళ్లూ చేతులు కడుక్కోకుండా, గ్లాసు నీళ్లనన్నా గొంతులోకి ఒంపుకోకుండా మంచం మీద వాలితే- నిద్ర ముంచెత్తింది. అనాథలా అభిమన్యును ఒడిలోకి తీసుకుంది. అంతకన్నా ఏం కావాలి అలసిన శరీరానికి, సొలసిన మెదడుకి? నిద్రలోని మెదడు కెరటాలు లేని సముద్రం.

మరుసటి రోజు ప్రశ్న మేలుకొలుపు 'పాడింది'. అంత దూరం వెళ్లి ఆ ఇంట్లోకి వెళ్లి వాళ్లను పరామర్శించి రావటమనే అతి తేలికైన పని చేయటానికి ఎందుకు తల క్రిందులయ్యాడు. తన మనసే తనకు ప్రతిబంధకం. అతి చిన్నశంకను సృష్టించి సైంధవుడిలా అడ్డుపడుతుంది.

నిన్నటి తన చేతకానితనానికి, పిరికితనానికి పరిహారం చెల్లించదలచుకున్నట్లు. "ఏమైనా (? ) గాని ఈ రోజు సాయంత్రం వాళ్లింటికి వెళతాను, నాకు నేను నిన్నటి నా బలహీనతకు సంజాయిషీలా," అనుకున్నాడు.

సాయంత్రం ఆ ఇల్లు చేరాడు.

ఇంట్లో ఎవరూ వున్న అలికిడి లేదు. ఎవరూ లేనట్లుంది. ఇల్లంతా మూగబోయి వుంది. నిన్నటి కలకలం లేదు. వాళ్లు లేకుండా వస్తే ఏ గొడవా ఉండదని లేని సమయం ముందుగా తెలుసుకున్నట్లు వచ్చాడు. వీళ్లు వింత మనుషుల్లా ఉన్నారే. ఒకరికి తండ్రి, మరొకరికి భర్త అయిన మనిషి చనిపోయిన నాలుగు రోజులలోనే ఇల్లు వదిలిపోవటం ఏమిటో,



కట్టకట్టుకుని. “ఎన్ని గంటలయినా వాళ్లు వచ్చేంత వరకు వేచివుండి, పరామర్శించి వెళతాను.” పరామర్శించటం నేరం కాదు, అది చేయటం ఏదో ఆశించీ కాదు. ధైర్యం చెప్పుకొన్నాడు. ముందు గదిలోగాని, వెనుక గదిలోగాని లైటువేసి లేదు. కానీ తలుపూ తాళంవేసి లేదు. తలుపు తట్టాడు. లోపల ఏదో అలికిడి అవుతోంది. ముందు వరండాలాంటి గదిలోనే మసకచీకట్లో తనలో తాను ఒదిగి, గోడకు

కనిపించటానికి.

"మీరా, రండి లోపలికి," గొంతులో జీర, గొంతు సవరించుకున్న శబ్దం.

కూర్చున్నాడు.

"అమ్మ ముఖ్యమయిన పని ఉండి బజారుకెళ్లింది. ఎక్కువసేపు పట్టదు రావటానికి"

పక్క బల్లమీద పుస్తకం తీశాడు. ముత్యాల్లాంటి అక్షరాలతో లలిత అని రాసి వుంది. ఏదో చరిత్ర పుస్తకం. మంచం ఎత్తిపెట్టింది, గది ఖాళీగా ఉండటానికి.

"నిన్న ఆస్పత్రికి వెళ్లినపుడు తెలిసిందీ విషయం. ఈ రెండు మూడు రోజులు వచ్చేపోయే జనంతో సరిపోయి వుంటుంది మీకు."

"నిన్న మీరు వెళ్లిపోతున్నపుడు చూశాం. మళ్లీ వెనక్కు వచ్చేస్తారని పిలువలేదు."

"కాసేపు ఆగి వద్దామనుకున్నాను. కానీ వెళ్లవలసిన వేరే పని కూడా వుండటం వల్ల..."

"ఆ రోజు అమ్మ మిమ్మల్ని అనవసరంగా శ్రమ పెట్టింది. బావ ఎలానూ వచ్చాడు. మీరు వెళ్లంగానే."

"అది శ్రమ కాదు, సహాయమూ కాదు. నేనే మీ అమ్మగారితో అన్నాను



ఆనుకుని, తల మోకాళ్లకు ఆనించి ఉన్న మానవాకారం కాస్త జాగ్రత్తగా చూస్తే కనిపించింది. ఆమె లేచి తలుపుతీసింది. మూర్తీభవించిన విషాదంలా ఉంది. తలుపుతీసిన తర్వాత లైటు వేసింది; ముందుగా జుత్తు, బట్టలు సవరించుకొని

ఏదైనా సహాయం అవసరమైతే చేస్తానని. నేను ఏవిధంగానూ మీకు ఉపయోగపడలేకపోయాను.

"సహాయం చేయగలిగిన వీలు అందరికీ ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఆత్మస్థైర్యం ఇవ్వటం కూడా ఉపకారం చేసినట్లేకదా," అని లోపలికెళ్లింది.

బిస్కెట్లు, స్టీలు కప్పూ సాసరులో కాఫీ తెచ్చింది.

"మీ నాన్నగారు నేను రీడింగ్ రూంలో చదరంగం ఆడేవాళ్లం"

"మా నాన్నకు అదుంటే మేము అక్కర లేదు"

"బాగా ఆడేవారు"

"ఆయనతో ఆడిన కొద్దికాలానికి ఆయనతో ఆడేవాళ్లు మానేసేవాళ్లు. ఆయన ఆడే విధానం కొంత మందికి నచ్చదు. అయనతో ఆడి ప్రతిసారీ ఓడిపోవటం ఎవరికిష్టంగా ఉంటుంది? 'అది ఆటే కావచ్చు. మీరు మీకన్నా తక్కువ ఆటగాళ్లను జాగ్రత్తగా ఎంపిక చేసుకుని ఆడి వాళ్లను ఓడిస్తున్నట్లున్నారు' అని మా అమ్మ అంటే పెద్దగా నవ్వేసేవారు ఆయన"

"మా మధ్య పరిచయం ఈ మధ్యదే"

"గతంలో ఒక్కోసారి ఒక్కోచోట ఆడేవారు. ఈ మధ్య హిందూ రీడింగ్ రూం చేరారు. ప్రతిరోజూ ఆటవిశేషాలు అమ్మకు చెప్పేవాళ్లు"

మాటలు ఆపి తలవంచుకుని కాఫీ తాగుతున్నాడు. బాగుంది. మరో మనిషితో ఇష్టంగా మాట్లాడుతూ ఇంట్లో కూర్చుని, కమ్మటి కాఫీ తాగి యుగం అయివుంటుంది. ఎవరితో మాట్లాడుతున్నా అర్థంలేని, అనవసర సంభాషణ అనిపించే తనకు ఆమెతో జరుగుతున్న సంభాషణలో ఆ ఆలోచన ఎందుకు కలగడంలేదో.

చిదంబరం భార్య ఇంకా రాలేదు. ఆమె గురించి అభిమన్యు ఎదురు చూడలేదు. ఈ రోజుకు ఈ సుందర స్వప్నం చాలు. లేచిపోయాడు.

"టార్చిలైటు తెస్తాను. చీకటి పడిపోయింది. కొత్తవాళ్లకు చెట్ల మధ్యనించి, మొక్కల మధ్యనించి వెళ్లటం కష్టం"

"వెళ్లిపోగలను. శ్రమ తీసుకోటం ఎందుకు? "

"టార్చిలైటు బటను నొక్కి ఈ చివర నిలబడి వుండటంలో శ్రమ, ఖర్చు లేదు"

డొక్కు ఫ్యాను ఆపుచేసింది. నిశ్శబ్దంగా, హాయిగా ఉంది. ఆమె వెనుకనే నడుస్తోంది. తలవంచుకుని వచ్చి రాతిమెట్లు దిగాడు. మెట్ల మీద ఆమె నిలబడి టార్చిలైటు ఆన్ చేసి దారి వైపు దాన్ని మళ్లించి చూపుతోంది.

చుక్కల వెలుగు తప్ప మరో వెలుగు లేదు. చీకటిదే రాజ్యం. కాస్త దూరంలోని పిచ్చి మొక్కలు టార్చిలైటులో కనబడుతున్నాయి. మొహమాటానికి ఆమెను రావద్దన్నాడు కానీ గేటుదాకా అలవాటుంటేనేగాని వెతుక్కోకుండా వెళ్లటం కష్టం. టార్చిలైటులో బ్యాటరీల శక్తి తగ్గిందేమో అది ఎక్కువ వెలుతురును, దూరానికి ప్రసరించలేకపోతోంది. ఆమె దగ్గరే ఆ వెలుతురు ఆగిపోయినట్లనిపించింది, వెనుదిరిగి ఒకసారి చూసినపుడు. వెనుక వరండాలోకి ఆమె నీడ పడుతోంది, ఏ సౌందర్యమూ కానరాని నీడ.

త్వరగా అడుగులు వెయ్యటానికి ప్రయత్నించాడు. పడటంలేదు. తప్పటడుగులు వేస్తున్న బాలుడిలా ఉన్నాడు. ముందు పాదం మోపటానికి స్థలాన్ని వెతుకుతు

**ఆయనతో ఆడిన కొద్దికాలానికి ఆయనతో ఆడేవాళ్లు మానేసేవాళ్లు. ఆయన ఆడే విధానం కొంత మందికి నచ్చదు. అయనతో ఆడి ప్రతిసారీ ఓడిపోవటం ఎవరికిష్టంగా ఉంటుంది? అది ఆటే కావచ్చు.**

న్నట్లు కాలు ఎత్తి ఆలస్యంగా అడుగేస్తు న్నాడు. సగం దూరం వచ్చి మరోసారి వెనక్కు చూశాడు. ఆమె నిలబడే వుంది. వెలుతురు ఇక్కడికి ప్రసరించటంలేదుగాని, టార్చి వెలుగుతుండటం కనిపిస్తోంది. కాస్తో కూస్తో లోపలి లైట్లు పడేచోట ఆమె నిలబడి వుంది కాబట్టి ఆమె లీలగా కనబ డుతోంది. ఆమెకు తను కనబడడు. ఆమె తనకు కనిపిస్తూనే ఉంటుంది. ఆమె అక్కడే నిలబడి వుండటం వలన కాంతికి సంబంధించినంత వరకు తనకు ఏ ఉప యోగం లేదు; కాస్తో కూస్తో, వెనక్కు వెళ్లి ఆమెను చేరటానికి తప్ప. ఏ మిషతో వెనక్కు వెళ్లగలడు? ఆమెను అడగవల సిన విషయం మరువలేదు, తన వస్తువు ఏదీ వదిలేసి రాలేదు.

ఆమెవైపు తిరిగి కొన్ని క్షణాలు నిలు చుండిపోయాడు. ఆమె అక్కడ నుంచి కనబడకపోయినా, ఆ ఇంటికే చేరువగా వీలైనంతసేపు గడపటానికి. అతను అవ తలి చివరకు చేరిపోయి ఉంటాడని; లేక పోయినా తనిస్తున్న వెలుతురు అతనికి ఎలాగూ అందదని గ్రహించటంవలన తనతో తెచ్చిన టార్చిని, అతని గురించి తెచ్చిన టార్చిని ఆపేసి లోపలికి వెళ్లిపో యింది. అక్కడ ఇపుడు వెలుగు కంతలేని చీకటి. ఆ చివరా చీకటి, ఈ చివరా చీకటి. మధ్యలోనూ అదే. తర్వాత మరోసారి ఆ ఇంటికి చిదంబరం భార్యను పరామర్శించటానికి వెళ్లాడు.




ఒక నెల గడిచింది. ఆ రోజు చలి జ్వరం పట్టుకుంది. రెండో రోజుకు నెమ్మ ళించింది. ఒక్క రోజే అది తనతో కాపురం చేసినా ఒంట్లో శక్తినంతా తనతో గొనిపో యింది. రెండోరోజు మంచం మీద దొర్లుతూ కోలుకోటానికి ప్రయత్నిస్తు న్నాడు. చూడటానికి వచ్చిన నలుగురితో సాధ్యమయినంత తక్కువ మాట్లాడాడు. కిటికీకి చేరువగా కుర్చీ వేసుకుని ఒకే చిత్రాన్ని చూస్తూ గడిపాడు. మార్పు ఉండనిది. (ఆ కిటికీ తనకు బయటి ప్రపంచంతో సంబంధాన్ని కలిగించే ఏకైక మాధ్యమం). ఎవరో పిచ్చి చిత్రగాడు అది ముదిరినపుడు గీచిన చిత్రం. తెల్లగోడలు, పిచ్చిరాతలు, ఊడిన సిమెంటు పెచ్చులు వదిలిన గాయాలు. మంచం మీద వెల్లకిల పడుకుని చూస్తే దూలానికి ఊతగా పెట్టిన కొయ్య, బరువు భరించలేక పక్కకు తొలిగి, పగిలిన బిళ్ల పెంకులు.

ఎవరివో పాదరక్షల చప్పుడు వరండా గుమ్మం ముందు. వాళ్లెవరా అని తెలుసు కోటానికి ఆసక్తి ఎందుకు చూపాలి? ఎవ రైనా ఒకటే. తల పక్కకు కూడా మళ్లించ కుండా, కప్పును చూస్తూ ఉండిపోయాడు.

వచ్చింది వెంకటాచలపతి గారు. చాలా కాలమయింది ఆయన్ను చూసి. వీడు మారడు అన్న నిర్ణయానికి వచ్చి వుంటాడు, తనను చాలాకాలంగా పట్టించు కోవటం లేదు. విక్రమార్కుడిలా మరో సారి వచ్చాడు.

"ఒంట్లో బాగోలేదా? "

"నిన్న జ్వరం వచ్చింది. ఈ రోజు తగ్గి నట్లే వుంది. నీరసం అంతే"

"మందు వేసుకున్నావా? "

"వేసుకున్నా," సులువుగా పచ్చి అబద్ధం ఆడాడు.

"రోగం వచ్చినా, రొష్టొచ్చినా ఒంటరిగా ఎలా యాతనపడుతున్నావో చూడు? "

"జంటగా ఉన్నా ఎవరి రోగంతో వాళ్లే

తీసుకోవాలి కదా, బాబాయ్? "

"సపర్యలు చేయటానికి మరో వ్యక్తి ఉంటుంది. పిలిస్తే పలుకుతుంది. ధైర్యంగా, ఉపశమనంగా ఉంటుంది. ఇపుడు దిక్కూ మొక్కూ లేరు కదా"

"ఇపుడు నా రోగం నా రొష్టులతో ఏడ్చు కుంటే సరిపోతుంది. కుటుంబం ఏర్పడితే కనీసం మరో ముగ్గురికి ఏడుపులూ నేనే ఏడ్వాలి"

"సౌఖ్యం, ప్రేమ, భద్రత కుటుంబ జీవితంలో దొరుకుతాయి. ఆ జీవితంలో నెర వేర్చాల్సిన బరువు బాధ్యతల మొత్తం కన్నా సౌఖ్యం, ప్రేమ, సౌకర్యాల మొత్తం అధికం. అది ఒక వ్యక్తిగత, సామాజిక అవసరం కూడా. ఇన్ని వందల కోట్ల జనాభాలో నీలాంటి వాళ్ల శాతం ఎంత? అధిక సంఖ్యాకుల కంటే నేను తెలివయిన వాడ్ని అనుకోకు. అలా భావిస్తే అది అహంభావం, తెలివితక్కువతనం. మనిషికి ప్రేమ, వాత్సల్యం, సమష్టి జీవితం అవసరం. అవి కొరవడితే నీరందని మొక్కలా మనిషి ఎండిపోతాడు."

"ఎండిపోతే నష్టం ఏమిటి? ఉండిపోవాలని కోరుకున్నప్పుడు గదా, ఎండిపోకుండా ఉండటానికి తాపత్రయపడేది."

"రేపు వార్ధక్యంలోకి అడుగుపెడతావు. ఒంటరితనం మరీ దుర్భరంగా ఉంటుంది. నీ సొంతదైహిక అవసరాలకు కూడా మరో మనిషి తోడు అవసరమవుతుంది. అప్పటికి సమయం మించిపోయి ఉంటుంది. నీమొర ఆలకించేవాడెవడు? పని మనుషులను పెట్టుకుంటానని వితండవాదం చేయకు."

పెద్దాయనతో వాదన చెయ్యాలని లేదు. చెయ్యడానికి తన దగ్గిర సరైన కారణాలు లేవు. వాదనలకు ఎక్కడో ఒకచోట అంతం ఉండాలి. తను ఓటమిని అంగీకరించినట్లేనా? తను ఏ ఓటమి అంగీకరించలేదు. తను అంగీకరించినా, అంగీకరించకపోయినా ఓటమి ఓటమే.

"వారి సంబంధంరా, అబ్బాయ్ మంచి సంప్రదాయ కుటుంబం, బంగారంలాంటి పిల్ల. నీవు ఊఁ అంటే రేపే వెళ్లి చూడచ్చు. రేపు మంచిరోజు కూడా," లేడికి లేచిందే ప్రయాణమన్నట్లు అన్నాడు.

"అవును బాబూ, ఇది భేషైన సంబంధం. అమ్మాయి చక్కని చుక్క. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. సరిగమలు వచ్చు. అవసరం మేరకు చదువుకుంది," రెండో ఆయన ధైర్యం వచ్చినట్లు వత్తాసు పలికాడు.

"మనలాంటి మధ్యతరగతి సంప్రదాయ కుటుంబాల్లో అన్నివిధాలనచ్చే సంబంధాలు దొరకటమూ కష్టమవుతుందిరా. రోజులు మారుతున్నాయి. మగపిల్లలకు సరైన సంబంధాలు దొరకటం అరుదైపోతున్న దినాలివి," ఆఖరి సమ్మెట దెబ్బలా అన్నాడు.

అభిమన్యు మెత్తబడుతున్నాడని అనిపించి ఆ సంబంధం వివరాలు వెల్లడి చేస్తున్నాడు రెండో ఆయన.

"మీ ఇష్టం, బాబాయ్."

సొంత కొడుకు ఒప్పుకోక ఒప్పుకున్న సంతోషం కలిగింది ఆయనకు.

"నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. మా ఇంటికొచ్చి రెండ్రోజులుండి పో"

వాళ్లిద్దరూ వెళ్లిపోయారు. కళ్లు మూసుకుంటే నిద్రపట్టింది, వాళ్లతో ఇంతసేపు మాట్లాడిన అలసట కూడా నీరసానికి తోడై. నిద్రలో తను చదివిన ఒక కథనే కలగా కన్నాడు. ప్రసిద్ధమైన కథ.

కుటుంబ వ్యవస్థ పుట్టుక నేపథ్యంలో సామాజిక శాస్త్రవేత్తలు చమత్కారంగా ఒక సంస్కృత కథ చెబుతారు. ఆదిలో బ్రహ్మ స్త్రీని సృష్టిద్దామనుకున్నాడు. మగవాడిని సృష్టించడానికే సరుకు అంతా అయిపోయింది. ప్రత్యామ్నాయాన్నికై తీవ్రంగా ఆలోచించాడు. చంద్రుడి వృత్తాకారాన్ని,

## వారెవ్వా!



### మాన్ ఆఫ్ వార్ బర్డ్

మెడకింద ఎర్రని ఆపిల్‌ను సింగారించుకున్నట్లు కనబడే ఈ పక్షి పేరు ఫ్రిగేట్ బర్డ్. ఇతర పక్షుల మీద దాడిచేసి ఆహారాన్ని కొల్లగొట్టే దీన్ని సముద్రదొంగని కూడా అంటారు. ఆడపక్షుల్ని ఆకర్షించేందుకు మెడకింద ఉన్న ఎర్రని తిత్తిని ఇలా ఆపిల్‌లా ఉబికేలా చేస్తుందట. దీని సరసం బంగారంగానూ అనుకుంటున్నారు కదూ?!

పాకే మొక్కల వంపులని, లతల అల్లుకునే గుణాన్ని, గడ్డిపోచల ప్రకంపనలను, నీటి మొక్క సౌకుమార్యాన్ని, కుసుమాల వికసింపును, ఆకుల తేలికదనాన్ని, ఏనుగు తొండపు చివర గుండ్రతని, జింక చూపుల్ని, మేఘాల ఏడుపును, ప్రకంపనలను, గాలి చంచలత్వాన్ని, కుందేలు పిరికితనాన్ని, నెమలి అభిజాత్యాన్ని వగైరా వగైరాలను సేకరించి ఆ మిశ్రమంతో స్త్రీని తయారు చేశాడు. ఆమెను పురుషుడికి కానుకగా ఇచ్చాడు.

వారం రోజుల తర్వాత పురుషుడు బ్రహ్మ దగ్గిరకి పరుగెత్తుకొచ్చాడు. "ప్రభూ, నీవు నాకిచ్చిన జీవి నా జీవితాన్ని దుర్భరం చేస్తోంది. నేను ఆమెతో జీవించలేను. ఆమెను నీకు ఇచ్చెయ్యడానికి వచ్చాను. తీసుకో" అన్నాడు.

"చాలా మంచిది," అని ఆయన స్త్రీని తీసేసుకున్నాడు.

మరోవారం గడిచింది. పురుషుడు మళ్లీ వచ్చాడు. "ప్రభూ, ఆమెను నీకిచ్చిన తర్వాత నా జీవితం ఒంటరిదైపోయింది. ఆమె ఎలా నృత్యం చేసేదో, గానం చేసేదో, కను చివరల నుంచి నన్ను ఎలా చూసేదో, ఎలా నాతో క్రీడిస్తుండేదో, నన్ను అంటిపెట్టుకుని ఉండేదో గుర్తుకొస్తున్నాయి. ఆమె నవ్వు, సంగీత సదృశం, ఆమె సౌందర్యం తిలకించదగినది, స్పర్శ మృదువైనది. అందువలన ఆమెను తిరిగి నాకిచ్చెయ్" అన్నాడు. "చాలా మంచిది, గొని పొమ్ము," అన్నాడు బ్రహ్మ.

మూడురోజులు మాత్రం గడిచాయి. పురుషుడు మొహం వ్రేలాడేసుకొని సృష్టికర్త చెంతకొచ్చాడు. "ప్రభూ, ఇది ఎలా జరుగుతుందో నాకు తెలియదు. ఒక నిర్ణయానికొచ్చాను. ఆమె ఆనందానిచ్చే కన్నా కష్టాన్నే తెచ్చి పెడుతోంది. ఆమెను తీసేసుకో," అన్నాడు వాడు.

"చాలు వెళ్లు. ఇక ఈ విషయంలో నీ అంతట నీవు ఏం చేసుకుంటావో నీ ఇష్టం. నేను పట్టించుకోదల్చుకోలేదు," అన్నాడు బ్రహ్మ కోపంగా.

"నేను ఆమెతో కలిసి జీవించలేనే!"

"ఆమె లేకుండా గూడా జీవించలేవు."

"ఆమె ఉన్నా జీవించలేను; ఆమె లేకున్నా జీవించలేను," బుర్ర గోక్కుంటూ సణిగాడు పురుషుడు. ఆమె అతనితోనే ఉండిపోయింది.

**కుసుమాల వికసింపును, ఆకుల తేలికదనాన్ని, ఏనుగు తొండపు చివర గుండ్రతని, జింక చూపుల్ని, మేఘాల ఏడుపును, గాలి చంచలత్వాన్ని, కుందేలు పిరికితనాన్ని, నెమలి అభిజాత్యాన్ని సేకరించి ఆ మిశ్రమంతో స్త్రీని తయారు చేశాడు.**

రెండ్రోజుల తర్వాత ఆ ఊరు ప్రయాణం కట్టారు ముగ్గురూ. గంటం పావు ప్రయాణం. పెళ్లి ఆవశ్యకత గురించి నూరి పోశారు ఇద్దరు పెద్దవాళ్లు అభిమన్యుకి. వాళ్లిద్దరి దాడికి తట్టుకోలేక, "ఒకటి కాదు, రెండు సంబంధాలు ఒకసారి చూడండి బాబాయ్. ఒకేసారి రెండు పెళ్లిళ్లూ చేసుకుంటా. పెళ్లి అంత అద్భుతమైనది కదా, ఒక్క దాంతో సరిపుచ్చుకోవడం ఎందుకు?" అన్నాడు అభిమన్యు.

బస్టాండుకు పిల్ల తండ్రి వచ్చాడు. ఆయన చంకలో వెలిసిపోయిన గొడుగు, వెంట ఆయన కొడుకు ఉన్నారు. ఆయన బడిపంతులుగా ఉద్యోగ విరమణ చేశాడు. బాధ్యతలు మాత్రం పాపం మిగిలే ఉన్నాయి. అబ్బాయి ఏదో ఉద్యోగంలో ఈ మధ్యే చేరాడు. ఉత్సాహంగా ఉన్నాడు కుర్రవాడు.

సందులగుండా రిక్షాలలో ప్రయాణంచేసి ఆ ఇల్లు చేరారు. ఆరుగంటల సమయం అయింది. ముందు వరండాలో కూర్చొబెట్టారు. దానికి వీధి వైపు కటకటాలు, చెక్క

# ప్రేమ జంట - రెండు పెళ్లిళ్లు





**మొ**దటిసారికన్నా రెండోసారే ప్రేమ అనేది గట్టిగా ఉంటుందన్న విషయం డొరోథీ హోవార్డ్ ప్రోజాల విషయంలో రుజువైంది. తమ మొదటి వివాహం, విడాకులు అయిన నలభై ఏళ్ళ తర్వాత తిరిగి వారిద్దరూ వివాహం చేసుకున్నారు!

1932లో మొదటిసారి వారివురికి పరిచయం కల్గింది. అప్పట్లో డొరోథీ వయసు 15. హోవార్డ్ వయసు 16. న్యూయార్క్ రాష్ట్రంలోని రోఛిస్టర్ అనే ఊళ్ళోని ప్రిబెస్ట్రియన్ చర్చిలో వీరిద్దరికీ పరిచయం అయింది.

1937లో జూలై 17న వారిరువురికీ వివాహం జరిగింది. డొరోథీ వయసప్పుడు 20. హోవార్డ్ వయసు 21. నాలుగేళ్ల తర్వాత వారికి గెరాల్డ్ అనే కొడుకు పుట్టాడు. హోవార్డ్ ఓ ఫ్యాక్టరీలో టూల్ అండ్ డై మేకర్‌గా రాత్రుళ్ళు పనిచేస్తే, డొరోథీ పేరోల్ క్లర్క్‌గా ఉదయం పనిచేసేది. ఆ తర్వాత 16 ఏళ్ళు సజావుగా ఉన్నాక వారిద్దరూ తమ వివాహమైన 20 ఏళ్ళకి విడాకులు తీసుకున్నారు.

తను పనిచేసే కంపెనీ వైస్ ప్రెసిడెంట్‌ను డొరోథీ వివాహం చేసుకుంది. 11 ఏళ్ళ తర్వాత ఆ వివాహం కూడా విఫలం అయింది. అయితే హోవార్డ్‌ని ఆమె మర్చిపోలేకపోయింది.

హోవార్డ్ కూడా పునర్వివాహం చేసుకున్నాడు 1996లో అతని రెండో భార్య మరణించాక అతను లాస్‌వెగాస్‌లోని తన మొదటి భార్య దగ్గరికి థాంక్స్ గివింగ్‌డే రోజు విమానంలో ఓ పూలగుత్తితో వెళ్ళాడు. ఆమె ఇంటి డోర్‌బెల్ మోగించాడు. ఆమె తలుపు తెరిచాక ఆ పూలగుత్తిని ఆమె చేతిలో వుంచి చెప్పాడు-

"హాయ్! నిన్ను చూసి చాలారోజులైంది ?"

అతన్ని సంభ్రమంగా ఆహ్వానించిందామె. చాలాసేపు వాళ్ళు మాట్లాడుకున్నాక ఒకరినొకరు తిరిగి పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నారు.

నలభైఏళ్ళు ఎడంగా ఉన్నాక 1997లో వారి వివాహం చర్చిలో జరిగింది.

వారి మొదటి వివాహం భగ్నం కాకుండా వుండి ఉంటే, ఆరోజు వారి 60 వ వివాహ దినోత్సవం అయివుండేది!



తలుపులు ఉన్నాయి. కాస్త వయ సుమల్లినామె వచ్చి వరండాలో ఎందుకు లోపలి గదిలో కూర్చుందురుగాని రండి అంది, వరండాలో కూర్చోబెట్టడం అంత మర్యాదగా ఉండదేమోనన్న శంకతో. ఇక్కడ బాగానే ఉందని అభిమన్యు అన్నాడు. అతని అభిప్రాయాన్ని గౌరవించటానికి వాదించకుండా వెళ్లిపోయింది. మబ్బులు ఆవరించి ఉండటం వలన చీకటి త్వరగా అలముకుంటోంది. ఆలస్యం అయితే బస్సులు దొరుకుతాయో లేదో తెలీదు, తిరుగు ప్రయాణానికి. పైగా వర్షం రావచ్చు దానిష్టం. ఒంట్లో నీరసం పూర్తిగా వదలలేదు సరికదా, ప్రయాణ అలసట ఒకటి. ఆఖరి సీటులో కూర్చోడం వలన ఒళ్లంతా హూనం అయింది. అసలు నీరసం మాట అటుంచి, జ్వరం పూర్తిగా తగ్గిందా అన్న అనుమానం.

"విషజ్వరం కదా నీరసం త్వరగా వదలదురా, అబ్బాయ్."

అమృత జ్వరాలుంటాయా అన్న సందేహం కలిగి నవ్వు వచ్చింది అభిమన్యుకి.

"ఏం? " అన్నాడు వెంకటాచలపతి, అతని మొహం మీది నవ్వు చూసి.

"ఈ స్థితిలో పెళ్లిచూపులేంటి అని"

"ఫర్లేదు, ఫర్లేదు," అన్నాడాయన.

ఆ భావం అర్థం కాలేదు అభిమన్యుకి.

ఇందాకటామె, 'అంతా సిద్ధంగా ఉంది, లోపలికి రండి' అని ఆహ్వానించింది. అంతా సిద్ధం అంటే అలంకరించిన పూబోడిని కుర్చీలో కూర్చోబెట్టి చూడటానికి సిద్ధపరిచారన్న భావం అయివుంటుంది.

అప్పుడు కరెంటు పోయింది. వరండా గదిలోనే



కటకటాలు లెక్కబెడుతూ మరో పదినిముషాలు గడిపారు.

"వర్షం వచ్చేట్లుంది, పైగా బస్సులు దొరుకుతాయో లేదో. ఇది ముగించుకుంటే మంచిది కదా," అభిమన్యు వెంకటాచలప

తితో అన్నాడు.

కరెంటు వస్తుందేమోనని కదరా చూడటం..."

"అది రాదు లెండి," ఆయన మాటలు మధ్యలో పెడసరంగా అడ్డుకున్నాడు, తను పెళ్లాడటం ఆయన కేదో ఉపకారం అయినట్లు.

ఆయన లోపలికి విసవిసా వెళ్లి ఏదో మాట్లాడాడు. నిముషంలో హాల్లోకి తీసుకెళ్లి కూర్చోబెట్టారు. అంతకు ముందున్న కొవ్వొత్తులకు తోడు అమ్మాయి తమ్ముడు ఉత్సాహంగా మరొకటి వెలిగించి పెట్టాడు. రాస్ హిల్ మీద మేరీమాతకు కొవ్వొత్తులు వెలిగించి పెడతారు సంవత్సరానికొకసారి. ఎవరో తోడుగా అమ్మాయి వచ్చింది కూర్చుంది. కుర్చీ చేతుల మీద తన చేతులు ఉంచుకోవాలా, ఒళ్లో ఉంచుకోవాలా అని కొద్దిక్షణాలు ఊగిసలాడి, ఒళ్లోనే ఉంచుకుంది. అమ్మాయి కుడివైపు గోడకు కొవ్వొత్తి వెలుగుతోంది. ఎడమవైపు అలాంటి సదుపాయం లేకపోవటం చేత ఎడమవైపు భాగం కాస్త చీకటిలో ఉండి పోయింది. ఎడమవైపు గోడమీద ఆమె నీడ పడుతోంది. అమ్మాయి ముక్కు గోడమీది నీడలో కదులుతోంది. నీడ ముక్కు పొడవుగా తోచింది. ఆమెకు అంత ముక్కుందా అని ఆమె ముఖం చూశాడు. సరిపడా ఉండటమేగాక, అందంగా ఉంది. అది అందంగా ఉండటమేగాక దానికి పొదిగినట్లు నక్షత్రంలాటి ముక్కుపుడక కూడా ఉంది. నీడ ఎంత అబద్ధం ఆడుతోంది, కొవ్వొత్తి సాక్షిగా! అంత అందం ఉండి కూడా, జీవితంలో ఎన్నో, ఇంకెంతో కొరవడినట్లు ఆమె విచారంగా ఉంది. విచారానికి ఏ కుంచె అన్నా చిత్రరూపం ఇస్తే అది ఆమె అవుతుంది. ఆమె కూర్చున్న రీతిలో నిస్పృహ యత కొట్టొచ్చినట్లు కని



పిస్తోంది. "వీడు ఊc అంటాడా, ఉహూ అంటాడా" అన్న ఆలోచన తొలిచేస్తున్న ట్లుంది. మరొకసారి అవమానానికి, నిరాశకు, అహం మీద పడబోయే దెబ్బకు మానసికంగా ఆయత్తం అవుతున్నట్లుంది.

విషజ్వరం తనకు సోకింది. ఒకేరోజు గాని దాని ప్రభావం నిస్సత్తువ రూపంలో కొనసాగుతూనే ఉంది. చెమటలు పడుతున్నాయి లోపల వేడికి ఆవిరులలాగ- ఎవరో విసనకర్ర తెచ్చి ఇస్తే, వాళ్ళు ఇచ్చింది తను ఎందుకు ఉపయోగించుకోవాలన్నట్లు కుర్చీ పక్కన జారవిడిచాడు. ఎవరికన్నా ఇస్తే వాళ్లయినా ఉపయోగించుకునేవాళ్లేమో అనుకున్నాడు జారవిడిచిన తర్వాత. గడ్డివామిదగ్గిర కుక్క గుర్తుకొచ్చింది.

"అమ్మాయికి ఎడమవైపు కొవ్వొత్తి పెట్టండి," అన్నారెవరో.

"అక్కర్లేదండీ," అన్నాడు కలుగజేసుకుని అభిమన్యు. అనవసరంగా నోరు విప్పా అనుకున్నాడు తర్వాత మనసులో. సిగ్గుపడి తలవంచుకున్నాడు. తన సిగ్గు గమనిస్తారేమోనని తల ఎత్తాడు.

అతను మొహమాటపడుతున్నాడనో, అతని మాటలు పట్టించుకోకపోవటం చేతో కొవ్వొత్తి ఎడమవైపుంచారు. "కొవ్వొత్తి నా దగ్గిరగా పెట్టండి, నేనూ కనిపించాలిగా" అన్నాడు. ఏంటీ తను ఎంతగా మాట్లాడుతున్నాడు, తన మనసుతో నోరు విడాకులు తీసుకున్నట్లు?

తను మాట్లాడింది హాస్యంగా ధ్వనించాలని బాబాయి పెద్దగా నవ్వాడు. ఆయనతో మరికొందరు నోరు కలిపారు. ఆ అమ్మాయి తల మరికొంత వంచి చిరునవ్వు నవ్వింది. హాల్లో వెన్నెల విరబూసింది. ఆమె మీది నించి చూపు మరల్చి ఆమె నీడను చూస్తున్నాడు, పాత జ్ఞాపకం దేన్నో తవ్వుతున్నట్లు. అబద్ధానికి ప్రతిరూపంలాంటి నీడే బాగున్నట్లు దానికి చూపును గుచ్చి ఉంచాడు. ఆమే ఆమె నీడ, ఆమె నీడే ఆమె అన్నట్లు రెండు కళ్లు దానికే అప్పగించాడు. ముక్కు ప్రతి నిముషానికీ పెద్దదవుతోంది. అది ముక్కు నీడలాకాక బాకు నీడలా ఉంది. పొడుస్తా, పొడుస్తా అన్నట్లు వెనుకకు ముందుకు కదులుతోంది. ఆమె ఎడమ కంట్లో చీకటి మనసూ హృదయంలేని, ప్రాణమున్న బొమ్మలా ఉంది. మాంసపు పోగు చాటలతో తెచ్చి మనిషి ఆకృతిలోకి మలిచినట్లుంది.

అమ్మాయి ప్రక్కన నిలబడ్డామెను చూశాడు. గుడ్డి వెలుతురు, నీడల నేపథ్యంలో పట్టుచీరెలో మెరిసిపోతూ, పెళ్లి చూపులు తనవి కానందుకేమో చిరునవ్వుతో, అందంగా, ఆనందంగా ఉన్నది. ఆమెనే అలా చూస్తూ ఉండాలనిపించింది; ఆమె అందం మీద తీర్పు ఇవ్వవలసిన అవసరం ఉండదు కాబట్టి. పిచ్చివాడిగా మారిపోతున్నానే అని దిగులుపడ్డాడు. మరోక్షణంలో:

"మానసిక వేదన, కుశంకలు, బిడియాలు, కోరికలు, భయాలు, నిరర్థక జీవితంలో అర్థం వెదుక్కునే సోమరి, అనవసర వ్యాపకం అన్నీ పిచ్చిదనంతో లేస్తుంది."

ఉన్నట్టుండి లేచిపోయాడు, పిచ్చాస్పత్రికి వెళ్లటం ఆలస్యం అవుతుందేమో, బస్సులుండవేమో అన్నట్లు.

"ఇంకా సమయం ఉంది.. ఫరవాలేదు. బస్సులు దొరక్కపోతే ఈ పూట ఉండిపోవచ్చు."

"కూర్చోండీ! ఏమైనా అడగండీ! మౌనంగా ఉంటే ఎలాగండీ!" అని రాగయుక్తంగా అన్నది పట్టుచీర సౌందర్యవతి, వీణా నిక్వాణం లాంటి కంఠస్వరంతో.

"ఏమడగమంటారూ? "

ఆ ఎదురు ప్రశ్న వేసినప్పుడు మొహంలో చిరునవ్వు మొలిచివుంటే అది

మొరటుగా ధ్వనించి ఉండేదికాదు కదా అని పశ్చాత్తాపపడ్డాడు. బాబాయ్ గట్టిగా నవ్వినా బాగుండేది. వాడు చచ్చినప్పుడల్లా నేనెలా చస్తానని వదిలేసినట్టున్నాడు బాబాయ్. పాపం! బాబాయ్ పుణ్యానికి పోతే పాపం ఎదురవుతున్న మా మంచి బాబాయ్. ఎవరికెవరు ఈ రోజుల్లో కదూ, బాబాయ్?

నిజంగానే, ఏమడగాలి ఆ అమ్మాయిని? అడగటానికి ఏమీ లేకపోతే, "అడగటానికి ఏ ముంటాయిలెండి..." అని మర్యాదగా నసిగితే పోయేది. వాళ్లు ఏం అపకారం చేశారని ఎదురు ప్రశ్నించాడు? వాళ్లంతా మంచి మనుషులు. మానవ సమాజంలో జీవించే అర్హత కలవారు. తనకన్నా అధి కులు. తనకేదో కష్టం వచ్చింది, పరామర్శ చేద్దామని తనను చుట్టుముట్టినట్టున్నారు. పద్మవ్యూహంలోని శత్రువులు కాదు. తనకు మర్యాద మీద పాఠాలు నేర్పటానికి అర్హతంతా ఉన్న ఉపాధ్యాయులు.

తను బహిరంగ క్షమాపణ చెప్పాలి, ముఖ్యంగా ఆ స్త్రీ మూర్తికి.

"అమ్మా! నన్ను క్షమించు. పెళ్లిచూపుల పేరుతో వచ్చి నిన్ను ఈ స్థితికి తెచ్చిన తప్పిదానికి రేపు నేను చెప్పబోయే సమా ధానంతో నీ గుండెకు గంటుపెట్టబోతు న్నందుకు. క్షమించ లేకపోతే నన్ను చంపు, నీ నీడ ముక్కుతో. దుష్టశిక్షణకు గాను నీకు పుట్టెడు పుణ్యం వస్తుంది." ఆమె పాదాలు వెదికాడు.

రెండు మూడు రకాల బిస్కెట్లు, గిన్నె లాంటి సాసర్లో దిగేసిన కాఫీ గ్లాసును ముందుంచారు. పాలరంగు, డికాక్షన్ రంగు, కాఫీరంగు నురగ ఆ కుర్రాడి ఉత్సా హంలా ఉంది; ఊరిస్తోంది, పొంగి. కమ్మటి కాఫీ తెచ్చి తనను తాగమని అడుగుతున్నారు తను చేస్తున్న అపచారం, అపకారం వాళ్లకు చేస్తున్న, చేయబోతున్న ఉపచారం, ఉపకారంలా. ఎంతో సంస్కార వంతులు. సుమతీ శతకకారుడి ఉద్బోధ వాళ్ల రక్తంలో జీర్ణించుకున్నట్లుంది. ధర్మం వాళ్లవల్లే కనీసం ఒంటి కాలుమీద నడు స్తోంది.

వాళ్లు తనకు బాకీ ఉన్నట్లు బిస్కెట్లు తిని, చప్పరిస్తూ కాఫీ తాగాడు. వచ్చిన పని అయిపోయినట్లు లేచి నిలబడ్డాడు. మిగితా వాళ్లూ లేచి నిలబడ్డారు సాగనం పటానికి.

ఊరు చేరారు, వర్షం వాత పడకుండా. బస్టాండు నుంచి ఎవరిదారిని వాళ్లు వెళ్లి పోతున్నప్పుడు మధ్యవర్తి వినకుండా, "ఏమంటావురా, అబ్బాయ్?" అడిగాడు వెంకటాచలపతి.

"మరొకటి చూద్దాం, కొద్దిరోజులాగి"

ఆయన ఒక కంటిలో అశ్రుకణం, మరో కంటిలో విస్ఫులింగం, రెండింటిలోనూ విస్మయం. మరోమాట మాట్లడకుండా, మాటలతో శపించకుండా, విసవిస నడిచి వెళ్లిపోయాడు. ఆయన మరో సంబంధం చూడటం మాట అటుంచి తన ముఖం చూడడు. ఒక మర్యాదస్తుడిని ఇరకా టంలో పెట్టాడు. మంచం మీద వాలేసరికి విషజ్వరం తిరగబెట్టింది శిక్షలా. ఆనందప డ్డాడు.

## 12



వారం రోజుల తర్వాత జ్వరం తగ్గింది. మంచం మీద వెల్లకిల పడుకుని ఉన్నాడు. జీవితం డొల్లగా ఉంది. అలా ఉండటమ

నేది నేటి నూతన అంశంకాదు. తనకేం కావాలి? ఏది అందితే జీవితం నిర్జీవంగా, నిరాసక్తంగా ఉండదు. ఏం అందినా, ఒక జీవితకాల జ్ఞాపకాల బరువు, అనుభవాల ప్రభావం మోస్తున్న తనకు జీవితం మీద మమకారం కలగదేమోనన్న నమ్మకం. అది అపనమ్మకమైతే ఎంత బాగుండు. ఎందుకు బతుకుతున్నదీ బతికే తనకే తెలీదు.

కదిలితే మంచం కిర్రుమంటుంది. ఆ శబ్దం కూడా మేఘం మీది మెరుపులా గుండెను కోస్తుంది. కదలకపోతే చెయ్యి తిమ్మిరెక్కుతుంది. కదిలే క్యాలండరు గోడను కొరుక్కుతింటు తనను త్రుళ్లిపడేలా చేస్తుంది? లేచి దాన్ని చింపి పారేయాలనిపిస్తుంది అది చేసే హింసకు. దానితో, అది చూపే కాలంతో తనకేంటి పనీ? లేవలేని శరీరపు అశక్తత. బుర్ర ఒక భూగోళం, భూగోళంలో భూగోళం. పైగా దిండు కంపొకటి. కన్నీటితో తడిసి కొడుతున్న కంపేమో. కన్నీరూ కుళ్లుతుందేమో.

అమ్మయ్య, పక్కకు పొర్లాడు మంచానికి తెలియకుండా. దూలం విరిగిపడితే ఎక్కడ పడుతుంది? సరిగ్గా తన మీద. మంచాన్ని కావాలనే అలా ఉంచాడు. కావాలన్నది ఎలాగూ జరగదు అన్న ధీమా ఉందేమో! తలను కదల్చకుండా చూపును కాస్త విస్తరిస్తే చిన్నబాల్చీ చేంతాడు. చేంతాడు పొడవు నీరు తోడటానికి ఎక్కువ, తను మెడకు చుట్టుకుని వేలాడటానికి ఎక్కువ. దూలం, చేంతాడు నీదే ఆలస్యం అంటాయి. ఆ ఒడ్డున ఏముందో తేలీకుండా వీటి ఉచ్చులో తల ఎందుకు దూర్చాలి. అవతలి ఒడ్డు భాగోతం అటుంచి, నీకు ధైర్యం ఏదయ్యా, ధైర్యం. ఈ మంచం, ఆలోచనలు చావకుండా చంపుతున్నాయి.

ఇప్పుడు ఏం చేస్తే పోతుంది?

"ఒంటరితనం" అన్న మొపాసా కథలో ముఖ్యపాత్ర అంటుంది. "మానవ జీవితంలోని రహస్యాలలో ఒకదాన్ని నేను ఛేదించాను. మనం శాశ్వత ఒంటరి జీవులం అన్న సత్యం కారణంగా మన అస్తిత్వంలో ఒక గొప్ప వేదనకు లోనవుతున్నాం- మన అన్ని చర్యలు, చేతలు ఒంటరితనం నుంచి పారిపోయే దిశగా ఉంటాయి". ఫ్లాబే అన్నాడట "మనందరం ఎడారిలో ఉన్నాం. ఒకరికొకరం అర్థంకాం". మానసిక ఒంటరితనం నుంచి ఎవరిని ఎవరూ ఆదుకోలేరు, భౌతికంగా కూడా ఒంటరిగా ఎందుకు జీవించటం?

**"మనందరం ఎ డారిలో ఉన్నాం. ఒకరికొకరం అర్థంకాం". మానసిక ఒంటరి తనం నుంచి ఎవరిని ఎవరూ ఆదుకోలేరు, భౌతికంగా కూడా ఒంటరిగా ఎందుకు జీవించటం?**

"అబ్బాయ్, జంటలుగా జీవించటానికే సృష్టించబడినాముర మనం!" 'ఆ' పని చేయటం ద్వారా మరో సంసార కష్టాల వలయాన్ని సృష్టించుకోవడమే. మూడో మార్గంలేదే! జంటగా జీవించటమనేది కేవలం ఒకరి భౌతిక అవసరాలను మరొకరు తీర్చడానికే కాదు. స్త్రీ అంటే 'స్తనముల భారముతో వ్యాప్తమయిన నాభీ ప్రదేశం కలది' మాత్రమే కాదు. ఆమె పూర్తి శరీరం గురించో, లేదంటే ఆ ఒక్క ప్రదేశం గురించో స్త్రీని వాంఛించినప్పుడు అది మాంసము, వస మొదలగు వానివలన ఏర్పడిన రూపము అని భావించి, ఆమెపట్ల విముఖత ఏర్పరచుకునే ప్రయత్నం సాధ్యపడితే చేయవచ్చు. ఈ మంచంలో ఆలోచనలతో గడపటం అంటే అంపశయ్య మీద శయనించినట్లే. జీవిత సమరంలో క్షతగాత్రుడై ఈ అంపశయ్యపై

పవళించి ఉన్నాడు. స్వచ్ఛంద మరణావకాశం లేదు. దక్షిణాయనం వరకో, ఉత్తరాయనం వరకో వేచి ఉండగల వరం లేదు. జీవిత సమరాంగణంలో అయిన మానసిక గాయాలు ఎప్పుడు కనికరిస్తే అప్పుడే దేహం చాలించటం.

అంపశయ్య వదిలి ఇంటి వెనుక పిచ్చి మొక్కల్లోకి వెళ్లాడు. రకరకాల పూలు. పేదపూలు, ఎవరూ కోరుకోనివి, కోయనివి. కానీ ఏ కుంచె సృజియించ లేనివి. పిచ్చి పూలను కన్న వెర్రిమొక్కలు. ఆప్యాయత వెర్రి పట్టిన మొక్కలు. మేం ఎందుకున్నాం అని తమను తాము ప్రశ్నించుకునే మెదడురోగమేదీ లేని; జీవించి, పుష్పించి, ఏ ఫిర్యాదు చేయకుండా మరణించే మొక్కలు. అందుకోని జనానికి అందుబాట్లో ఉంటాయి. సృష్టి కాన్వాస్‌లా తడినేల. స్వీయ శరీరానికి తప్ప జీవితంలో దేనికీ, ఎవరికీ ఉపయోగపడని బలహీనపు చేతులు; విషజ్వరం గానుగలా పిప్పిచేసి వదిలిన మిగతా శారీరక భాగాలు- శిథిల మనసును కాపలా కాచే మొండి గోడలు.

మొక్కల్లో వాటి పర్యవేక్షణకు వచ్చి ఆమోదం తెలుపుతున్న, తోకాడించే నలుపు తెలుపుల కుక్కపిల్ల. తన జన్మకు తాను ఆనందిస్తున్నట్లుంది, కృతజ్ఞతలు తెలుపుతున్నట్లు ఉంది. మూతిని నేలకు తాకిస్తూ, మొక్కలను ఆప్యాయంగా స్పృశిస్తూ, ప్రేమగా చెవులు ఆడిస్తోంది. వెర్రికుక్కకి ఎందుకంత ఆనందం. వెర్రికుక్క కాబట్టా? పిడికెడు మెతుకులు చాలు సంతృప్తి చెందటానికి, కొండంత విశ్వాసాన్ని బదులుగా చూపటానికి. తనవైపే వస్తోంది ఆత్మీయంగా, తాను దాని ఆత్మ బంధువున్నట్లు. పాదం నాకుతోంది; తనకు అక్కరలేని తన రుచిలేని దేహాన్ని- ప్రియంగా, ప్రేమగా.

మొక్కల్లో గొంతుకూర్చుండిపోయి కుక్కపిల్లని చేతుల్లోని తీసుకున్నాడు. దానిని ప్రేమగా తడుతూ తలమీద ముద్దు పెట్టుకున్నాడు. హాయిగా, వెచ్చగా, ఆత్మీయంగా పలకరిస్తూ తనను, కుక్కను ఎండ తాకుతోంది- తమతో అనుబంధం వున్నట్లు.

అయిదు నిముషాల తర్వాత ఒక నిర్ణయం తీసుకున్నాడు.

ఆ సాయంత్రం ఇంటినుంచి బయలుదేరాడు. పాత పోస్టాఫీసు బస్టాపుకెళితే అక్కడినుంచే బస్సులు బయలుదేరుతాయి కాబట్టి లోపల సీటు దొరుకుతుంది, కూర్చుని ప్రయాణం చేయవచ్చు. కొత్త రోడ్డు దగ్గిర బస్సు పట్టుకుని పాత పోస్టాఫీసు దగ్గిర దిగాడు.

బస్సుల గురించి నిలబడి నిలబడి, కాళ్లు సగం చచ్చుబడి, అర్ధశవాల్లాంటి మానవాకారాలు కూడలి మధ్యలోని ఆర్టీసీవారు కార్యాలయంగా ఉపయోగించుకుంటున్న పగోడలాంటి కట్టడపు రెయిలింగ్ మీద పక్షులలా వాలి ఉన్నాయి. కోటవీధి నుంచి- సీసా పురుగులతో నింపి, బిరడా కొట్టి, కాసేపుంచి దాన్ని తీసినపుడు అవి బిలబిలా బయటికి వచ్చినట్లు వస్తున్న జనం. తుప్పురంగు రాతితో కట్టిన సెయింట్ అలోషియస్ భవన సముదాయం కొమ్ములతో ఆకాశాన్ని పొడుస్తోంది. కాఖీ దుస్తుల హార్బరు కార్మికులు స్టీలు కేరియర్లు పక్కనుంచుకుని రెయిలింగ్ గట్టు మీద కూర్చున్నారు. కాలక్షేపం గురించి చుట్టలు తాగుతూ, ఉమ్ముతూ, మాట్లాడుతూ, బూతులు తిట్టుకుంటూ, విరగబడి నవ్వుతున్నారు. ఆ నవ్వు రేపటినుంచి ఉండకపోవచ్చునేమో అన్నట్లు నవ్వుతున్నారు.

బస్సు వచ్చింది. జనాన్ని దిగనిచ్చి, మిగతా వాళ్ళని ఎక్కనిచ్చి లోపలికెళ్లాడు. మధ్యసీటు చూసుకుని కూర్చున్నాడు. డ్రైవరు, కండక్టరు దిగిపోయి పది నిముషాల తర్వాత బస్సెక్కారు. ఈలోగా అది

కాస్త నిండింది. జనాన్ని మోసుకుంటూ, జనాన్ని ఈదుకుంటూ ఊరంతా తిరిగి, అమెరికన్ ఆస్పత్రి వద్ద మలుపు తిరిగి పాతాళంలోకో, సముద్రంలోకో వెళ్లబోతున్నట్లు పల్లందిగి, రామకృష్ణ మిషన్ దగ్గర ఆకాశానికి వేసిన సోపానం ఎగబాకుతున్నట్లు మెరక ఎక్కి వెళుతోంది. అది చేయని విన్యాసం లేదు.

అతను బస్సు దిగటానికే కొద్ది నిముషాలుగా నిరీక్షిస్తున్న వర్షం అది జరగంగానే కుండలతో కుమ్మరించటం మొదలు పెట్టింది. జీవితంలో జరిగే ఉన్మాద సంఘటనలా, వైద్యాలయం నుంచి పారిపోయి వచ్చిన ఉన్మాదిలా అప్పటికప్పుడు మబ్బులు గుమికూడి కుమ్మరిస్తున్నాయి. పరిమితమైన పరిధిలో వీరంగం సృష్టిస్తోంది వృష్టి, అర్థరహితంగా, నిర్హేతుకంగా. కార్యాకారణ సంబంధం లేని సంఘటనలు, చర్యలు ఉంటాయని చెప్పుకుంటే అతార్కికమైనది కూడా తార్కికమై కూర్చుంటుంది. అప్పుడు "ఇంతకూ నీవెందుకు కురుస్తున్నట్లు? " అని గుండెలు బద్దలయ్యేలా ప్రశ్నించటం కాస్త తగ్గుతుంది. రెండు నిముషాలు చాలు ఆ ఇంటికి చేరటానికి. ఒక్కనిముషం చాలు తడిసి ముద్దవ్వటానికి. ఆ ఇంటికి అంత చేరువగా ఉన్నా వర్షం ఒక అగాధం సృష్టించింది. ఇప్పుడు ఆశ్రయం కావాలి. రెండు చేతులు తలపై కప్పుగా చేర్చి సైకిల్ షాపులోకి దూరాడు. పావు గంటకు వర్షం అదృశ్యం అయింది, తన రాక గుర్తులు మాత్రం వదిలి.

చిదంబరంతో కాని, అతని కుటుంబంతో కాని ఏ సంబంధాలు, పరిచయాలున్నాయని వాళ్లింటికి పదేపదే రాగలడు? పాతదే; వేధించే ప్రశ్న. చిదంబరం ఆస్పత్రిలో ఉన్నపుడొచ్చాడు. అతను పోయిన తర్వాత వచ్చి వాళ్లను కలవకుండా మొహం చాటేశాడొకసారి, తర్వాత వచ్చి లలితతో మాట్లాడాడు. చిదంబరం భార్యను పరామర్శించటానికి ఇంకొకసారి వచ్చాడు- అంతే. సముద్రపు ఒడ్డున తల్లి, కూతురు కనిపించగా ఒక అరగంట గడిపాడు వాళ్లతో. వాళ్లింటికి వెళ్లటానికి ప్రతిసారి ఒక మిష ఉంటూ వచ్చింది. ఇప్పుడు తను వెళుతున్న పని సానుకూలం కాకపోతే వాళ్లకూ తనకూ రాంరాం. తమ మధ్యది ప్రయాణ పరిచయంగా మిగులుతుంది.

విషయం ఎలా మొదలు పెట్టాలి. చెప్పదలచిన దాంట్లో మాటల పొందిక ఎలా ఉండాలి అన్న జంట ప్రశ్నలు బయలుదేరిన వెంటనే జోరీగల్లా చుట్టుముట్టాయి. రాతిమెట్లు ఎక్కేదాకా రావద్దని తోలేశాడు. ఇదిగో, ఇప్పుడు వాటిమీదే నిలబడి ఉంది. జుమ్మంటూ పరిభ్రమిస్తున్నాయి. సమాధానం దొరికే వరకు అక్కడే నిలబడి ఉండటం సాధ్యపడదు. ఎంతసేపవుతుందో అది. కాలయాపన అయితే చిక్కబట్టుకొచ్చిన మనసు పగ్గాలు తెంచుకుని వెనక్కి మరలిపోతుంది. లోపల కూర్చుని కాఫీ తాగుతూ ఆలోచించవచ్చు. సాధ్యమయినంతమేర కాలపు అంచుకు జరుపుకుంటూ పోవచ్చు.

లోపలికెళ్లి చూరుకింద నిలబడ్డాడు తనకు తెలీకుండానే.

"లోపలికి రాండి. చూరుకింద నిలబడితే మరింత తడుస్తారు"

మొదటిసారిగా ప్రదర్శనకై రంగస్థలం మీదకు అడుగిడుతున్నట్లుంది ఇంట్లో కెళుతుంటే?

"బస్సు దిగంగానే ఆరంభమయింది. అక్కడే ఆగిపోవలసి వచ్చింది"

"లలితా ఎక్కడో చిక్కిపోయి ఉంటుంది"

వరండాలో చెప్పులు వదిలేశాడు. రుమాలుతో తల అద్దుకుని జేబులోకి జారవిడిచాడు.

"ఫ్యాను కింద కుర్చీ వేస్తాను, కూర్చోండి"




# దేవుడిచ్చిన బిడ్డ



కెనడాలోని ఒంటారియో ప్రాంతంలోని లండన్ అనే ఊరికి చెందిన కరేన్ వయసు 32. ఆమెకి ఆరేళ్ళ క్రితం ఓ సూపర్ మార్కెట్‌లో పాల విభాగం మేనేజర్‌గా పనిచేసే 37 ఏళ్ళ జాన్‌తో వివాహమైంది. అయితే వారు కోరుకున్నట్లుగా కరేన్ ఎంత కాలమైనా గర్భవతి కాలేదు. దాంతో వారు నెలనెలా ఆశగా ఎదురు చూడసాగారు. కానీ సంవత్సరాలు గడిచిన ఆమె గర్భవతి అవలేదు.

డాక్టర్ల దగ్గరికి వెళితే కరేన్‌కి మందులు ఇచ్చారు. కరేన్ అండాన్ని బయటికి తీసి టెస్ట్ ట్యూబ్‌లో జాన్ వీర్యకణంతో ఫలదీకరణ చేసి దాన్ని కరేన్ గర్భాశయంలో ప్రవేశపెట్టారు. అలా మూడుసార్లు చేసినా ప్రయోజనం లేకపోయింది.

కొంత కాలానికి కరేన్‌కి ఎండోమెట్రియోసిన్ అనే ఆడవాళ్ళకి వచ్చే జబ్బు వచ్చింది. దాని వల్ల ఓవరీస్‌లో ఫాలోపియన్ ట్యూబుల్లో ఆటంకం ఏర్పడటంతో గర్భం రాకుండా ఆగిపోతోంది.

ఆ జబ్బువల్ల నొప్పితో బాధపడే కరేన్ డాక్టర్ దగ్గరికి వెళితే హిస్టరెక్టమీ ఆపరేషన్ చేసి, ఆమె గర్భాశయాన్ని తొలగించడమే తగిన చికిత్స అని నిర్ణయించారు.

మార్చి 7, 1993. ఆ రోజు వర్షం పడుతోంది. విక్టోరియా హాస్పిటల్‌కి భార్యతో తన కారులో బయలుదేరాడు జాన్. ఇద్దరి మనసు నిండా బాధ! ఇక తమకి పిల్లలు పుట్టే అదృష్టం లేదని వర్షం వల్ల ఆన్ చేసిన వైపర్స్ చేసే 'ఉష్... ఉష్' అనే శబ్దాన్ని వింటూ ఇద్దరూ హాస్పిటల్ చేరుకున్నారు.

కరేన్‌ని ఆపరేషన్‌కి సిద్ధం చేసి థియేటర్‌కి తీసుకెళ్ళారు. కొన్ని గంటల తర్వాత డాక్టర్ హడావిడిగా వచ్చి జాన్‌తో చెప్పాడు.

"మీ ఆవిడకి స్పృహ వచ్చింది. మిమ్మల్ని చూడాలనుకుంటోంది"

ఆయన హడావిడిగా చూసి తన భార్యకి కేన్సర్ ఏమో అని భయం జాన్‌కి కలిగింది.

"కరేన్ ఎలా ఉంది?" ప్రశ్నించాడు జాన్.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పకుండా డాక్టర్ ముందుకి నడిచాడు. ఆయన్ని అనుసరించిన జాన్ ఊహించని శుభవార్తని విన్నాడు!

భర్తతో ఆనందంగా చెప్పింది కరేన్.

"నేను ఏడునెలల గర్భవతిని!"

"అదెలా సాధ్యం?" అడిగాడు జాన్ సందేహిస్తూ.

"గర్భాశయాన్ని తెరచి చూస్తే అందులో ఏడునెలల పిండం డాక్టర్లకి కనపడడంతో వెంటనే మూసేసారు"

జాన్ కళ్ళల్లోంచి ఆనంద బాష్పాలు వర్షించాయి.

సాధారణ పద్ధతితోనే కరేన్ గర్భవతి అయింది. డాక్టర్లు కరేన్ గర్భవతో కాదో అన్న పరీక్షలు చేయకపోవడంతో ఈ సంగతి బయట పడలేదు. ఎండో మెట్రియోసిస్‌కి కరేన్ తీసుకునే మందువల్ల నెలసరి పీరియడ్స్ ఆగి పోయాయనుకున్నారు.

గర్భంలోని పిల్లవాడి కదలికలు ఆ జబ్బు లక్షణం అని కరేన్ భావించింది.

నీలి రంగు కళ్ళ పిల్లవాడు సెయింట్ జోసెఫ్ హెల్త్ సెంటర్‌లో మే 17న మూడు పౌన్ల 9 ఔన్సుల బరువుతో ఆరోగ్యంగా పుట్టాడు.

వాడికి బ్రూక్ అనే పేరు పెట్టారు.

"ఫరవాలేదండి, ఫరవాలేదు" ఆమె పంకా కిందికి లాగిన కుర్చీలో కూలబడుతూ అన్నాడు.



అభిమన్యు తల్లి కన్నా కనీసం అయిదేళ్ల తక్కువ వయసుంటుంది. ఆస్పత్రిలో మొదటిసారి చూసినప్పటి కన్నా వయసు ఎక్కువ మీరినట్లు కనిపిస్తుంది, భర్త చావు కృంగదీసి. ఇంట్లో లేమి తన ఉనికిని అస్పష్టంగా, జాగ్రత్తగా చూస్తేనేగాని గమనికలోకి రాకుండా- తెలియజేస్తోంది: ఇల్లు, గదిలో బట్టలు, ఇతర వస్తువులు, మౌలిక సదుపాయాల కొరత.

ఇల్లు రెండు మూడుచోట్ల కారుతోంది. ఇప్పుడు ఇంటి యజమానీ లేడు. వస్తుమారక వ్యవస్థ అమలులోకి రాకముందు, చారిత్రకంగా దారిద్ర్యం సామాజిక సమస్య కాదట. ఒకరి స్థితిగతులు మరొకరితో పోల్చుకున్నపుడు దారిద్ర్యం బాధించటం ఆరంభించింది. కాబట్టి జనం వాళ్ల లేమితనం తెచ్చిన కష్టం వలన పేదవారు కాదు; ఇతరుల మెరుగైన స్థితిగతులు, తమ లేమితనం, ఆ వ్యత్యాసం తెచ్చిన నిరసన భావం వలన వాళ్లు నిజంగా పేదవాళ్లు- అంటారు సామాజిక శాస్త్రనిపుణులు.

తన దృష్టి కదలికలను గమనించినట్లుందామె. చిదంబరం ఛాయాచిత్రంవైపు మళ్లించాడు. వయసులో ఉన్నపుడు అతను అందగాడే. చదరంగం కూడా అతని అందాన్ని పాడుచేసిందేమో.

"అసలే ఒక్కరి రెక్కల కష్టం మీద నడవవలసిన కుటుంబం. ఆ మనిషీ లేరు ఇప్పుడు. జరుగుబాటు విషయం వదిలేసి, ఆ మనిషి లేని లోటు తీరనిది; భర్తగా, తండ్రిగా" అని, కళ్లు చెమర్చినట్లున్నాయి

తల అటు, భర్త ఛాయాచిత్రంవైపు తిప్పింది.

తన ఒకప్పటి కుటుంబం గుర్తుకొచ్చింది. "సంతోషంగా ఉండే కుటుంబాలు ఒకదానితో ఒకటి పోలి ఉంటాయి; సంతోషంగా లేని కుటుంబాల త్రోవ మాత్రం దేనికదే" అన్నాడు టాల్‌స్టాయ్. ఆ వ్యాఖ్య వైవాహిక సంబంధాల విషయంలో



చేసింది. సంతోషం ఎరుగని తన కుటుంబం. అలాంటిదే అయినా చిదంబరం కుటుంబం ఒకదానితో ఒకటి పోలి ఉన్నాయి. తన తల్లి, చిదంబరం భార్య తోబుట్టువుల్లా ఉన్నారు.

"మీకు, లలితకు అభ్యంతరం లేకపోతే లలితను వివాహం చేసుకుంటాను" అందాం అనుకున్నాడు, ఆ మాటలు కాస్త నాటకీయంగా అనిపించినా. ఒక కోరికను తీర్చమన్నట్టుగా కాక, పరస్పర ఆమోదం మీద ఒక ప్రతిపాదనకు రూపు ఇద్దాం అన్న ధోరణి ఉంటుంది వాటిలో. తన స్వార్థం ఒకటే కాదు ఆ ప్రతిపాదనలో ఉన్నది. తన అర్హతలు వాళ్లకు అంగీకార యోగ్యమైనవి అనిపిస్తే తల ఊపవచ్చు. లేదంటే ఆ విషయం పురిటిలో సంధి కొట్టి పోతుంది. ఈ సంబంధ ప్రతిపాదనలో వ్యాపారధోరణి ఉంది; నిజం. నిజానికి ఇది సాధారణ విషయం, అంతలా మథన పడాల్సిందికాదు. అడిగి లేదనిపించుకుంటానేమో, తిరస్కారాన్ని జీర్ణం చేసుకోలేనేమో అన్న భయం తీవ్రంగా ఉండటం వలన అది అసాధారణంగా మారిపోయింది.

ధైర్యం చేసి నోరు తెరవబోయాడు. ఆమె స్టూలుమీద నుంచి లేచి లోపలికెళ్లింది. కమ్మని కాఫీ వాసన ముక్కుపుటాలకు సోకింది. అయిదు నిముషాల్లో కాఫీ తెచ్చి ఇచ్చింది. తల్లి పెట్టే కాఫీ ఇలానే ఉండేది.

"మా అమ్మ పెట్టే కాఫీ ఇలాగే ఉండేది. ఆమె ఆ మధ్య చనిపోయింది జబ్బు చేసి. ఆ తర్వాత కమ్మని కాఫీ అరుదుగా తాగాను"

అతను తన తల్లి కాఫీతో తన కాఫీని పోల్చటం, అంత ఇష్టంగా తాగుతుండటం ఆమెకు సంతోషం కలిగించాయి.

"మా నాయనమ్మ తొంభై రెండు సంవత్సరాలు బతికింది. రేపో మాపో పోదా

మని పాతిక సంవత్సరాలపాటు చూసింది. అతి తక్కువ వయసులో పోయిన ఆమె ఇద్దరు సంతానం, ఒక మనవడు, మునిమనుమరాలు చనిపోవటం చూసింది. ఆ నాలుగు చావులప్పుడు వాళ్లు చనిపోయినందుకే కాక తను బతికి ఉన్నందుకు కూడా ఏడ్చింది. ఆయన చనిపోయిన దగ్గిర నుంచి లలితకు చెపుతూ వస్తున్నాను- చావు ముందు చెప్పిరాదు, ఒకవేళ నేనూ పోతే ఒంటరిగా మిగిలిపోతావు అని"

"చిదంబరంగారి మరణం జీవితాన్ని ఒక మలుపు తిప్పింది" కాఫీ కప్పు కింద పెడుతూ అన్నాడు.

"పెళ్లిమాట ఎత్తితే ఆయన ఎగిరిపడేవారు. దానికి తొందరేముంది, ఇంకా చదువుకోనీ అనేవారు. ఆయన పోయిన దగ్గిర నుంచి శతపోరుతున్నాను పెళ్లికి ఒప్పించటానికి. మొత్తం మీద మెత్తబడింది. రెండు సంబంధాలు చూడటం కూడా అయింది"

మూడో సంబంధంగా తన కోరిక వెల్లడించటానికి ఇది సరైన సందర్భం. దాని గురించే కాచుకుని కూర్చున్నట్లు ఆ విషయం వెల్లడించటం హుందాగా ఉంటుందా, దేబిరించినట్లు ఉంటుందా. మరో మార్గం తోచటం లేదు. ఎవరిచేతనో అడిగించవచ్చు. వెంకటాచలపతిగారిని చెప్పమంటే చెబుతారేమో. తీరిగ్గా అడిగించేలోపు ఏదో ఒక సంబంధం కుదిరిపోవచ్చు.

"మావారి మేనల్లుడు గొడవ పెడుతున్నాడు నేను పనికిరానా అని. మేనరికం చేద్దాం అన్న విషయం ఆయనా నేనూ ఎప్పుడూ అనుకోలేదు. దానికి కారణాలున్నాయి. అయితే మనం అనుకున్నది అనుకున్నట్లుగా ఎప్పుడో గాని జరగదు. ఫణీంద్రను చేసుకోటానికి లలితా సుముఖంగా ఉంది. తెలియని సంబంధం తెచ్చి చేస్తే నేను వెళ్లి వాళ్లతో ఉండటం వీలుకాదు"

ముగింపు

వెనుదిరిగి రాతిమెట్లకేసి చూశాడు. ఇప్పుడు 'అంత' చీకటి లేదు; ఆమె లేదు. పిచ్చిమొక్కలగుండా నడవటానికి వెలుతురు ఇప్పుడే నిష్క్రమించిన ఈ క్షణాల కంటే, చీకటి అయినా ఆ సమయమే మేలు. తను అవతలికి చేరటానికి తను బయలుదేరిన చోట ఒక మనిషి వేచి ఉంది అప్పుడు. నిరాశ మిగిల్చిన వెలుతురుకన్నా, ఆశతో కూడిన చీకటి వాంఛనీయం.

**ఆమె లేదు. వెలుతురు ఇప్పుడే నిష్క్రమించిన ఈ క్షణాలకంటే, ఆ చీకటి సమయమే మేలు. అవతలికి చేరటానికి బయలుదేరినచోట ఒక మనిషి వేచి ఉంది అప్పుడు. నిరాశ మిగిల్చిన వెలుతురు కన్నా ఆశతో కూడిన చీకటి వాంఛనీయం.**

బస్సు ఎక్కాడు. పొద్దు మిగిలి ఉంది, పొద్దు మిగిలి ఉండగా చేయవలసిన పనులు లేని వాళ్లకు కూడా. ఏదో పని ఉన్నట్లు మధ్యలోనే బస్సు దిగిపోయి సముద్రానికి చేరువగా నడిచాడు. నీలపు జలరాశి. పైనుంచి మూసిన ఆకాశం; జంటగా. నీలం నుంచి తెలుపు పుడుతోంది, వడ్డుకెళ్లి అదృశ్యమవుతోంది. కెరటాలు ముందుకొస్తున్నాయి. ఎందుకొస్తున్నది తెలియకనో, ఏదో మరచిపోవటం వలననో వెనక్కు వెళ్లిపోతున్నాయి. కూర్చుండిపోయాడు. ఇసుక మొత్తాన్నీ ఎత్తి సముద్రంలో పోయాలన్నట్లు వేళ్లు వెళ్లగలిగినంతవరకు జొనిపి పైకి తీస్తే పిడికెడొచ్చింది. క్షణకాలపు తేమ. గవ్వలశకలాలు. ఎవరిచేతి గాజో పగిలి, ఇసుకలో తలదాల్చుకున్న ఎర్రగాజు ముక్క. నల్లటి ఖనిజపు రజను. కాళికాలయం నుంచి అస్పష్టంగా వినిపించే అర్థంకాని బెంగాలీ పాటలు. కాళికకు ఆ

భాష వచ్చే ఉంటుంది. కొంతసేపటి తర్వాత గంటల మోత, శంఖారావం సృష్టి అంతానికొచ్చిందని ప్రకటిస్తూ. గోబెల్స్ పాఠం నేర్పివుంటాడు. ఎంత సంతోషకరమైన పచ్చి అబద్ధం. దుఃఖపెట్టే సత్యం కన్నా, సంతోషం కలిగించే అసత్యం మిన్న. ఇక్కడ కూడా ఒంటరితనానికి జడుస్తూ ఒకరికి దగ్గరగా మరొకరు, ఒక జంటకు చేరువలో మరొకటి. దూరంగా లంగరు వేసిన ఓడలు, దీపాల కళ్లతో కమ్ముకుంటున్న చీకట్లను చూస్తూ. నెరవేరని మనోరథంలా అటునుంచి అటు పోతాయేమో.

లలిత ఫణిని ఇష్టపడి చేసుకుంటోందో, పరిస్థితికి తలవంచి చేసుకుంటోందో. తనంటే కాస్త ఇష్టం ఉండొచ్చుని; తన మనసు ఆమెకు తెలియదని, అందుకని మారుమాట్లాడకుండా ఫణిని పెళ్లి చేసుకోటానికి ఒప్పుకుని ఉంటుందని భావిస్తే అది రొమాంటిక్‌గా ఉండటంతోపాటు తన అహం సంతృప్తిగానూ ఉంటుంది. ఏ మనసులో ఏ భావం ఉందో వ్యక్తమయితేనే కదా తెలిసేది.

"ప్రేమించిన" వ్యక్తి దొరకలేదని నిరాశేమో! ప్రేమంటే ఏమిటో, ఎలాంటిదో తెలీదు. ఇది శుద్ధ నిజం. ఆమె ముగ్ధత్వం, చెక్కిన చెక్కిళ్లు, స్వల్ప పరిచయం కలిగించిన ఇష్టం - ఇవీ ఆమెకు చేరువవడానికి ప్రయత్నించిన కారణాలు. ఇష్టపడటం, పడకపోవటం మాత్రం తెలుసు. నిరాశా? అది తన తోబుట్టువు; కొత్తది కాదు.

తన జీవితపు తలుపు ఆమెకై తెరిచి ఉంచాడు, ఒంటరితనం నుంచి, మానసికంగా శారీరకంగా శిథిలం చేసిన జీవిత సంఘటనల జ్ఞాపకాల నుంచి, వర్తమాన నిస్సారత నుంచి తనను తాను రక్షించుకోటానికి ఆమెను, ఆమె సహచర్యాన్ని అభిలషించాడు. తనది కరడు కట్టిన స్వార్థం. ఈ సంఘటనా ప్రస్తుతం కలవరపెట్టి, క్రమేపీ తీవ్రతను కోల్పోయి మనసు జ్ఞాపకాల గూడులో చేరుతుంది.

చిదంబరంతో మరికొంత కాలం చదరంగం ఆడి వుంటే ఓడి ఓడి, గెలవగలిగిన ఆటలు కూడా ఓడిపోతుండేవాడు; గెలవడంలోకన్నా ఓడడంలో ఆనందం వెదుక్కుంటూ. జీవితంలోనూ, మరికొంత కాలం పోతే అనుకున్నదీ, కావలసినదీ జరగటంకన్నా జరగకపోవడమే ఎక్కువ సంతోషం ఇచ్చేదా? లలితతో అపుడు పరిచయం అయివుంటే, ఆమెతో పెళ్లి కుదరకపోవటంలో సంతృప్తి, కుదరటంలో అసంతృప్తి ఉండేవి. బాధించే సంఘటనలతో ప్రేమలో పడటం స్టాక్ హోం సిండ్రోమ్‌ను పోలిన పిచ్చేమో.

ఎప్పుడూ, ఇప్పుడూ అన్నిటికన్నా బాధించేది ఒక కసి. ఒక రాకుమార్తెను అక్కున చేర్చుకోవాలని ఎలాంటి కనీస అర్హత లేని అతి సామాన్యుడు ఆశించిన వైనం కాదిది. సామాన్య కుటుంబానికి చెందిన సాధారణ స్త్రీని అందరూ నడిచే మార్గంలో నడిచి వివాహం చేసుకుందామనుకున్న తలంపు. ఎందుకు అది సాధ్యం కాకుండా పోవాలి, ఎవరు దానికి కారణం. లలిత, ఫణి, చిదంబరం భార్యా అసలు కారణం కాదు.

ఊరట ఎలా లభ్యమవుతుందీ క్షణాన. దాని గురించి ఎక్కడ వెదకటం. మరో జీవితాన్ని మొదలుపెట్టి బాధల గానుగలో నలగటం తప్పిందని ఊరట చెందాలేమో. "ఇంకా నయం, ఫణీంద్రతో ఆమె వివాహం నిశ్చయమయిందని ముందే తెలిసింది, లేకపోతే అడిగి లేదనిపించుకుని సిగ్గుతో కూడిన బాధపడేవాడు"- అని సంతృప్తి పడాలా? ద్రాక్షపళ్లు అందని నక్క పొందిన ఊరట!

కెరటాలు లోపలికెళ్లినపుడు సముద్రాన్ని తరుముతూ, అవి వద్దుకొచ్చేటపుడు పారిపోతోంది మోకాళ్లదాకా పరికిణీ ఎత్తిపట్టుకున్న వయసొచ్చిన పిల్ల - ఒక జీవిత

రహస్యం ఆదిలోనే తెలిసిపోయినట్లు. పాలరాతి కాళ్లు; తడిసి చర్మానికి అంటుకుపోయిన రాగినూగు. లలితకూ ఇలాంటి నూగు ఉంటుందా. అడిగితే చెప్పకపోవచ్చుగాని, ఫణీంద్రకు తెలుస్తుంది.

పిచ్చి ఆలోచనలు. పిచ్చికి మించిన అదృష్టం ఏది? చెకోవ్ "బ్లాక్ ఫ్రయర్" లోని కోవ్రిన్‌లా సతతం ఆనందభరిత మనస్కుడై జీవించవచ్చు. తనలో తాను మాట్లాడుకుంటూ, తనకు మాత్రమే కనిపించే అదృశ్య శక్తితో పార భౌతిక చర్యలు కానిస్తూ కాలం వెళ్లబుచ్చవచ్చు. అది ఎంత ఆనందాన్నివ్వకపోతే పిచ్చి నయం చేయించిన భార్యతో పోట్లాడి తిరిగి పిచ్చి పట్టడం గురించి తాపత్రయపడతాడు! పిచ్చిలో దొరికిన దివ్యానందం గురించి అస్రులు చాస్తాడు. పిచ్చి తిరగబెట్టి కోల్పోయిన అలౌకికానందాన్ని దక్కించుకుంటాడు. పిచ్చితో రక్తం కక్కుకొని మరణించేటపుడూ అదే ఆనందం. చచ్చిన తర్వాత ముఖంలో మిగిలిపోయిన ఆనందచ్ఛాయలు. జీవిత పరమావధి అదేకదా. ఆరోగ్యంగా ఉండి, అన్నీ జీవితంలో అమరి ఆనందం మాత్రం కొరవడితే ఒరిగేదేమిటి. ఎవరి పిచ్చి వారికానందం అన్నది లోకోక్తి.

ఆ రాగి నూగు పిల్ల సముద్రంతో ఇంకా అలసట ఎరుగని సయ్యాట ఆడుతోంది. చెవుల లవలాకులు చిందులేస్తున్నాయి. సముద్రానికీ ఆపటం సాధ్యపడని అలలా అసమర్థ కోప కెరటం ఉవ్వెత్తున లేచింది. కూతురుకి భలే సంబంధం చూసిందామె. ఫణిలాంటి గుణవంతుడు దొరకడు ఆమెకు! వేరే సంబంధం చూస్తే తను వాళ్ల పంచ చేరి ఉండటం సాధ్యపడదట. స్వార్థం.

ఎగిసిపడిన కెరటపు జీవితకాలం క్షణం. తనపై తనకు అసహ్యం వేసింది; సిగ్గుపడ్డాడు.



ఫణి అంటే అసూయా? అలాగని తనకు తను ఒప్పుకోడు, తను అసూయపడటానికి కూడా చాలినంత అర్హత ఫణికి లేదని, చిదంబరం భార్యమీద కోపం కలగటంలో కూతురుకి ఏదో అన్యాయం చేస్తోంది అన్న భావన వుంది. తనను లలితకు ఇచ్చి చేయటం వల్ల సరైన న్యాయం చేసినట్లవుతుందన్న అహంభావం ఉంది. ఫణికంటే తనకు ఎక్కువ అర్హతలున్నాయని నిర్ణయించాల్సింది తను కాదు. ఫణి నిగమశర్మ, గుణనిధుల వారసుడే కావచ్చు- సమర్థుడు; తెగింపు ఉన్నవాడు; ప్రతి జీవితాంశాన్ని శల్యపరీక్ష, శస్త్రచికిత్స



చేయనివాడు; బతకటానికి అర్హుడు.

తనతో కమ్మని ఫిల్టర్ కాఫీ తాగించి, చీకటిలో వెలుతురిచ్చి, ఆశ రగిల్చిన అమాయకురాలైన లలిత గురించిన ఆ ఆలోచనలు న్యాయమైనవా? తను కావాలంటే ఆ ఆలోచనలు వస్తున్నాయా, హుష్ కాకి అంటే పోతాయా. సముద్రం ఆగిపోండి అంటే అలలు ఖాతరు చెయ్యవు. అర్జునుడే వాపోయాడు-

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్**

**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్**

అక్క విషయంలో ఈ సమర్థుడు ఏం చెయ్యగలిగాడు?

ముందు అక్క ఇష్టం తెలుసుకున్నాడు నారాయణరావు. తల్లి దగ్గిర ఆ విషయం కదిపాడు. తర్వాత తల్లి తన దగ్గిర ఏడ్చింది. నారాయణరావు మీద కోపంతో కాదు. తమ బతుకంటే ఆమెకు కలిగిన దుఃఖం. మనిషికి ఏడవటానికి ఎంత స్వేచ్ఛ ఉంది! అది ఎంత తేలిక! దేవుడిచ్చిన ఏకైక వరం! అక్కమీద కేకలేశాడు, నీకు మరో సంబంధమే దొరకదా అని.

నారాయణరావుకు అసలు అలాంటి ఆలోచన ఎలా కలిగింది అని చిందులేశాడు. తన కోపం చూసి ఏడుపు దిగ మింగుకుంది. మాట మార్చింది. "అంతకన్నా మనకు గత్యంతరం ఏముంది, నాన్నా? అలాంటి పెళ్లికన్నా అవివాహితగా ఉండిపోవటం నయం"

"ఈ వివాహం, జరుగుబాటు గురించి కూడా, నాన్నా! దానికి వయసొచ్చింది. ఆలోచించగల శక్తి ఉంది. తనకు మంచిదనుకున్న తోవ వెదుక్కునే స్వేచ్ఛ, హక్కు ఉన్నాయి"

మంచి సంబంధం చూసి పెళ్ళి చేసే స్థోమత తనకు వస్తుంది ఆగమన్నాడు. ఆమెకు ఆ నమ్మకం లేనట్లు తనకు తెలీకుండా వెళ్ళి పెళ్ళి చేసుకుంది.

ప్రతి సమస్యకు చింతించటం తన వంతు. ఏ పరిష్కారం తను ఆశించినట్లు జరగలేదు. సమస్య మాత్రం పరిష్కారమయింది, నీ ప్రమేయం, అభిమతం ఎవరికి కావాలన్నట్లు; జరిగిన దానితో సమాధానపడు, లేకపోతే ఏడుస్తూ కూర్చో అని చెబుతున్నట్లు. కొన్ని సమస్యలకు, బాధలకు మానవ చేతల పాత్ర అసలుండదు- తమ్ముడు, తండ్రి మరణాలలో లాగా, చావు అకారణంగా, సుడిగాలిలా వచ్చి వాడ్ని ఎత్తుకుపోయింది. పది రోజులకే, దిగులుతో ఎప్పుడూ తాగనంతగా తాగి రాత్రిపూట ఇంటికి వస్తూ, వర్షంలో రోడ్డు మీద పడి కలలో లాగా తండ్రి చనిపోయాడు- కల, నిజాల సరిహద్దు చెరిపేయాలన్నట్లు. ఈసారి నారాయణరావు తోడు లేడు, మరో దిక్కూ లేదు; వేళ్లమధ్య చుట్ట తప్ప (ఆయన మలి జీవితంలో ఏకైక ఉపశమనం అదే). తండ్రి చావుకు కనీసం కారణం ఉంది- తమ్ముడి చావు. ఒకరి తర్వాత ఒకరిని సాగనంపటానికి మూడు సార్లు, తుమ్మెదల మెట్టకు వెళ్ళాడు. ఇక సాగనంపటానికి ఎవరూ మిగలలేదు. ఈసారి తను వెళ్ళి ఉండిపోతాడు.

**ఇంత చిన్న జీవితంలో వందేళ్ళ చేదు అనుభవాలు అగ్ని వలయాల్లా చుట్టుముట్టాయి. వాటిలోనించి దూకలేదు. అవే దాటి వెళ్లిపోయాయి. అవి సమీపిస్తున్నపుడు నిలబడి ఉండటమే గాని వాటి బారి నుంచి తప్పించుకునే వీలూ లేదు.**

జీవితం కొండమీదినుంచి దొర్లించిన చక్రం. తన వ్యక్తిగత జీవితంలోను తన అభీష్టం సిద్ధించదు. తను ప్రేక్షకుడు, సాక్షి, పరిణామాలను నోరు మూసుకుని అనుభవించేవాడు. ఇంత చిన్న జీవిత కాలంలోనూ వందేళ్ళ చేదు అనుభవాలు అగ్ని వలయాల్లా తనను చుట్టుముట్టాయి. వాటిలోనించి తను దూకలేదు. అవే తనను తాకి, దాటి వెళ్లిపోయాయి. అవి సమీపిస్తున్నపుడు నిలబడి ఉండటమే గాని వాటి బారి నుంచి తప్పించుకునే వీలూ లేదు. ప్రస్తుతం తనకు పిడికెడు శాంతి కావాలి. ముష్టి ఎత్తటానికి తనకు అభ్యంతరం లేదు. మనసుకు కళ్లేలు కావాలి. ఎక్కడమ్ముతారు?

ఎడమవైపు దూరం నుంచి ఒక వ్యక్తి నడిచి వస్తున్నాడు. క్రమంగా దగ్గరవుతున్నాడు. ఏదో పోయిన దాని గురించో, పోనిదాని గురించో వెతుకుతూ వస్తున్నాడు. గెడకర్రలా పొడవుగా, వంగి (గాలికో, పొడవు వల్లో) కలియ దిరుగుతున్నాడు. ఏమిటా విలువైన వస్తువు? వస్తువు మాటేమోగాని ఆ వ్యక్తి తనకు తెలిసినవాడే. చరిత్రోపన్యాసకుడు శేషాచలం, చాలా కాలం తర్వాత. వందేళ్లయ్యుంటుందా? పలకరిస్తే పలకరించే మానసిక పరిస్థితిలో తను లేడు. అసలు గుర్తు పట్టగలడా అని. అతను వెదుకుతున్నది శిథిలాల గురించి, బొమి

కల గురించి. తనను తప్పక గుర్తుపడతాడు. వస్తున్నాడు తనకు దగ్గిరగా... కానీ అదేమిటీ పక్కనుంచే వెళ్ళిపోతున్నాడు తనక్కర లేదేమో! ఆయనకు కావలసింది నేటి అవశేషాలు కాదు, చారిత్రక అవశేషాలు. చారిత్రక అవశేషాలకే విలువ, అవి అవశేషాలే అయినా. తను భూమి మీదనే ఉన్నాడు. తవ్వకాలలో బయల్పడ లేదు. తను మ్యూజియంలో కాదు కాని జూలో ఇముడుతాడు.

వోల్టేర్ నవల "కాన్డైడ్"లో ఒక ముసలి పాత్ర అష్టకష్టాలు పడుతుంది. ఒకడికి బానిసగా అమ్ముడుబోయి తోటమాలిగా పనిచేస్తూ రెండు సంవత్సరాలపాటు రోజుకు ఇరవైసార్లు కొరడా దెబ్బలు తినింది, ప్లేగు పాలయింది, పదే పదే సామూహిక అత్యాచారానికి గురయ్యింది. తల్లిని కళ్లముందే చంపేశారు. యుద్ధం కరువుల భయంకర రూపాలను కాంచింది, ఆకలి వేసి తిండి దొరకని సైనికులు ఆమె పిరుదును కోసుకు తిన్నారు. తనను తాను చంపేసుకోవాలని వంద మార్లు అనుకుంది. స్వీయ కథను చెప్పి ఆయమ అంటుంది, "కానీ ఎందుకో జీవితం మీద ప్రేమ మిగిలి ఉంది. అవతలికి సంతోషంగా విసిరి వేయటానికి ఇష్టపడే బరువును మోస్తూ పోవటం, అస్తిత్వాన్ని ఒకవైపు అసహ్యించుకుంటూ దాన్ని పట్టుకొని వదలకుండా ఉండటం, ఏ సర్పం మనల్ని మింగుతుంటుందో అది మన గుండెకాయను కూడా తినేసేంత వరకు దాన్ని ప్రేమగా నిమురుతుండటం- వీటి కన్నా మూర్ఖత్వం మరొకటుండదు. ఈ పరిహాసాస్పదమైన బలహీనత మనలోని దయనీయమైన లక్షణంలో ఒకటి". వీర ఆశావాద తత్త్వవేత్త పాన్‌గ్లోస్‌కు ఒక కన్ను, ఒక చెవి, నాసికాగ్రం పగవాళ్ల చేతుల్లో అన్యాయంగా పోయాయి. అయినా ఈ ప్రపంచమే అత్యంత ఉత్తమమైంది అన్న అభిప్రాయం మొదటినుంచి చివరదాకా చెక్కు చెదరదు. మార్టిన్ అన్నవాడు అంటాడు, "మనం పనిలోకి దిగుదాం మల్లగుల్లాలు పడకుండ. జీవితాన్ని భరించటానికి అదొకటే మార్గం." మూడు రకాల దృక్కోణాలు.

తీవ్రమయిన కష్టనష్టాల తర్వాత ఎలా మనుషులు జీవనం కొనసాగించగలుగుతారు?

గడిచే కాలం ఊరటనిస్తుంది. భవిష్యత్తు ఆశని ఎరగా విసురుతుంది. ఇడుముల కడవి మధ్య కాస్తో కూస్తో సుఖం, ఆనందాల దీవులుంటాయి. జీవితం పాములా మింగుతున్నవాళ్లు జీవితాన్ని అనుభవించే ప్రయత్నం కాదు చేయవలసినది; దాన్ని "భరించటానికి" అవసరమైన మార్గాన్వేషణ చేయటం, దొరికితే వాటిలో పయనించటం.

లలిత వృత్తాంతంతో జీవితం ఆగిపోదు.

చిదంబరంతో ఆడుతునే ఉండటానికి లేచి నిలబడ్డాడు అభిమన్యు.

గది చేరాడు.

"లోపలికెళ్లి చేసేదేముంది? " ప్రశ్నించుకున్నాడు.

"లోపలికెళ్ళక చేసేదేముంది? " ప్రతి ప్రశ్నను సమాధానంగా వేసుకున్నాడు, చేయవలసిన పనిని నిర్దేశిస్తూ.

తాళం వేసిఉంది. తను వేసినదే. జేబులోకి చేయి పోనిచ్చి తాళం చెవి తీశాడు. కళ్లకు దగ్గరగా తెచ్చుకుని క్షణం చూశాడు దాన్ని, సమస్యను పరిష్కరించే సాధనంలా. తాళం తీసి తలుపు తోశాడు. చీకట్లో- నిశ్శబ్దం, ఏకాంతం చెట్టాపట్టాలేసుకుని అతని రాకకై ఎదురు చూస్తున్నాయి. కనీసం చీకటినన్నా పారద్రోలుదాం అనుకుని స్విచ్ వెదుకుతూ అనుకున్నాడు:

**"అసలు తాళం ఎందుకు వేశాను? ఇవి పారిపోతాయనా?"**

Ⓒ

వ్యంగ్య శీర్షిక

-వారణాసి రామకృష్ణ

# ఎయిడ్స్ - ఎయిడ్స్ !!

ఏ ఫార్ అంటే ఎంచక్కా ఆపిల్ అని అరిచే పిల్లలంతా ఈమధ్య ఏ అనగానే ఎయిడ్స్ అంటూ నవ్వుతున్నారు. ఎయిడ్స్ ప్రచారం జనాల్లోకి ఈ లెవిల్లో చొచ్చుకు పోయింది. ఈమధ్య మా పక్కింటావిడ గేటు ముందు ముగ్గు పెట్టడం మానేసి పొద్దున్నే సాముగరిడీలు చేస్తున్నట్టు కర్ర గాల్లో తిప్పుతోంది. అసలే ఆవిడ మొగుడొట్టి తిరుగుబోతు. వాడి చేష్టలకి తట్టుకోలేక ఇలా మెంటలయి పోయిందేమోననుకుని బాధగా మా ఆవిడకి చెపితే నా మొహాన దినపత్రిక న్యూసు ఐటం పడేసి నవ్వింది. అందులో ఎయిడ్స్‌ని తరిమికొట్టండి! అని ఎయిడ్స్ శాఖమంత్రి సారీ ఆరోగ్యమంత్రిగారి సందేశం ప్రముఖంగా ఉంది! 'ఎయిడ్స్‌ని తరిమికొట్టడం' అంటే ఇలాగా? కర్మ కర్మ! అసలు ఆవిడకీ విషయం చెప్పడం ఎలాగా? పైగా చేతిలో కర్ర కూడా ఉందే? !

ఎయిడ్స్ నివారణకి అంతా నడుం బిగించాలని ప్రముఖులు సూచిస్తారు. అంతే! బోలెడుమంది చీకటిపడగానే నిజంగానే బెల్టుతో నడుంబిగించి బెల్టుషాపు దగ్గరికెళ్లి రెండు పెగ్గులు బిగిస్తారు. ఆనక ఎక్కడేం చేసినా ఎయిడ్స్ గ్యారెంటీగా రాదనుకుంటారు. ఇంత అమాయకంగానా అని మనకు అనుమానం వస్తుంది గానీ, ఆ టైపు జనం ఉన్నారు గనుకే ఎయిడ్స్ విజృంభిస్తోంది? కండోమ్ వాడినా గ్యారెంటీ లేదని ఆమధ్యో కుర్రాడు గోలగోలగా ఏడిచాడు. ఏంటాకతంటే గదిలోకెళ్ళగానే బాగా వూది పెద్ద బెలూన్ చేసి వేలాడదీశా సార్! అయినా ఎయిడ్స్ ఎలా వచ్చిందోనంటూ బావురుమన్నాడు. వాడి తెలివికి మురిసి ముక్కలవ్వాలో, ఎయిడ్స్ వచ్చినందుకు మనసు చెక్కలవ్వాలో మన కర్థం గాని పరిస్థితి! చక్కగా స్కూల్ కెళ్ళి చదువుకోవాల్సిన పిల్లల్ని ఎయిడ్స్ అవగాహన ర్యాలీ అంటూ పట్టుకుపోయి వాళ్ళ చేతిలో ఎయిడ్స్ జెండాలు, ప్లకార్డులు పెట్టి ఊరు ఊరంతా తెగతిప్పారు. అవగాహన ఏమయిందో ఏమోకానీ, పార్కులెక్కడెక్కడన్నాయో అర్ధమైపోయిన పిల్లలంతా ఈమధ్య జంటలు జంటలుగా కనిపిస్తున్నారు. ఎయిడ్స్ అవగాహన ర్యాలీలో పాల్గొన్నప్పుడు మా మధ్య చక్కని అవగాహన కుదిరింది అంకుల్ అంటున్నారు!

మా కాలనీలో చారుమతిగారని వో టీచరమ్మున్నారు! పాపం ఆవిడ్ని స్కూల్లో, కాలనీలో అందరూ ఎయిడ్స్ టీచర్ అనే పిలుస్తారు.! కారణం అవిడికి ఎయిడ్సని కాదు. ప్రతి ఏడాదీ ఠంచనుగా ఎయిడ్స్ సొసైటీ వాళ్ళు నిర్వహించే శిక్షణా తరగతులకి హాజరవటమే! అలా ఆ క్లాసులకి వెళ్ళొచ్చాక ఆవిడ ప్రతి స్కూల్ కెళ్ళి పిల్లలకి ఎయిడ్స్ పాఠాలు నేర్పాలిట! అంతేగాక

పిల్లల బుర్రల్లోకి ఎయిడ్స్ అంటే ఏమిటో ఎలా వస్తుందో ప్రశ్నల రూపంలో కెక్కించి వ్యాసరచనల ద్వారా బైటికక్కించాలట! ఈ టైపులో పాపం ఆవిడ పగలూ రాత్రి నిర్విరామంగా శ్రమిస్తూ ఎయిడ్స్ జపం వల్లిస్తుంటుంది! ఉన్నట్టుండి ఆవిడ మా ఇంటికొచ్చి గోతంలో కూరిన పేపర్ల కట్టలు తీసి- 'స్కూలు పిల్లలు ఎయిడ్స్ మీద రాసిన వ్యాసాలు సార్! మీరూ కాస్త చదివి పెట్టి రిపోర్టు రాయాలంటూ' నా హెల్పు అడిగితే- తప్పుదుగదా! పేపర్ల గుట్టలోంచి ఓ కట్ట పేపర్లు తీశాను.

రమ్య- తొమ్మిదో క్లాసు. ఎయిడ్స్ శిక్షణా తరగతిలో అవగాహన పొందాక రాసిన వైనం- మీరూ చిత్తగిండి-

"ఎయిడ్స్ అనగా సహాయం చెయ్యటం! ఎయిడ్స్ అంటే నాకు చాలా ఇష్టం! ఎందుకనగా ఎయిడ్స్ వచ్చినపుడే తోటిమనిషికి మనం సహాయపడగలం! ఎయిడ్స్ రావాలంటే మనం జాతీయ రహదారుల మీదకి వెళ్ళాలి! అక్కడ లారీలమీద ప్రయాణం చెయ్యాలి. డ్రైవర్ అంకుల్స్‌కి, క్లీనర్ బాబాయ్‌లకీ యథావిధిగా మనం ఎయిడ్స్ అంటే సహాయం చెయ్యాలి! సమాజంలో ప్రతి పౌరుడూ ఇట్లా చేస్తేనే మనం ఉత్తమ పౌరులు కాగలం! ఎయిడ్స్ వచ్చినపుడు తీవ్రమైన తలనొప్పి ఉంటుంది! తల




నొప్పితో డ్రైవర్ అంకుల్ ఆక్సిడెంట్ చేసే అవకాశం ఉంది. ఆక్సిడెంట్ మూలాన లారీల్లో ఉన్న ఉల్లిపాయలన్నీ దొర్లిపోయే ప్రమాదం ఉంది! అలా ఉల్లిపాయలు




వృధా అవటం వల్లే మార్కెట్లో ఉల్లి ధర కొండెక్కుతుంది! కావున ఎయిడ్స్‌కి ఉల్లిపాయలకీ చాలా దగ్గరి సంబంధం ఉంది!"- మైగాడ్!!

ఇప్పుడు నీలిమ రాసిన వ్యాసం చూద్దాం:

"తలనొప్పి, జ్వరం వస్తే ఎయిడ్స్ వచ్చిందని వెంటనే మనం అర్థం చేస్కోవాలి! ప్రథమ చికిత్సలో భాగంగా డ్రైవర్ అంకుల్స్‌కి కండోమ్స్ పంచాలి! కండోమ్స్‌ని డ్రైవర్లకే కాక చిన్నపిల్లలందరికీ ఉపయోగపడేలా తయారుచేశారు. మా తమ్ముడూ వాళ్లు ఎంచక్కా కండోమ్స్‌తో బెలూన్లు వూదుకుని ఆడుకుంటారు! బెలూన్లే కాక అన్నిరకాల బొమ్మలు తయారయ్యేవిధంగా కండోమ్స్‌ని డిజైన్ చేస్తే మరింత బావుంటుంది! కావున ఉపయోగాలు మరిన్ని ఉండేలా కండోమ్స్‌ని తయారుచెయ్యమని సీఎం అంకుల్‌కి నా విజ్ఞప్తి!" బ్రేవో! నా చిట్టి తల్లీ!!

సందీప్ అనే కుర్రాడు రాసిన వ్యాసం:

"ఎయిడ్స్ అంటే జ్వరం రావటం! వానలో తడిశాక లారీలో ప్రయాణిస్తే వచ్చే వ్యాధి- ఎయిడ్స్! ఎయిడ్స్ మనకే కాదు. మన శత్రువుకీ రాకూడని జబ్బు! అయితే నన్ను

క్రికెట్ ఆడనివ్వకుండా చేస్తున్న సుందర్‌గాడికి మాత్రం ఎయిడ్స్ రావాలని దేవుడ్ని కోరుకుంటున్నాను! ఇది తప్పే కానీ వాడు చేసే వెధవ పన్లకి తప్పదు! ఇక ఎయిడ్స్ వస్తే దగ్గు ఖాయంగా ఉంటుంది. మా తెలుగు మాస్టారుకి ఎయిడ్స్ అని నా అనుమానం! ఎప్పుడూ ఖళ్ళు ఖళ్ళుమని దగ్గుతూ శాలువా కప్పుకొని ఉంటాడు!"

రామ్‌కుమార్ రాసిన వ్యాసం: "ఎయిడ్స్ అంటే దగ్గు, జ్వరం! మామూలు దగ్గు వస్తే వారం రోజుల్లో తగ్గిపోతుంది. అయితే ఎయిడ్స్ దగ్గు, జ్వరం ఏడు రోజులు నిలకడగా ఉంటుంది! మామూలు దగ్గు వచ్చినపుడు రోగి దగ్గరికి వెళ్ళొచ్చును కానీ ఎయిడ్స్ దగ్గున్న రోగి దగ్గరికి వెళ్ల కూడదని చెప్తారు. కానీ అది చాలా తప్పని ఎయిడ్స్ టీచరు చారుమతి చెప్పింది! టీవీలో ఆంటీ కూడా మొన్న అదే సంగతి చెప్పింది! ఎయిడ్స్ దగ్గు ఉన్న వాళ్ళకి రగ్గు కప్పాలి! వాళ్ళ చేతిని మన చేతితో అనగా 'కరస్పర్శ' చెయ్యాలి! అవసరమైతే షేవింగ్ కూడా మనమే చెయ్యాలి! షేవింగ్ బ్లేడువల్ల ఎయిడ్స్ మనకి రాదు! కుర్చీలో కూర్చున్నా రాదు. అసలు మనం కుర్చీల్లో కూచుంటేనే ఎయిడ్స్ వచ్చిన అంకుల్స్‌కి జబ్బు తొందరగా తగ్గిపోతుంది!"

పదో క్లాసు కల్యాణి రాసిన వ్యాసం, "ఎయిడ్స్ అంటే బ్లేడుతో షేవింగ్ చేస్కోవటం! ఒకరు వాడిన బ్లేడు మరొకరు వాడితే ఎయిడ్స్ వస్తుందో రాదో టీవీలో యాంకర్ అంకుల్ చెప్పేలోగానే జాతీయ కార్యక్రమాలంటూ ఆ ప్రోగ్రాం పీకేస్తున్నారు. ప్రతిసారీ టీవీలో ఇట్లానే జరుగుతోంది! దాంతో మా డాడీ పాపం ఎయిడ్స్ భయంతో గడ్డం చేస్కోవటం మానేశారు. మా డాడీ స్నానం కూడా ఎయిడ్స్ భయంతోనే మానేశారు. అయితే మా మమ్మీ గడ్డం పెరిగిన మా డాడీని మీ అంత పరమబద్ధకిష్టు ఈ లోకంలో లేరని తిడుతోంది! టీవీ సీరియల్స్‌లో కూడా మమ్మీలు ఇట్లాగే గుడ్లు పెద్దవి చేసి డాడీల్ని తినేశాలా చూస్తూ తిడ్తున్నారు! అయితే ఎయిడ్స్ వచ్చిన వాళ్లని తిట్టకూడదు! నేను పెద్దయ్యాక ఎయిడ్స్ వచ్చిన నా భర్తకి విధిగా సేవలు చేస్తాను. శ్రద్ధగా ఆయన్ని కూర్చున్న కుర్చీలోంచి లేపి మరీ నేను కూర్చుంటాను. ముద్దలు కలిపి అన్నం తినిపిస్తాను! కేవలం ముద్దు మాత్రం పెట్టుకోనిస్తాను! పై నియమాలన్నీ కఠినతరంగా పాటించినచో ఎయిడ్స్ ఎట్టి పరిస్థితుల్లోనూ రాదు! కావున నాకూ నా భర్తవల్ల ఎయిడ్స్ రానే రాదు!' -

అయ్య బాబోయ్! ఇవండీ పిల్లలు నేర్చుకున్న పాఠాలు! ఏదో దుబ్బుమన్న శబ్దం వినిపించి తల తిప్పి చూద్దునుగదా- పాపం ఎయిడ్స్ టీచరు అరుంధతి దిమ్మని కిందపడి గిలగిలా కొట్టుకుంటోంది!

ఆమధ్య అ అంటే అమలాపురం అని సాంగ్ వచ్చింది కదా. అదే టైపులో - ఎ అంటే ఎయిడ్సు, బీ అంటే బిల్‌గేట్సు, సి అంటే కండోమ్సు - అనే పాటొచ్చినా ఆశ్చర్యపోనక్కరలేదు. ఎందుకంటే ప్రజల్లో నైతిక విలువల్ని ప్రచారం చెయ్యాల్సింది పోయి కండోములు వాడండి, సేఫ్ సుఖం ఎట్లాగో ఆలోచించండి- అంటూ జాగ్రత్తలు చెబితే- ఇది ఎంతవరకు జనానికి ఎయిడ్ అవుతోందో లేక ఎయిడ్సే ఎక్కుతుందో విజ్ఞుల విజ్ఞతకే వదిలేద్దాం! ఎటొచ్చీ మా కంట్రీలో ఎయిడ్స్ ఎక్కువ- ఎక్కువ అని గోడలెక్కి గొంతు చించుకుని మరీ అరిస్తే- ఆ అరుపులు విన్న అగ్రదేశాలు 'ఎయిడ్' విదిలిస్తాయి! అంటే ఎయిడ్‌కి ఎయిడ్స్‌కి అవినాభావ సంబంధం ఉన్నట్టే! ఇదీ అసలు సిసలు చిదంబర 'రగస్యం!!' మీరేమంటారు? !

*(ఈ శీర్షిక ఇంతటితో ముగిస్తున్నాం)* ©

# కవిత

-తోపుగుంట మస్తాన్‌బాబు

"**ఏం**టిది? "

ఆహారావ్ అందించిన అరఠావు కాగితాన్ని అటూ ఇటూ తిప్పిచూస్తూ అడిగాడు ఎడిటర్ ఏకాంబరం.

అది 'అసత్యం' వారపత్రిక కార్యాలయం.

"కవిత సార్..." ఆహారావ్ చెప్పాడు ముసిముసిగా నవ్వుతూ.

"సరే- ఉంచి వెళ్లండి.. వీలునిబట్టి పరిశీలిస్తాను..." ఆ కాగితాన్ని టేబుల్ మీద పెట్టి- దానిపై పేపర్‌వెయిట్ ఉంచాడు ఎడిటర్.

"కవిత... చిన్నదే సార్... ఇప్పుడే పరిశీలించకూడదా? "

"కుదర్దండీ... ప్రస్తుతం చాలా బిజీగా ఉన్నాను. ఓ వారం తర్వాత వచ్చి కనిపించండి..."

"తప్పకుండా ప్రచురిస్తారు కదూ? "

"ఆ విషయం ఇప్పుడే ఎలా చెప్పగలనండీ? పరిశీలించాక... బాగుంటే మాత్రం తప్పకుండా వేస్తాను..."

"బాగుంటుందండీ... మీకు గ్యారంటీగా నచ్చుతుంది!"

"ఆ సంగతి మీరు కాదు చెప్పాల్సింది... నేను... మీ కవిత చదివాక బాగుందని నాకనిపించాలి..."

ఏకాంబరం ముఖంలోని చిరాకు పైకి స్పష్టంగా కనిపిస్తుండటం వల్ల- ఆయన్ని ఆట్టే విసిగిస్తే అసలు 'వెయ్యను పో' అంటాడేమోనన్న భయంకొద్దీ "సరే సార్- మీరు చెప్పినట్టే వారం తర్వాతే వస్తానైతే..." అని చెప్పి సెలవు తీసుకుని అక్కడ్నుంచి వెళ్లిపోయాడు ఆహారావ్.

సరిగ్గా వారం తర్వాత 'అసత్యం' వారపత్రికా కార్యాలయంలో మళ్లీ ప్రత్యక్షమయ్యాడు ఆహారావ్.

"ఊc... చెప్పండి. ఎవరు మీరు? "

"సార్ పోయిన వారం మీ చేతిలో నా కవితొకటి పెట్టి వెళ్లానూ...ఇ హ్హి హ్హి అనే కవిత..."

"ఓ... మీరా? "

"మీ కవిత నాకు నచ్చలేదు... దాన్ని గనక వేస్తే 'మా' 'అసత్యం' పత్రిక సర్క్యులేషన్-సత్యంగా ఓ పదివేలు పడిపోతుంది... కావాలంటే మీ వ్రాత ప్రతిని వెనక్కి తీసుకెళ్లొచ్చు..." అన్నాడు ఎడిటర్ ఏకాంబరం- పక్కనే ఉన్న అలమారలోంచి తిరస్కరింపబడ్డ కవితలు ఫైల్ అందుకుంటూ!

"ఇది చాలా అన్యాయం సార్? " బాధగా అన్నాడు ఆహారావ్- అతని గొంతులో ఆవేదన.

"ఇందులో అన్యాయం ఏముందండీ? నచ్చనివాటిని రిజక్ట్ చేసే హక్కు ఎడిటర్‌గా నాకుంటుందిగా!"

"మీ హక్కుని కాదనటం లేదు... కాని

నా కవితని పరిశీలించకుండానే రిజక్ట్ చెయ్యడం అన్యాయం కాదా? " ముఖాన్ని గంటుపెట్టుకుంటూ అన్నాడు ఆహారావ్.

"మీ కవితని నేను పరిశీలించలేదని ఎవరు చెప్పారు మీకు? " ఆశ్చర్యంగా చూశాడు ఏకాంబరం.

"ఎవరో చెప్పాలా- ఏంటండీ? మిమ్మల్ని

"నేను బాగానే మాట్లాడుతున్నానుగా? !" అయోమయం మరింత పెరగడంతో మరింత గట్టిగా బుర్రని గోక్కున్నాడు ఏకాంబరం!

"మరద్దే.. మీరు నిజంగా నా కవితని చదవుంటే, ఐ మీన్ ఒక్కసారన్నా పరిశీలించివుంటే- ఇలా బాగానే ఎలా మాట్లాడ




చూస్తుంటే తెలిసిపోతుంటేనూ? "

ఏకాంబరం కన్ఫ్యూజన్‌కి గురయ్యాడు.

"నన్ను చూస్తుంటే తెలిసిపోతుందా- అదెలా? " అన్నాడాయన బుర్ర గోక్కుంటూ!

"ముందు మీరు నిజం ఒప్పుకోండి- మీరు నా కవితని పరిశీలించలేదు... అవునా? "

"అవును..." కుతూహలం ఏకాంబరాన్ని నిజం ఒప్పుకునేలా చేసింది. ఆశ్చర్యంగా కూడా వుంది.

"కానీ, ఆ సంగతి మీకెలా తెలిసింది? " అడిగాడు ఆత్రంగా.

"మీరు మాట్లాడుతున్న విధానాన్నిబట్టి!" చెప్పాడు ఆహారావ్.

గలుగుతారు? " కోపంగా అన్నాడు ఆహారావ్.

"అంటే..."

"అంటే ఏంటి! మీరు కూడా మా ఎదురింటి వేంకటాద్రిలాగానో, పక్కింటి పద్మనాభంలాగానో - మా మేడమీది ముకుందంలాగానో - ఈ పాటికి పిచ్చిపిచ్చిగా మాట్లాడుతుండేవారు- నాకవితని గనక నిజంగా చదివుంటే"- ఆహారావ్ సిన్సియర్‌గా అసలు సంగతి చెప్పాడు.

అప్పుడు చదివాడా కవితని ఏకాంబరం ఏకబిగిన. తర్వాత "యమాతారాజభానస లగం"- అంటూ ఓ వెర్రివేకవేసి ఒక్క ఉదుటున తన సీట్లోంచి లేచి బయటకు పరుగు తీశాడు పిచ్చిపిచ్చిగా నవ్వుకుంటూ.

# కాలాతీతం

(1749)

# టామ్ జోన్స్




సామర్సెట్ షైర్‌లోని ఒక పెద్ద ఎస్టేట్‌కు యజమాని స్క్వైర్ ఆల్వర్దీ. ఇంట్లో వుంటున్న ఒకే ఒక ఆడదిక్కు ఆయన చెల్లెలు మిస్ బ్రిడ్జెట్- ఆవిడ ఒకప్పుడు అందంగా వుండేదేమో గాని యిప్పుడు కాస్త మొరటుగా తయారైంది. తాను స్త్రీ సహజమైన కోరికలకు అతీతురాలైనట్టుగా ప్రవర్తిస్తూ, ఆడపిల్లలందరూ పాడైపోతున్నారని విమర్శిస్తూ వుంటుంది.

వ్యాపార లావాదేవీలకోసం లండన్ వెళ్లిన ఆల్వర్దీ మూడు నెలల తర్వాత యింటికి తిరిగివచ్చి, పడకగదిలోకి ప్రవేశించినప్పుడు అక్కడో శిశువు కనిపిస్తుంది. ఇది ఊహకందని వింత. అందాల మగశిశువుని క్కడ వదిలి వెళ్ళిన కఠినాత్ములెవరు? ఆ పసికందు పోషణ బాధ్యతలను చెల్లెలికప్పగిస్తాడు ఆల్వర్దీ. ఆమెకూ పిల్లలంటే ఇష్టమే. కాని అప్పటికే ఇంట్లో అతిథిగా వుంటున్న కెప్టెన్ బ్లైఫుల్‌తో రహస్యంగా ప్రేమవ్యవహారం కొనసాగిస్తున్నది. బ్లైఫుల్‌ను బ్రిడ్జెట్ కన్నా ఆమె ఆస్తి ఎక్కువ ఆకర్షించింది. ప్రేమికులిద్దరూ పెద్దల మాటల్ని ఖాతరు చెయ్యక పెళ్లి చేసుకున్నారు. ఆల్వర్దీ కూడా ఈ అనూహ్య పరిణామాన్ని ఆహ్వానించక తప్పలేదు. బ్లైఫుల్ యిప్పుడు కొత్తగా సంక్రమించిన అధికారంతో అక్కడే తిష్టవేశాడు.



హెన్రీ ఫీల్డింగ్

సరిగ్గా ఎనిమిది నెలల తర్వాత బ్రిడ్జెట్ ఒక మగశిశువును ప్రసవించింది. అందరూ అది నెలలు నిండని ప్రసవమన్నారు గాని అసలు విషయం తల్లికే తెలుసు.

**ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక**

బుల్లి మేనల్లుణ్ణి చూసి ఆల్వర్దీ మురిసిపోయాడు. బ్రిడ్జెట్ మాత్రం స్వంత పిల్లాడికన్న అనాథగా పెరుగుతున్న టామ్(జోన్స్)నే ఎక్కువ ముద్దుచేసేది. ఇది చూసి చాలాసార్లు బ్లైఫుల్ భార్య మీద కోపగించుకున్నాడు. అయినా ఆమెలో మార్పురాలేదు.

# హెన్రీ ఫీల్డింగ్ (1707-1754)

సంపన్న కుటుంబంలోనే పుట్టాడు ఫీల్డింగ్. తండ్రి బ్రిటిష్ సైన్యంలో కల్నల్‌గా పనిచేశాడు. మొదట ఈటన్‌లోనూ, తర్వాత హాలండ్‌లోని లేడన్ యూనివర్సిటీలోనూ విద్యాభ్యాసం కొనసాగింది. కాని 'లా' పూర్తిచేసిన ఫీల్డింగ్‌ను నాటకరంగం ఆకర్షించింది. హాస్య ప్రధానమైన నాటకాలు, ముఖ్యంగా ఫార్సులు రాసి పేరు గడించాడు. ది లైఫ్ అండ్ డెత్ ఆఫ్ టామ్ థంబ్, ది గ్రేట్(1730) ఆనాటి కథానాయకుల డొల్లతనాన్ని ఎద్దేవా చేసి, సాటి కళాకారులకు కోపం తెప్పించింది. ఆ తర్వాత ప్రదర్శించిన పాస్క్విన్ (1736), ది హిస్టారికల్ రిజిష్టర్(1736) సమకాలీన రాజకీయాలను ఎండగట్టటంతో ఇలాంటి గడుగ్గాయిల దూకుడుకు కళ్లెం వెయ్యాలని, లైసెన్సింగ్ ఆక్ట్ అనబడే కొత్త చట్టాన్ని అమలు చేసి, నాటక ప్రదర్శనలకు ముందస్తు ప్రభుత్వ అనుమతి తప్పనిసరి అని ప్రకటించింది ప్రభుత్వం.

అయితే ఈ సెన్సారు నిబంధనలు పుస్తకాలకు పత్రికలకు వర్తించవు. కొన్నాళ్లు 'ది ఛాంపియన్' అనే పత్రికద్వారా లాయర్లనూ, కోర్టులనూ తూర్పారపట్టాడు ఫీల్డింగ్. మరి కొన్నాళ్లు లండన్‌లో "జస్టిస్ ఆఫ్ పీస్" ఉద్యోగం చేసి, నేర పరిశోధన కోసం ప్రత్యేకంగా కొంతమంది నిపుణుల్ని నియమించాడు. ఈనాటి స్కాట్లండ్ యార్డ్‌కు ప్రాగ్రూపమది.

పెళ్లైంది. ఉద్యోగ భద్రత వుంది. భుక్తి

బ్లైఫుల్‌కేదో అంతుచిక్కని మనోవ్యాధి పట్టుకుంది. ఒకనాడు ఫిట్స్‌తో మరణించాడు.

టామ్ జోన్స్‌పై బ్రిడ్జెట్ చూపిన ప్రేమ ఎవరికీ నచ్చలేదు. 'పేగుబంధం కన్న పెంచిన బంధం ఎక్కువా?' అని ముక్కు మీద వేలేసుకున్నారు. ఆల్వర్దీ మాత్రం లోలోపలే సంతోషించి వాడికి, తన మేనల్లుడితో సమంగా విద్యాబుద్ధులు నేర్పించాడు.

అయితే టామ్ దొంగతనాలకు అలవాటుపడ్డాడు. ఇరుగుపొరుగుల తోటల్లోకి ప్రవేశించి పళ్ళు కోయటం, బాతులు ఎత్తుకు రావటం, మాస్టర్ బ్లైఫుల్ జేబులోంచి డబ్బులు కాజెయ్యటం వాడి హాబీ. అందరూ ఈ దుర్బుద్ధిని అసహ్యించుకున్నారు. జంతువులను వేటాడి తెచ్చే జార్జి సీగ్రిం వాడికి నమ్మినబంటు.

ఒకనాడు వీళ్లిద్దరూ కలసి వేటకెళ్లినప్పుడు, స్క్వైర్ వెస్టర్న్‌గారి ఎస్టేట్‌లో చెట్ల మీద వాలిన కౌజు పిట్టల దండు కనిపించింది. మరొకరి పొలంలోకి ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రవేశించగూడదని ఆల్వర్దీ తన సేవకులకు స్పష్టమైన ఆదేశాలిచ్చాడు గాని టామ్ కోరిక మేరకు సీగ్రిం ఒక పిట్టకు గురిచూసి తుపాకీ పేల్చాడు. చప్పుడు విని స్క్వైర్ వెస్టర్న్ పరుగెత్తుకొచ్చాడు. భయంతో, సీగ్రిం ఒక పొదవెనక నక్కాడు. టామ్ చేతిలో గిలగిలా కొట్టుకుంటున్న పక్షి కనిపించింది. తన మనుషులిలా నేరం చేశారని ఆల్వర్దీకి కబురు పెట్టాడు వెస్టర్న్. పంచాయతీ జరిగింది. "కాల్చింది నేనే" అన్నాడు టామ్. అదంతా గమనించిన బ్లైఫుల్, అసలు నేరస్థుడు సీగ్రిం అని సాక్ష్యం చెప్పాడు. తక్షణమే వేట

కోసంగాక, సరదాగా రాయాలనుకున్నాడు ఫీల్డింగ్. మొదటగా అప్పటికే ప్రసిద్ధి పొందిన శామ్యూల్ రిచర్డ్‌సన్ నవల 'పామేలా'లోని కథానాయిక ప్రదర్శించిన కృత్రిమ విలువల్ని విమర్శిస్తూ 'షామేలా' *(1741)* ప్రచురించాడు. *1742*లో వెలువడిన 'జోసెఫ్ ఆండ్రూస్' ఆనాటి కులీన వర్గాల భేషజాల్ని పరిహసించింది. *1743* నాటి 'జొనాదన్ వైల్డ్' ఒక నేరస్తుడి కథ. ధనవంతులకూ, రాజకీయ నాయకులకూ, కరడు గట్టిన నేరస్తులకూ నీతి లేదన్నది కథాంశం. దీన్ని 'కామిక్ ప్రోజ్ ఎపిక్' అన్నాడు ఫీల్డింగ్. అతని చివరి నవల అమేలియా*(1751)*.

యవ్వనంలో గడిపిన విశృంఖల జీవితం వల్లా, నిర్విరామ రచనాకృషి వల్లా, ఫీల్డింగ్ ఆరోగ్యం పాడైంది. అయినా చివరిదాకా రాస్తూనే వున్నాడు. విశ్రాంతి కోసం పోర్చుగల్ వెళ్లమని సలహా యిచ్చారు వైద్యులు. లిస్బన్‌కు చేరిన కొద్దిరోజులకే మరణించాడు ఫీల్డింగ్.

అయితే పద్దెనిమిదవ శతాబ్ది ఇంగ్లిష్ సాహిత్యంలో జొనాదన్ స్విఫ్ట్ (గలివర్స్ ట్రావెల్స్), రిచర్డ్‌సన్(క్లారిసా), స్టెర్న్(ట్రిస్టామ్ షాండీ)ల సరసన నిలుపగలిగిన నవల 'టామ్‌జోన్స్'*(1749)*. వివాహమైన కొద్ది కాలానికే మరణించిన తన భార్య ఆధారంగా ఇందులోని కథానాయిక సోఫియా వెస్టర్న్‌ను సృష్టించాడు రచయిత. ఇది పెద్దనవలే కాని సరదాగా సాగిపోతుంది. హీరో సకల సద్గుణ సంపన్నుడేమీకాకపోయినా, క్షణికావేశాలకు లోనుగాని మనుషులెవరూ ఉండరని గ్రహిస్తాం. ఆదర్శాలు వల్లించడం కన్నా, వాస్తవికమనిపించే కథలనే ఆధునికులు ఇష్టపడతారని మనకు తెలుసు. ఆ అర్థంలో ఇది ఆధునిక నవలే.

గాణ్ణి పనిలోంచి తొలగించి టామ్‌ను చివాట్లేశాడు ఆల్వర్దీ.

మొత్తం మీద ఈ సంఘటన తర్వాత టామ్‌పై వెస్టర్న్‌కు ప్రేమ పెరిగింది. మరొకరి నేరం తన మీద వేసుకున్న వాడెంత ఉత్తముడు! ఇలాంటి కొడుకుంటే జీవితం ధన్యమయ్యేదని టామ్‌ను యింటికి ఆహ్వానించాడు వెస్టర్న్. తన తుపాకులు, జాగిలాలు, గుర్రాలు అన్నీ టామ్ స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. ఇదే అదనుగా సీగ్రింకు తిరిగి వుద్యోగం యిప్పించటానికి ప్రయత్నించాడు టామ్. ఇందుకోసం వెస్టర్న్‌గారి కూతురు, అందాల బరిణె సోఫియా సాయం అర్థించాడు.

ఇంకేం, తొలిచూపులోనే ఆమె టామ్‌కు మనసిచ్చింది. అతడిలాగ, పరోపకారం చేసే యువకులు అరుదుగా వుంటారు.

టామ్ కూడా ఆమె నిష్టపడలేదనికాదు గాని అంతకు ముందే అతడు సీగ్రిం చిన్న కూతురు మాలీ అందాలకు దాసోహమన్నాడు. ఈ విషయం తెలియని సోఫియా, టామ్ ఒంటరిగా తనతో మాట్లాడినప్పుడు తెగ సిగ్గుపడిపోయి బుగ్గలు ఎరుపెక్కగా, ఆనందపరవశురాలై అతడి ప్రతిపాదన కోసం నిరీక్షించింది. కాని చివరికి, ఈ మహాశయుడు సీగ్రిం ప్రస్తావన తెచ్చాడు.

సోఫియాకు చిర్రెత్తుకొచ్చింది. ఎలాగైతేనేం, సీగ్రింకు మళ్లీ వుద్యోగం దొరికింది. టామ్‌కు వేట పిచ్చి తిరగబెట్టింది. ఇద్దరూ కలిసి వెళ్లి, రోజంతా తిరిగి డిన్నర్ టైమ్‌కు వచ్చేవాళ్లు. సోఫియా తన అందాల్ని ఆరబోస్తూ, టేబుల్ వద్ద టామ్‌కు వడ్డించేది. కూతురుకి వేటలో ఆసక్తి వుందని తెలుసుకున్న వెస్టర్న్ ఆమెనుకూడా వీళ్ల వెంట వెళ్లమన్నాడు. ఒకనాడు గుర్రంపై నుండి పడిపోతున్నప్పుడు టామ్ సోఫియాను

రక్షించాడు. ఆ క్షణంలోనే ఆమె అతడి మనసు దోచింది.

కూతురు అన్యమనస్కంగా వుండటం గమనించి మిసెస్ వెస్టర్న్(సోఫియా తల్లి) ఈ అమ్మాయి మాస్టర్ బ్లైఫుల్‌తో ప్రేమలో పడింది కాబోలునని సంతోషించింది. తగిన సంబంధం, ఆస్తిపాస్తుల్లో తమతో సరితూగే సజ్జనుడు ఆల్వర్దీ. కాని కొద్దిరోజుల్లోనే అసలు విషయం తెలిసిపోయింది.

స్క్వేర్ వెస్టర్న్, ఆల్వర్దీ ఇంటికెళ్లి టామ్ ఎలా హద్దుమీరి ప్రవర్తిస్తున్నాడో వివరించాడు. ఆల్వర్దీ శాంత స్వభావుడు. తను దయతో పెంచిన అనాథ అలా చెయ్యటం అతడికి ఇష్టంలేదు. బ్లైఫుల్- సోఫియాల వివాహానికి సమ్మతించాడు. టామ్‌కు, మాలీతో సంబంధమున్నట్టుగా తెలిసింది.

ఇలా ఆడపిల్లల్ని మోసం చేస్తున్నందుకు టామ్‌కు కొన్ని డబ్బులిచ్చి ఇంట్లోంచి గెంటేశాడు ఆల్వర్దీ.

ప్రేమించటమే నేరమా? తండ్రిలాంటి ఆల్వర్దీని, ప్రియురాలు సోఫియానూ దూరం చేసుకున్న టామ్ దిగులుగా, దేశాటన చేస్తూ బ్రిస్టల్ నగరం చేరుకుంటాడు.

అక్కడ ఒక హోటల్లో సైనికులతో పరిచయం పెరిగి, వాళ్ల మందుపార్టీలో పాల్గొంటాడు. డ్రింకు చేసేటప్పుడు అందరూ గ్లాసు చేతపట్టుకుని తమకిష్టమైన వ్యక్తులకు టోస్ట్ చెయ్యటం రివాజు. ఎన్‌సైన్ (సైనిక హోదా) నార్దర్టన్, "నాకు తెలిసిన సోఫియా వెస్టర్న్‌కు, ఆమెతండ్రి సోమర్‌సెట్‌షైర్‌లో పెద్ద భూస్వామి... బాత్ (నగరం)లో సగంమందిని తృప్తిపరచిన ఆ సుందరికోసం" అంటూ గ్లాసు పట్టుకుని తాగినమత్తులో బిగ్గరగా అరుస్తాడు.

ఈ అవమానం భరించలేని టామ్ "యూ రాస్కెల్" అంటూ వాడిమీదికి లంఘిస్తాడు. ఆ పెనుగులాటలో నార్దర్టన్ బాటిల్‌తో టామ్ తలమీద బలంగా బాదుతాడు.

గాయంతో కదలలేని స్థితిలోవున్న టామ్‌కు పార్ట్రిడ్జ్(ఒకప్పుడు ఆల్వర్దీ వద్ద పని చేసినవాడే) చికిత్స చేస్తాడు. టాం కాస్త కోలుకున్న తర్వాత, ఇద్దరూ కలసి గ్లూసెస్టర్ గుండా అప్టన్ నగర పొలిమేరలకు చేరుకుంటారు.

అక్కడ అడవిలో ఆర్తనాదం వినిపిస్తుంది. టామ్ పరిగెత్తి ఒక స్త్రీని బలాత్కరిస్తున్న నార్దర్టన్‌ను చితగ్గొటి, ఆమెను రక్షిస్తాడు.

ఆ సుందరి పేరు మిసెస్ వాటర్స్ మధ్య వయస్కురాలు. భర్తను వదిలి, ఈ నమ్మక ద్రోహితో లేచివచ్చింది. ఆమె కష్టాలు విని కరిగిపోతాడు టామ్. రోజూవచ్చి తనకు ధైర్యం చెప్పి వెళ్లమని టామ్‌ను వేడుకుంటుంది మిసెస్ వాటర్స్.

సామర్సెట్ షైర్‌లో సోఫియాకు విరహం పెరుగుతుంది. మరోపక్క తనను పెళ్లి చేసుకొమ్మని బ్లైఫుల్ రోజూ వేధిస్తుంటాడు. వివాహం ఇష్టం లేదని ఎంత చెప్పినా తండ్రి కూడా తన మాటవినడు. "నా ఆజ్ఞను ధిక్కరిస్తే ఇంట్లో వుండొద్దు" అంటూ కన్న కూతుర్నే దూరం చేసుకుంటాడు స్క్వేర్ వెస్టర్న్.

చెలికత్తె ఆనర్‌తో కలసి ఇల్లు వీడిన సోఫియా అనేక ఊళ్లు తిరిగి, ప్రియుడి అన్వేషణలో అప్టన్ చేరుకుంటుంది. అక్కడ సత్రం యజమానురాలు, తన అతిథిగా వుంటున్న ఒక యువకుడి గురించి చెబుతుంది. వర్ణనను బట్టి అతడే టామ్ అని గ్రహిస్తుంది సోఫియా. హాల్లో ఒక మూలన తాగినమత్తులో జోగుతున్న పార్ట్రిడ్జ్ కూడా కనిపిస్తాడు. తక్షణం టామ్‌ను కలవాలని సోఫియా తాపత్రయం. "ఆయన గదిలో ఇప్పటికే ఒక స్త్రీ వున్నది. మీరుకూడా వెళ్లి ఏంచేస్తారు? " అంటుంది

యజమానురాలు.

మరొక స్త్రీ అతడి జీవితంలో ప్రవేశించ గలదని ఊహించని సోఫియా, తన ఆన వాలు ఒకటి అక్కడ వదిలి వెళ్లిపోతుంది.

కొన్ని గంటల తర్వాతగాని టామ్‌కి విషయం తెలియలేదు. ప్రియురాల్ని వెదక టానికి హడావిడిగా ప్రయాణమవుతాడు. అప్పటికే అక్కడికి చేరిన వెస్టర్న్, టామ్‌ను చెడామడా తిట్టి తనుకూడా కూతురికోసం బయల్దేరుతాడు. అయితే వంశగౌరవాన్ని మంటగలపిన సోఫియాను చంపాలనేదే అతడి ఉద్దేశం.

'ఎక్కడని వెదుకుతావు? ఇంటికెళ్లి నిరీక్షించు' అని మిత్రులు సలహా ఇచ్చినా, టామ్ తన అనుచరుడితో కావెంట్రీ, డావెంట్రీ, స్ట్రాట్‌ఫర్డ్, డన్‌స్టేబుల్, సెయింట్ అల్బాన్స్ తదితర ఊళ్లన్నీ తిరుగుతాడు. చివరకి ఆమె లండన్ వైపు వెళ్లిందని తెలుస్తుంది.

లండన్ ఒక మహానగరం. అక్కడున్న వందలాది సంపన్నుల విలాసహర్మ్యాలలో ఎక్కడ దాగిందో! టామ్ తన అన్వేషణ కొనసాగిస్తాడు. లేడీ బలాస్టన్ ఇంట్లో సోఫియా వున్నట్టుగా తెలుసుకుని, తన ప్రేమను మన్నించమని ప్రాధేయపడతాడు. ఆమె గౌరవం కాపాడటానికే తాను నార్దర్టన్‌తో యుద్ధం చేశాడు. ప్రియుడ్ని విడిచి వుండలేనని సోఫియాకు కూడా తెలుసు.

అప్పటికి టామ్, మిసెస్ మిల్లర్ ఇంట్లో అతిథిగా వుంటున్నాడు. ఆమె ఆల్వర్దీ ఆశ్రితురాలు. టామ్ ఇంటికి చేరేసరికి, ఆల్వర్దీ నుండి వచ్చిన ఉత్తరం గురించి చెబుతుంది. మిసెస్ బ్లైఫుల్(బ్రిడ్జెట్) మరణించింది. ఆల్వర్దీ, మాస్టర్ బ్లైఫుల్‌తో కలిసి కొన్నాళ్లు లండన్‌లో గడపటానికి వస్తున్నాడు. అందువల్ల టామ్ తక్షణం ఇల్లు ఖాళీ చెయ్యాలి.

కథ క్లైమాక్సుకు చేరుకున్నది.

కూతురి వేటలో వెస్టర్న్ లండన్ వస్తాడు. టామ్ మీద మరులు పెంచుకున్న మరొక స్త్రీ మిసెస్ ఫిట్జ్‌పాట్రిక్. తనకు పోటీగా వున్న సోఫియాను తొలగించుకోవాలని ప్రయత్నిస్తుంది. ఈ విషయం తెలిసి, ఆమె భర్త టామ్‌ను డ్యుయెల్(కత్తి యుద్ధం)కు ఛాలెంజి చేస్తాడు. యుద్ధంలో టామ్ అతణ్ణి తీవ్రంగా గాయపరుస్తాడు. హత్యానేరం మీద పోలీసులు అతణ్ణి అరెస్టు చేస్తారు. మొదట కత్తి దూసింది తను కాదంటాడు టామ్ కాని, అతని మాట ఎవరూ నమ్మరు.

ఈ అనూహ్య పరిణామాలకు ఆల్వర్దీ విస్తుపోతాడు. సరిగ్గా అప్పుడే మిసెస్ వాటర్స్ ఒక జన్మరహస్యం వెల్లడిస్తుంది. అనాథ అని అందరూ అనుకుంటున్న టామ్ నిజానికి ఆల్వర్దీ మేనల్లుడే. కొంత కాలం అతడింట్లో అతిథిగావున్న మిస్టర్ సమ్మర్‌కూ, బ్రిడ్జెట్‌కూ మధ్య ప్రేమాయణం నడిచింది. వాళ్ల సంతానమే టామ్. ప్రసవం జరగగా చూసిన ప్రత్యక్ష సాక్షి తానే. మరణశయ్య మీద, బ్రిడ్జెట్ ఓ ఉత్తరం రాసి మాస్టర్ బ్లైఫుల్‌కిచ్చిందని, అతడు దాన్ని వారికి చూపించానని అబద్ధం చెప్పినట్లుగా ఆమె ద్వారా తెలుస్తుంది. నమ్మక ద్రోహం చేసినందుకు మాస్టర్ బ్లైఫుల్‌ను ఇంట్లోంచి వెళ్లగొడతాడు ఆల్వర్దీ. ఫిట్జ్‌పాట్రిక్‌కు ప్రాణాపాయం తప్పుతుంది.

స్క్వైర్ వెస్టర్న్ స్వయంగా తన కూతురి వివాహం టామ్‌తో జరిపిస్తాడు.

ఇది చదివిన వాళ్లకు పాతసినిమా కథ ఏదైనా గుర్తుకు వస్తే, ఆపాపం ఫీల్డింగ్‌ది కాదు. రెండున్నర శతాబ్దాలలో టామ్ జోన్స్ ఎన్ని రకాల రూపు మార్చుకుని తరతరాల పాఠకులను, ప్రేక్షకులను ఎంతగా అలరించిందో!

—ఎం.వసంత

## అక్టోబరు నవల 'మునెమ్మ'పై పాఠకుల సమీక్షలు

### ఆమె శత్రువును జయించింది

రూ. 100/- పొందిన సమీక్ష




బొల్లి గిత్తను జయరాముడు ఎందుకు చావబాదాడు? అన్న సస్పెన్స్‌తో మొదలైన కథ ఏంవి జేసిందో నీకు తెలవదా? ఏంవీ తెలవనట్టు మాటాడతా ఉండావు గదనే... అన్న మాటలతో ఊపం దుకుంటుంది. ఏకబిగిన ఆసాంతం నవలను చదివేదాకా ఆగలేని ఉత్కంఠ. కేశవరెడ్డి మిగతా నవ లల్లో మాదిరిగానే కథా ప్రదేశం ఒంటిల్లు గ్రామం. కథాకాలం అర్ధ శతాబ్దిక్రితం నాటిది. భర్త చావుకు కారణాలు తెలుసుకొని అతడి చావుకు కారకులైన వారిమీద బొల్లిగిత్త సాయంతో మునెమ్మ ప్రతీకారం తీర్చు కోవడంతో కథ ముగుస్తుంది.

ఇందులో సినబ్బ ముఖ్య కథకుడు. మునెమ్మ సాయమ్మత్తలు ఎక్కడెక్కడ అవసరమో అక్కడ కథను వినిపిస్తారు. గాండ్లాయన, తరుగులోడు, మందులోడు, పూటకూళ్ళింటి ముసలి దంప తులు, కల్లంగడి ఈడిగాయన కథకు ఆయువు పట్టులాంటి సన్నివేశాలను వివరిస్తారు. సామె తలు, చిత్తూరు ప్రాంత నుడికారాలు, మునెమ్మ కన్న కల, పశువుల సంత, కాణీపాకం ఉదం తాలు కథకు పరిపూరకాలు.

కేశవరెడ్డి రచనల్లోని ప్రత్యేకత- జంతువులు, పశువులు మనుష్య పాత్రలను మించి ప్రవర్తిం చడం. వాటి చుట్టూ కథ తిరగడం. 'అతడు అడ విని జయించాడు'లో చుక్కపంది, మునెమ్మలో బొల్లిగిత్త యిందుకు నిదర్శనాలు. మునెమ్మ బొల్లి గిత్తలో తన భర్తను చూడగలుగుతుంది అన్న భావన- బొల్లిగిత్త వేసిన రంకెలో జయరాముని గొంతు స్పష్టంగా వినిపించడం, జయరాముణ్ని పిలిచినట్లు గిత్తను 'పిలగా' అని పిలవడం వల్ల రూఢి అవుతుంది.

మునెమ్మ పట్టుదలకు, ప్రతీకారానికి, తార్కిక తకు, విజ్ఞతకు, విచక్షణకు, ధైర్య సాహసాలకు, సమయోచిత ప్రవర్త నకు ప్రతినిధి. అభేద్యమైన జయ రాముడి చావు వెనక ఉన్న రహ స్యాన్ని ఛేదించడంలోనేమి, శత్రు వును అంతమొందించడంలోనేమి ఆమె చూపిన ఓర్పు, నేర్పు ప్రసం శనీయం. 'నీ చుట్టూ ఉన్న శక్తు లతో నువ్వు నిరంతరంగా సాగించే పోరాటమే జీవితం' అన్న సత్యం మరోసారి ఈ నవల ద్వారా తెలు సుకుంటాం.

విపరీతమైన వేదన ద్వారా సిద్ధించిన యోగమే మునెమ్మ అంతర్‌దృష్టికి కారణం. భర్త మరణ రహస్యాన్ని విశ్లేషించడంలో ఇది ప్రము ఖంగా వ్యక్తమౌతుంది. సిక్స్ సెన్సంటే ఇదేనేమో!

అపూర్వమైన ఇతివృత్త విశేషం, అసమానమైన కథా కౌశలం, జీవద్భాషలోని సౌష్టవం, సౌందర్యం ముప్పేటగా సాగిన దృశ్యకావ్యం 'మునెమ్మ' నవల. నిడివి తక్కువైనా ప్రణాళిక లోని చిక్కదనం, అత్యంత సూక్ష్మ విషయాలను సైతం విస్మరించకుండా సాగిన కథనం, వినూత్న శైలీ విన్యాసం నవలా గాఢతను పెంచే అంశాలు!

అవసరం అన్నీ నేర్పుతుంది. గొడ్డుక్కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది అన్న మాటలతో నవల ముగుస్తుంది. ఔను! అన్యాయాన్ని గొడ్డు కూడా సహించదు అని అప్పుడు రావిశాస్త్రిగారు 'గోవులొ స్తున్నాయి జాగ్రత్త' చెప్తే ఇప్పుడు కేశవరెడ్డి బొల్లిగిత్త చేసి చూపిందీ అదే.

**– టి.వి.ప్రసాద్, నల్గొండ**

## మనస్తత్వ విశ్లేషణ

రూ. 75/- పొందిన సమీక్ష

మనిషి మనసు చదవగల్గిన మహాత్ముడె వరూ లేరు అంటారు. అది నిజమే. మానవ మనస్సు చేసే విచిత్ర విన్యాసాలు ఎవరూ అర్థం చేసుకోరు. క్షణంలో ఒకరిమీద ద్వేషం. మరు క్షణంలో ప్రేమ. ఇలా క్షణక్షణాలకి రంగులు మార్చే ఊసరవెల్లిలా మనస్సు కూడా రకరకాల భావాలను క్షణంలో మార్చుకుంటూ ఉంటుంది. ఫ్రాయిడ్‌లాంటి మానసికవేత్త కూడా మనస్సు చేసే చిత్ర విచిత్రాలను గురించి సంపూర్ణంగా

విశ్లేషించలేకపోయాడు. అక్టోబరు చతుర నవల 'మునెమ్మ' కూడా మానవ మనస్తత్వ విశ్లేషణకు చేసిన ఒక ప్రయత్నం. మునెమ్మ సామాన్యురాలు. చదువు రాదు. అయినా మనుషుల మనస్తత్వాన్ని ఆమె అంచనా వేసిన తీరు అమోఘం. ఒక జంతువైనా బొల్లిగిత్త తన యజమానిని చంపినవానిపై పగ తీర్చుకున్న వైనం. చిన్నప్పటినుండీ తన ప్రాణ సమానంగా పెంచిన గిత్తైనా తన భార్యమీద కన్నేసిందని తెలిసి జయరాముడు దాన్ని శిక్షించినదీ అన్నీ మనసు చేసే విచిత్రాలే. రూ. 500ల కోసం తరుగులోడు, మందులోడు సాటి మనిషిని కొట్టి చంపడం, చివరి క్షణంలో తను చంపిన వాడి భార్య చేతి పాలు తాగి మందులోడు చనిపోవడం. వాడిలో చివరి నిముషంలో కల్గిన పశ్చాత్తాపం దానికి నిదర్శనం. పెనిమిటి చచ్చిపోయాడన్న నిజాన్ని కలలో చూసి, దాన్ని శోధించి సాధించిన మునెమ్మ వాళ్ల అంత్యక్రియలు జరిగాక నిశ్చింతగా రెండు రోజులు నిద్రపోయి మళ్లా తన బతుకు బాట తాను చూసుకుంది. భర్తను చంపిన వారిని కనిపెట్టి, చంపి ఆ తర్వాత తన జీవితానికి సంబంధించిన ముఖ్యమైన నిర్ణయం తీసుకుంది. "అవసరం ఏదైనా నేర్పుతుంది సినబ్బా. ఈ మాట గొడ్డుకు కూడా వర్తిస్తుంది" అన్నమాట ఈ నవల సారాన్ని మొత్తం వివరిస్తుంది. డాక్టర్ కేశవరెడ్డిగారి శైలి అద్భుతం. ఎక్కడా ఆపకుండా చదివించే ప్రవాహంలాంటి శైలి వారిది. నిత్యసత్యాలైన ఎన్నో విషయాలను ఎంతో సూటిగా, చిన్న వాక్యాలతో చెప్పడం కూడా వారి శైలి ప్రత్యేకత. "వినిపించని వాటిని గురించి, కనిపించని వాటిని గురించీ మనం బాగా ఆలోచించాల్సి ఉంది" "సత్యం నీటి అడుగున గులకరాయి వలె పడి ఉంది. నీళ్లు కలకబారి ఉన్నాయి. నీళ్లు కలకతీరే వరకు వేచి వుండటమే మనం చేయాల్సిన పని" ఇలాంటి నిత్యసత్యాలు కూడా ఈ నవలలో చెప్పారు. నిరక్షరాస్యురాలు, అనాగరికురాలు. భర్త చాటు భార్య అయిన మునెమ్మ ధైర్యం మాత్రం ఎప్పటికీ స్మరించుకోదగ్గది.

*-బి.యామిని, గుంటూరు*

## ఏకబిగిన చదివించింది

రూ. 50/– పొందిన సమీక్ష

1945 రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో రాయలసీమలో ఒక కుగ్రామం ఒంటిల్లులో జరిగిన కథ. గ్రామంలోని జయరాముడి కుటుంబం. తల్లి సాయమ్మ, భార్య మునెమ్మ కాకుండా జయరాముడికి తమ్ముడి వంటి బొల్లి గిత్త. ఒకరోజు అనూహ్యంగా మునెమ్మ వద్ద ప్రదర్శించిన అశ్లీల ప్రవర్తనకు కోపంతో రుద్రుడై జయరాముడు ఆ గిత్తని రక్తంకారేలా బాదాడు. మరునాడు ఆ గిత్తను ఆ ఊరికి నలభై రెండు మైళ్లదూరంలోని మద్దిపాలెం పరసలో అమ్మివేయడానికి దానిని తీసుకొని వెళ్లినవాడు తిరిగి ఇంటికి రాడు. బొల్లిగిత్త మాత్రం ఒంటరిగా వచ్చేస్తుంది. దీనితో కలకలం చెందిన మునెమ్మ తన భర్తను ఎవరో చంపివేశారన్న బలమైన శంకతో లోనై వరుసకు మరిది అయిన సినబ్బతో రెండు రోజులు నడిచి మద్దిపాలెం పరసకు వెళ్లి భర్త హంతకుడిని పోల్చుకొని బొల్లిగిత్త ద్వారా అతడ్ని చంపి తన పగతీర్చుకుంటుంది. తర్వాత తానే ఒంటెద్దుబండి నడిపి జీవించాలనుకుంటుంది. సూక్ష్మంగా కథ ఇది.

కేశవరెడ్డి కథంతా సినబ్బ మాటలతోనూ, మిగతా పాత్రలతోనూ చెప్పిస్తారు. ఆనాటి పల్లె ప్రజల జీవనాలు, వారి భాషలోనే అద్భుతంగా రచించారు. పల్లెలో జరిగిన సంఘటనలు మన కళ్లకెదురుగా జరుగుతున్నట్లు అనిపిస్తుంది.

ఒక చిన్న కథని చదవడానికి కొన్ని రోజులు తీసుకొనే 73 ఏళ్ల నేను 'చతుర' కొన్న మొదటి రోజునే ఏకబిగిన మునెమ్మ కథని చదివించేలా చేసిన రచయితని అభినందిస్తున్నాను.

కథలో చాలా పాత్రలు వస్తాయి. ఏదీ అనవసరమనిపించదు.

పూటకూళ్ల ఇల్లు నడిపే ధృతరాష్ట్రుడి కళ్లు గల ముసలమ్మ, బ్రహ్మచెవుడు ముసలయ్య తమ 70 ఏళ్ళ జీవితంలో కలిగిన అనుభవాల వల్ల మునెమ్మకు తమ మాటలతో క్లూ ఇస్తారు. పరస దగ్గర కల్లు అంగడి నడిపే 'గొప్ప కథకుడి లక్షణాలున్న' ఈడిగాయన, బుర్రమీసాల పరస సంచాలకుడు, తమిళ పోలీసు ఇలా ఎందరో మునెమ్మకు సహాయపడతారు.

ఎన్నో సంవత్సరాల తర్వాత మునెమ్మ రాశానని చెప్పారు కేశవరెడ్డిగారు. తిరిగి అజ్ఞాతంలోకి వెళ్లిపోకుండా మరిన్ని రచనలు చేయాలని కోరుతున్నాం.

*– ఎం.వి. రంగశాయి, హైదరాబాద్*

## నవ రచయితలకు మార్గదర్శనం

రూ. 50/- పొందిన సమీక్ష

**'ము**నెమ్మ' చదివిన తర్వాత, మనసు ఓ పది నిమిషాలు బ్లాంక్‌గా మారిపోయింది. కేశవరెడ్డి ప్రత్యేకత ఏమిటంటే చివరలో పాఠకుడ్ని ఓ రకమైన విభ్రాంతికరమైన విషాద భావనలోకి తోసేసి, రచన పూర్తిచేయడం. విశేషణాలు, అలంకారాలు వాడకుండా మాట్లాడే భాషనే రాయడం ఒక కళ. మొదలు నుంచి చివరిదాకా వామనుడి విశ్వరూపంలా మునెమ్మ వ్యక్తిత్వాన్ని, ధీరత్వాన్ని చక్కగా చిత్రీకరించారు కేశవరెడ్డి.

సుమారు 60 సంవత్సరాల క్రితం నేపథ్యాన్ని అందులోనూ గ్రామీణ వాతావరణాన్ని ఇతివృత్తంగా తీసుకుని రచన చేయడం అభినందనీయం.

'అతడు అడవిని జయించాడు'లో సుక్కపంది, 'మునెమ్మ'లో గిత్త- ఇలా రచయిత జంతు ప్రాధాన్యం గల పాత్రలతో, పాఠకుడిలో ఉత్కంఠ రేపేవిధంగా రచించడం అందరికీ సాధ్యం కాదు.

ఒక రచయిత జీవితాన్ని చదివితే తప్ప, జీవితాన్ని అనుభవిస్తే తప్ప ఆ జీవితంలో ఎగుడు దిగుడులు, దుఃఖం, హాస్యం, క్రూరత్వం ఇవన్నీ రుచి చూస్తే తప్ప, జీవితాన్ని అక్షర రూపంలో చిత్రీకరించలేడు.

నవలలో ఒక సన్నివేశం తర్వాత మరో సన్నివేశం అలా పకడ్బందీగా చదువుతున్నంతసేపు చూపులు పేజీల వెంట పరిగెత్తుతూపోతాయి. అక్షరాలను దృశ్యరూపం చేయడంలో రచయిత ప్రతిభ నిలువెత్తున కనిపించింది. ఈ తరం రచయితలు కేశవరెడ్డి రచనలు చదివితే మరింత విలక్షణ సాహిత్య ప్రయోగాలు ఫలిస్తాయి.

*- రాఘవేంద్ర శ్రీనివాస్, మచిలీపట్నం*

## ఫ్రాయిడ్ దృక్కోణంలో ఆసక్తికరం

రూ. 50/- పొందిన సమీక్ష

**'ము**నెమ్మ' నవలని ఏదో మామూలు కథగా, గ్రామాల్లో జరిగే ఒక అసాధారణ సంఘటనగా, ప్రతీకారం తీర్చుకునే కథగా చూస్తే- అబ్బే ఇదేం నవల అనిపిస్తుంది. కథలో పటిష్టత లేకపోతే, సంఘటనల్ని ఎంత పటిష్టంగా, పకడ్బందీగా సృష్టించినా అవన్నీ చివరకి పేలవంగానే కనిపిస్తాయి.

కానీ ఇదే నవలని ఫ్రాయిడియన్ దృష్టికోణం నుంచి చూడగలిగితే, కథ చాలా ఆసక్తికరంగానూ, ఆశ్చర్యకరంగానూ కనిపించే అవకాశం ఉంది. బొల్లిగిత్తని తమ్ముడిగా చూసుకునే జయరాముడు దాన్నెందుకు చావబాదినట్టు? మదపిచ్చి శృతిమించిన ఆ గిత్త ఇప్పుడు తన ప్రతాపాన్ని పశువుల మీదనుంచి మునెమ్మ మీదికి కూడా మళ్లించింది. ఆ దృశ్యాన్ని స్వయంగా చూసిన జయరాముడు అవమానాన్ని, ఆగ్రహాన్ని అదుపులో పెట్టుకోలేక గిత్తని చితకబాదేడు.. గిత్తలో లైంగికమైన శత్రువు కనిపిస్తుండటంతో దాన్ని అమ్మిపారేయాలని నిశ్చయించేడు.

గిత్త నిజానికి జయరాముడి ఆల్టర్ ఇగో. అది వాడి బాహ్య ప్రతీక. ఈ బాంధవ్యాన్ని పురస్కరించుకొనే అది జయరాముడి హంతకుల్ని పొడిచి, చంపి, కసి తీర్చుకుంది. మునెమ్మ బొల్లిగిత్తని అంగీకరించడం కూడా ఈ రకమైన విశ్లేషణకే అవకాశం కలిగిస్తుంది. ఇప్పుడు బొల్లిగిత్తలో బహుశా జయరాముడు కనిపిస్తున్నాడేమో మునెమ్మకి! డాక్టర్ కలం నుంచి జాలువారిన ఒక ప్రత్యేకమైన కథ ఇది.

*- ఎ.వి. రెడ్డి శాస్త్రి, శ్రీకాకుళం*

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

## కన్న ప్రేమ

చెత్తకుప్పల్లో.. పొదల్లో శిశువుల్ని వదిలేస్తున్న తల్లులు, తండ్రులు ఈ కొంగల్ని చూసి నేర్చుకోవాలి. కోస్టారికాలోని అడవుల్లో నివసించే సన్-బిట్టర్న్ అనే ఈ కొంగ తమ పిల్లలకు ఆహారంగా ఓ కప్పను తెచ్చి ఎంతప్రేమగా తినిపిస్తోందో చూడండి. తాము పెట్టే రెండు గుడ్లనూ వంతులవారీగా కొంగదంపతులు 27 రోజులపాటు పొదుగుతాయిట.



CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78

# 'అన్నదాత' అక్షర సేద్యం... పాడి పంటలకు నైవేద్యం







అంతర్జాతీయ పరిశోధనలకు అత్యంత ప్రాధాన్యమిస్తూ... మాగాణి, మెట్ట పంటలతోపాటు, సేద్య రంగంలో ముడిపడిన అనుబంధ రంగాల గురించి 'అన్నదాత' అందించే సమాచారం ఎప్పటికప్పుడు ఎదురయ్యే సమస్యలకు పరిష్కార మార్గాలను సూచిస్తుంది. అనుభవజ్ఞుల కథనాలను, నిపుణుల సలహాలను 'అన్నదాత'లో మీరు నెలనెలా చూడవచ్చు.

చందాను మాకు నేరుగా పంపేవారికి డైరీని రిజిస్టరు పోస్టులో పంపిస్తాం. దీనికోసం అదనంగా రూ. 40/- కలిపి మొత్తం రూ. 150/- మనియార్డర్ లేదా డీడీ ద్వారా పంపించండి. దానితోపాటు మీ పూర్తి చిరునామాను, పిన్‌కోడ్‌ను స్పష్టంగా పేర్కొనడం మరిచిపోకండి.

## అన్నదాత 2008 డైరీ- రైతు ఇంట... రతనాల పంట

'ఇలా తెరిస్తే... అలా కనిపించే' పద్ధతిలో ప్రయోజనకరమైన ప్రతి అంశాన్ని పొందుపరచిన 'అన్నదాత 2008' డైరీ- అన్నదాత చందాదారులకు కరదీపిక... ప్రత్యేక కానుక! డిసెంబరులోగా అన్నదాత సంవత్సర చందా రూ. 110/-ను ఈనాడు కార్యాలయంలో గాని, ఈనాడు ఏజెంటుకుగాని, మీ వద్దకు వచ్చే మా ప్రతినిధికిగాని లేదా మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీసులో గాని చెల్లించి, వ్యవసాయ విజ్ఞాన సర్వస్వం అన్నదాత 2008 డైరీని ఉచితంగా పొందండి.



---

**చందా పంపాల్సిన చిరునామా:** మేనేజర్, అన్నదాత,
ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఫోన్: 040–23318181 ఎక్స్‌టెన్షన్– 6441
ఫ్యాక్స్: 040–23318555